# నల్లగలువ

## ౧

మా కథానాయకుని బ్రవేశపెట్టుటకుముందు, పదునేడవ శతాబ్దియందు హాలండు దేశమునఁ బ్రవర్తిల్లిన చరిత్రాంశ మొండు ప్రస్తావింపవలసి యున్నది. "డివిటు" వంశ్యులగు 'జాను', 'కొర్నీలియసు' అను సోదరు లా కాలమున హాలండు దేశచరిత్రమునకు సూత్రధారులై ప్రసిద్ధికెక్కిరి. మాతృదేశారాధకులగు నయ్యన్నదమ్ములు స్వాతంత్ర్యప్రియులు గావున హాలండు దేశమునఁ బ్రజాస్వామ్యము నెలకొల్పి, యద్దాని నైశ్వర్యవంత మొనర్చిరి. హాలండు దేశ మా సుదినముల ననుభవించిన స్వాతంత్ర్యము విశృంఖలతాదూరము. వారిరువురిలో నగ్రజుఁడగు 'జాను' రాజ్యవ్యవస్థకు ముఖ్యప్రధానియై, మితవ్యయముఁ బాటించి కోశము సమృద్ధ మొనర్చెను. యూరపు ఖండము నందలి యానాటి నరపాలుర కెల్ల మేటియై, యమిత సత్వసంపన్నుఁడై ఫ్రాన్సు దేశము నేలుచున్న పదునాలవ 'లూయీ' చక్రవర్తితో జాను ప్రధాని నెయ్యము నెఱపుచు రాచకార్యములు చక్కఁబెట్టుకొను చుండెను.

హాలండు, ఫ్రాన్సు దేశములకుఁ బ్రాతపగలు గలవు. "డివిటు" సోదరులు నెలకొల్పిన ప్రజాస్వామ్యము "డచ్చి" ప్రజలకే రుచింపక నానాటికి వెగటు పుట్టుచుండెను. దీనికిఁ దోడుగ నసూయాపరులు కొందఱు డివిటు సోదరులపై లేని దోసములు గల్పించి ప్రజలకు వారియెడ విరక్తి జనింపఁ జేయుచుండిరి. విరక్తమగు ప్రజ దేశమున మఱల రాచరికము నుద్ధ

రింపఁ గోరుచుండెను. "ఆరంజి" రాజవంశీయుఁడు, జాను ప్రధాని కాప్తశిష్యుఁడు నగు "విలియము" రాకుమారుని సింహాపీఠ మెక్కింపవలయు నను నీప్సితము క్రమముగా ప్రకృతివర్గమున బలీయము కాఁదొడఁగెను. "జాను డివిటు" చెంత రాజనీతి శాస్త్రము నామూలాగ్రముగ నభ్యసించి సేనాపతి పదమునందున్న విలియముగూడ పట్టాభిషిక్తుఁ డగుటకుఁ దఱి వేచియుండెను.

అకలంకహృదయులై ప్రజారాధనము సల్పు మహనీయుల కా ప్రజల మూఢ్యమే తుదకు విపత్కరమగుట సర్వకాల సామాన్యమగు వింత. డివిటుసోదరులకుఁగూడ నా యిక్కట్టులు తప్పవయ్యెను. విలియమును హాలండు దేశపాలకునిఁ గావింపవలయు నను ప్రబలతమ మగు ప్రజాభీష్టము నెదుర్కొని ఫలములేదని గ్రహించి జానుప్రధాని తల యొగ్గెను. "డార్టు" నగరవాసియగు నాతని సోదరుఁడు "కార్నీలియసు" మాత్ర మా శాసనమును బ్రతిఘటించెను. అంతట మంది యాతని గృహమును జుట్టుముట్టి యా శాసనముపై వ్రాలు సల్పకున్నఁ బ్రాణములు గొందుమని నిర్బంధించిరి. అప్పటికిఁ గార్నీలియసు నిశ్చలధైర్యమున నిరాకరించెను. కాని, తుద కాలుబిడ్డలు కన్నీటితో సల్పు ననురోధమున కెదురు సెప్పఁజాలక యా పత్రముపై నెట్లెట్లో వ్రాలుంచెను. వ్రాలుచెంత "నిర్బంధముచే" నని మాత్ర మా ధీరుఁడు లిఖించెను.

అంతటితోఁ బ్రజాభీష్టము నెఱవేరెను. కాని యీ డివిటు సోదరులు జీవించియున్నచో హాలండు దేశమునకు క్షేమము లభింపదని యెంచి వారిని దుదముట్టించు నాలోచనములు సలుపఁదొడఁగిరి. ఒక దుర్మార్గుఁడు, వృద్ధుఁడగు

జాను మంత్రిని కత్తితోఁ బొడిచెను; కాని యాతఁడెట్లో యీ గండముదప్పి బ్రతికెను.

పిమ్మటఁ గొంతకాలమునకు "టికర్లు" అనెడు నిర్భీకుఁడగు పాలసుఁడు, కొర్నీలియసుపై రాజద్రోహాపరాధము మోపెను. కొర్నీలియసును నిర్బంధించి, యెట్లయిన నాతనిచే నేర మొప్పింపవలయు నని యెన్నియో హింసల పాలుచేసిరి. ఆ ధీరుఁ డా హింసల కన్నింటికి నోర్చి యచంచలుఁడై నిలిచెను. తుద కా నిష్కళంకుని ద్రోహిగా నిర్ణయించి, న్యాయాధిపు లాతని నుద్యోగమునుండి తొలఁగించి, తత్సంపద సర్వము రాజకోశమునఁ జేర్చి, వానికిఁ బ్రవాసశిక్ష విధించిరి. మంది కంతటితోఁ గోపశాంతి కాలేదు. కొర్నీలియస్ "హేగ్" నగరమందలి కారాగారమున బంధింపఁబడి యుండెను. 1672వ సంవత్సరము ఆగస్టు ఇరువదియవనాఁడు సాయంత్ర మాతఁడు దేశము విడిచిపోఁగలఁడని యెఱిఁగి, కోపఘూర్ణమగు ప్రజ కారాగారము నానాడు ముట్టడించెను.

ఆ దేశద్రోహిని ప్రాణములతో విడుచుటకు మందికి మనసొప్పినదికాదు. నగరపాలకులు ప్రమాదమును శంకించి కారాగృహద్వారమున సాయుధులగు సైనికులఁ గాపుంచిరి. ప్రజాసముద్రము తత్సైన్యవేల నతిక్రమింపఁజాలక న్యాయాధిపతుల చెంతకరిగి, కారాగారము చెంతనున్న సైన్యమును తొలగింపుడని నిర్బంధించెను. ప్రజల యీ కోలాహలమునకు నెదురాడఁ జాలక న్యాయాధిపతులు సేనలను దొలగింప నాజ్ఞ నొసగిరి. సేనాధిపతి యగు "విలియము" ప్రచ్ఛన్న వేషమునఁ బ్రజల దుండగము లన్నియుఁ దిలకించుచుండెను.

ఇంతలో "జాను డివిటు" తన సోదరుని దేశాంతర

మునకు గొంపోవుటకై సాయముల: బూన్చిన శకటముపై నరుదెంచి, కారాగారములోని కేగి, రక్తసిక్తాంగుడై పడి యున్న సోదరు నోదార్చి, ప్రయాణసన్నాహము సల్పు చుండెను. కారాగారము వెలుపల: జెలరేగుచున్న ప్రజల కోలాహలము నాలకించి, ప్రాణములతో: దాము బైటబడు నుపాయము నాలోచించుకొనుచు, నప్పటికి: దా నెట్లో తప్పించుకొని యేగినను, తమ రహస్యపు టుత్తరము లొరులచే బడినచో: బ్రమాదము వాటిల్లునని యెంచినవారై, యాలేఖల రూపుమాప నిశ్చయించుకొనిరి. అవియెల్ల డార్టు నగరవాసి యగు "కొర్నీలియసు వాన్ బారలు" అను సంపన్న గృహ స్థుని చెంతనుండెను. ఆతఁడు కొర్నీలియసు డివిటునకు నమ్మిన శిష్యుడు. కొర్నీలియసు తన నిర్బంధసమయమున, నా యుత్తరముల నెల్ల నొక సంచిలో వైచి, ముద్రవైచి, యివి యిట్టివని చెప్పకయే శిష్యున కప్పగించి వచ్చెను. కావున నా యుత్తరములవలన "వాన్ బారలు"నకుగూడ ప్రమాదము సంఘటిల్లగల దని తలపోసి, వానిని నాశనము సల్పుమని యాతనిపేర నుత్తరము వ్రాయువారై, యచట సాధనములు లేమి, బైబిలు గ్రంథములోని మొదటిపుట: జించి, దానిపై: గొర్నీలియసు ఎట్లో యీ పంక్తులు వ్రాసెను.

"కుమారా!

నేను నీకొసఁగిన కాగితముల సంచిని తగులబెట్టుము. ఆ సంచి విప్పి, లోపలి కాగితములు చూడవలదు. అందలి రహస్యములు నీ వెన్నడు నెఱుఁగరాదు. అట్టి రహస్యముల నెఱిఁగి గోపనము సల్పుట ప్రాణహాని: జేయును. కావున

వానిని గాల్చివేయుము. మా సోదరుల ప్రాణములు రక్షించినవాడ వగుదువు. తండ్రీ! నీవు చిరంజీవి వగుము.

ఆగస్టు 20, 1672 డివిటు"

జానుమంత్రి తన వెంటఁ గారాగారము లోనికివచ్చిన ఆస్థానుచరునకు, సోదరరక్తబిందుకళంకితమగు నాలేఖ నిచ్చి, భద్రముగాఁ గొంపొమ్మని పంపెను.

వెలుపలనున్న జనుల కోలాహల మంతకంతకు నధికమగుచుండుటయు నరసి, యా సోదరులు కారాగారమునుండి బయటఁబడు నుపాయముగానక విచారింపుచుండ, నా కారాగారాధిపుని తనూజ 'రోజా' యను పడుచు వారి భాగ్యదేవత వోలె నెదుట సాక్షాత్కరించెను. బుద్ధిమతి యగు నా బాలిక యయ్యన్నదమ్ముల సంకటమును, వెలుపల వారికై వేచియున్న మహాపదను గుఱ్ఱించి, తన జనకుఁ డెఱుఁగకుండ దొడ్డివాకిటి తాళపుఁజెవి గొనివచ్చెను. బహిర్ద్వారమున వేచియున్న వారి శకటమునుగూడ పెరటిదారిచెంతకు రప్పించెను. ఇట్లు తత్సుఖనిష్క్రమణమునకై నలయు నేర్పాటులెల్ల గావించి వచ్చిన యాపడుచు వారి కా వృత్తాంత మెఱిఁగించి, పెరటిదారిని వెంటనే పారిపొండని హెచ్చరించెను.

ఋజుస్వాంతయగు రోజా తమపట్లఁ జూపిన యవ్యాజ భక్తికి నచ్చెరువందుచుఁ గోర్నీలియసు, ఆమె సమయస్ఫూర్తిని మెచ్చుకొని 'తల్లీ! నేఁడు మా యిరువురి ప్రాణములు రక్షించుచుంటివి. అవ్యాజమగు నీకరుణ కేమి ప్రత్యుపకృతి సల్పగలను? నాకడ నీ బైబిలు మాత్రము మిగిలియున్నది. దీనిని గ్రహింపుము. బిడ్డా! నీవు సౌభాగ్యవతివి, యదృష్టవతివి కమ్మ' అని దీవించెను.

రోజా భక్తిపూర్వకముగ నా పారితోషికము గ్రహించి "నాకింక నిది తోడునీడ కాఁగల"దని పలికి, "నాకుఁ జదువు రాదయ్యెగదా! యీ గ్రంథమును జదువుటకు" అని చింతింపుచు నిట్టూర్చెను.

దారుణకశాఘాతముల కతమునను, బడియ వ్రేటుల చేతను, నొడలంతయు వాచి, యవయవసంధులు తొలఁగి, కాలు గదల్పఁజాలకుండియుఁ గార్నిలియసు, సోదరుఁడు రోజాయు నందిచ్చిన కరముల నిరుగడ నూఁతగాఁ గొని, మెల్లమెల్లనఁ బెరటి వాకిట నా చెరసాల వీడి, యచట సిద్ధముగా నున్న శకటము వారి సాయమున నధిరోహించెను. జాను మంత్రియు సోదరుని చెంత నాసీనుఁడై రోజా నామంత్రణ మొనర్చి, నగరపశ్చిమద్వారము కడకు బండిని సందుదారులఁ బోనిమ్మని బండివాని నాజ్ఞాపించెను.

'డివిటు' సోదరులు తరలి యేగిన పిమ్మట రోజా లోని కరిగి, పెరటి వాకిలి తొంటిమాడ్కి మఱల తాళము వైచి యాతాళపుఁజెవి నొక పాడుబావిలోఁ బాఱవైచెను. ఇంతలో జనసంఘము బహిర్ద్వారముచెంత మూఁగి ద్వారము తీయుమని "గ్రైఫసు" నదలించుచుండెను. అతఁడు తమ మాటలు సరకుగొనకుంట గాంచి, ప్రజాసమితి ద్వారమును బ్రద్దలుచేయ యత్నింపుచుండెను. రోజా యదియెల్ల నరసి యల్లన గ్రైఫసు నావలికిఁ గొంపోయి, 'తండ్రీ! మన కేల యీ బెడద? వాండ్రు ద్వారముఁ బగుల గొట్టినఁ గొట్టనిమ్ము. మనకుఁ బ్రాణరక్షణమే కర్తవ్య'మని యుపదేశించి, లోనికిఁ గొంపోయి, తండ్రితోఁగూడ పాతాళగృహమున డాగెను. గ్రైఫసు నేల మాళిగలో నడుగిడుచు, 'రోజా! నేనిట డాగినచో బంధితుల

గతియేమి?'యని ప్రశ్నింప 'బంధితులకు దైవమేకలఁడు. నిన్ను నేను కాపాడు కొందు'నని జనకుని సందియము వారించెను. ఈ లోపల జనసంఘము కారాగృహద్వారము భగ్నమొనర్చి యొక్కుమ్మడి లోనఁ బ్రవేశించి 'యేరీ! ఆ దేశద్రోహులు. పట్టుఁడు, పొడువుఁడు, చంపుఁ'డని యార్చుచుండెను.

౨

డివిటుసోదరుల శకటము నగరపశ్చిమద్వారము చెంత కేగుసరి కా వాకిలి మూసియుండెను. ద్వారపాలకుని కా యుద యమే పురపాలకుల యాజ్ఞాపత్రముఁ జూపించి, యెవరో తాళపుఁజెవి గొంపోయిరి. డివిటు సోదరుల యెడ నెంతయు భక్తుఁడగు నా ద్వారరక్షకుఁ డీ వృత్తాంతము విన్పింప, జాను మంత్రి నివ్వెఱపడి, విధివిలాసమునకుఁ దల యొగ్గువాఁడై, శకటచోదకుని గాంచి "మఱియొక ద్వారము తెఱచి యుండు నేమో, బండి వడివడిగాఁ బోనిమ్ము, మన యదృష్ట మెటు లున్నదో!''యని పలికెను. సారథి శకటమును మరలించెను.

బండిలోనుండి ద్వారరక్షకునితో మాటలాడుచున్న జాను డివిటును గుఱుతించిన పౌరుఁ డొకఁ డక్కజంపడి, తన పొరుగువారల నెచ్చరించి, త్రోవ కడ్డముగా వారితో మంతన మాడుచు నిలిచెను. బండియు నిలువక మహారయమునఁ దమ మీఁద కరుదెంచుచుండ, వారు 'నిలు నిలు' డని యఱ్ఱపడిరి. రథచోదకుఁడు లక్ష్యము చేయక, స్వామి రక్షణమునకు మార్గాంతరము గానక, తజ్జనము మీఁదికి బండి పోనిచ్చెను. వారిలో నొకఁడు మాత్రము బండిక్రిందఁ బడెను. శకటద్వార

ములు మూసి ప్రాణము లరచేత దాల్చియున్న సోదరుల కీ ప్రమాద మెఱుఁగఁబడదయ్యెను. బండి కుదుపును బట్టి, యేదియో మెత్తని పదార్థముపై చక్రములు జరిగిపోవుట గ్రహించిన కొర్నీలియసు, "అక్కటా! బండిక్రింద నెవ్వఁడో పడినట్లున్నాఁ"డనుచుండఁ, దదగ్రజుఁడు, "పోనిమ్ము, బండి నిలుపకు" మని సారథిని తీవరపెట్టుచుండెను. కాని బండి కదల దయ్యె. "మరల నేమి మునిగినదిరా?" యని ప్రశ్నించు జాను మంత్రికి బండివాఁడు "స్వామీ! యెదుట చిత్తగింపుఁ"డని వీధి చివరనున్న జనసమూహమును జూపెట్టెను.

చెఱసాలలోఁ జొరబడి, పంజరమునుండి పిట్ట లెగిరి పోవుటఁ గని, సహస్రగుణిత క్రోధముతోఁ బఱతెంచుచున్న వారలఁ గాంచి, జాను హతాశుఁడై, "నీ విఁక బండి డిగి పొమ్ము, ప్రయోజనము లే"దని బండివాని నాజ్ఞాపించెను. వాఁడు ప్రాణములు రక్షించుకొన నోల్లక తనకును స్వామి తోడిదే గతి యని యట్లే నిలిచి యుండెను.

జనసమూహ మీలోఁ శకటమును జుట్టుముట్టి, తలుపులు దెఱచి, యాసోదరులను వెలుపలికిఁ బడద్రోబ్బుచుండ నందొక కమ్మరి, సుత్తితో హయముల తలపై మోది చావఁగొట్టెను.

ప్రథమము నుండియు మాఱువేసమున జనసమూహ మును వెన్నంటియేయున్న "విలియ" మప్పు డా వీథిలో నొక ప్రాసాదగవాక్షము చెంత ననుచరద్వితీయుఁడై నిలిచి, యా ఘోరకృత్యమును వీక్షించుచుండెను. విలియము రాకుమారుని యనుచరుఁడగు దళవాయి మాత్ర మా క్రూరకర్మముఁ గాంచ జాలక మారుమోమిడి, "ఎంతదారుణము! జానుప్రధాని నాప్రజలు నేలబడ నీడ్చి చావమోదుచున్నారు. ప్రభూ!

తమరు చిత్తగింపరా!" యనియెను. విలియ మా మాటలకు "నిజము, నిజము, మందికీ సోదరులపై ద్వేషము మిక్కుటమై తోఁచుచున్నది" అని మారుపలికి, యచంచలుఁడై మిన్నక చూచుచుండెను.

ప్రజయు నంతలోఁ గోర్నీలియసును గూడ బండినుండి పడనీడ్చి, యంతకుమున్న శరీరసంధులు భగ్నములై నవయు చున్న యాతని తలపై నినుపబడియతో మోఁదెను. దానితో శిరస్సు బ్రద్దలైన రెండు చెక్కలయ్యెను. అంతటితో నిలువక కొందఱాతని పాదములు పట్టి బరబర నీడ్చుచుండిరి.

ఆ ఘోరమును చూడజాలక విలియ మొక్కపరి కను రెప్ప వేయుటఁ గాంచి, తదనుచరుఁడు, "ఎంతకష్ట మెంత కష్టము! జానుమంత్రిని గూడ పీరు చంపనున్నారు. తమరు మిన్నక చూచెదరా!" యనుచుండ, విలియము మరలఁ గను రెప్పలు సక్కవిచ్చి, యా హింసాకర్మముఁ గనుఁగొనుచు "ప్రజల కోప మనివార్యముగా నున్నది. వారి జోలి కేగుట యేరికిని క్షేమముకాదు" అనియెను.

అనుచరుఁ డంతట నిలువక, "అయ్యో! యా నిర్భాగ్యుని రక్షించువారు లేరా! ప్రభూ! తమ గురువరునికా యిట్టి కష్టము! దీనిని మాన్పు వెరవు కలదే నానతిండు, నా ప్రాణములు పోకడ వెట్టియైన నయ్యనఘుని"—అనుచుండ,

విలియ మాతని మాటల కడ్డువచ్చి "సేనానీ! నా సైన్యముల నాయత్తపఱుపుము. పొమ్ము; సేనలు సిద్ధముగా నున్నచో నెందులకైన మంచిది" యని యానతిచ్చెను. "పలినవారి నీ హంతకుల చెంత నొంటి విడిచి నే నేగవలసిన దేనా?"

"నా కొఱకై విచారింపఁ బనిలేదు, పొమ్ము."

దళవాయి, యీ ఘోరమును వీక్షింపజాలక "వల్లె" యని పనివినియెను.

ప్రజల బడియప్రేటులకుఁ జేతు లొడ్డుకొనుచుఁ దమ్ముని కై పలవించుచు జానుమంత్రి, విలియము నిలిచియున్న యింటి గడపమీఁదికిఁ బోయెను. "నా తమ్ముఁ డేఁడీ! అయ్యో, నా తమ్ముఁ డేమయ్యె" నని య్యాక్రోశించుచున్న యీ వృద్ధున కొకఁడు రక్తసిక్తములగు తన పాణితలములు చూపెట్టెను. జానుమంత్రి యది చూడఁజాలక, "అయ్యో!" యని కన్నులకుఁ జేయి నడ్డము వెట్టుకొనియెను. "కనులు మూసెద వేమి! ఇదిగో, నీ కన్నులు నేను విప్పుదు" నని యొకఁ డాతని కనులు శూలముతోఁ బొడిచెను. జానుమంత్రి కనులనుండి రక్తము చిమ్ముచుండ నింకొకఁ డాతని పెడతలచెంత గుఱిపెట్టి తుపాకి ప్రేల్చువాఁడై; యది ప్రేలమిఁ గాంచి దానిమడిమతో తలపై మోదెను. ఆ దెబ్బకు జానుమంత్రి నేలపైఁ గుప్పగూలి "అయ్యో! నాతమ్ముఁ"డని తుదిసారి యఱచుచుండ విలియము గవాక్షములు మూసికొనెను. ఇంకఁ గొఱవడియున్న కార్యమును మఱియొక పాలసుఁడు తుపాకి ప్రేల్చి తుదముట్టించెను. అప్పటికిఁ దనివిసనని ప్రముక్కుడు లయ్యనఘుని మేనిపైఁ దుపాకులఁ గాల్చిరి. కొందఱు భల్లములతోఁ బొడిచిరి. కొందఱు ఖడ్గప్రహారములు సల్పిరి. ఎల్లవాఁడు దన వంతున కొక రక్తబిందువో, మేని యుడుపులలోని యొక పేలికయో కైకొనువారై, తుద కా సోదరుల కళేబరములను వధ్యశిలచెంత కీడ్చుకొనిపోయి యచట నొక స్తంభమునఁ బాదములతో వ్రేలఁగట్టిరి.

పిమ్మట నీచమతులు గొంద అరుదెంచి, సజీవము లగు నా శరీరములపై హస్తక్షేపమొనర్పఁజాలని కోఱంత వాయ, నింతింతలు కండలు గోసికొని పోయి వీధులవెంటఁ దిఱిగి యీ మాంసఖండముల నమ్ముకొనిరి.

విలియము సేనాపతి యట్లు గవాక్షము మూసికొనిన పిమ్మటఁ గూడ నీ దృశ్యముఁ దలుపుల సందులనుండి చూచు చుండెనేమో చెప్పనేరముగాని, యీ శవముల నురికంబము లకు వ్రేలదీసిన పిమ్మట, వడివడిగ నగరపశ్చిమద్వారము చెంత కేగెను. ద్వారరక్షకు డాతనిఁ గాంచి "అయ్యా! తాళపుఁజెవిఁ దెచ్చితిరా" యని యడుగ 'ఇంద' మని యొసఁగెను. వాఁడద్దానిఁ గైకొని, "మీరించుక ముందుగా నీ తాళపుఁజెవి నొసఁగి యున్నచో డివిటు మంత్రులకుఁ దలుపుఁదెఱచి యుండెడివాఁడను. పాపము, వారు వెనుదిరిగి యేగిరి" అని యెను.

ఇంతలో విలియముసేనాని యనుచరుఁడశ్వారూఢుఁడై యరుదెంచి "తలుపు, తలుపు" అని యఱచెను.

విలియము : ఏమి? 'డెకెను' దళవాయీ! నీ వింక నిచటనే యుంటివా?

డెకెను: ప్రభూ! ఇప్పటికి మూఁడుద్వారములు తిరిగివచ్చితిని. ఏమిపాపమో యన్నియు మూయబడియున్నవి.

విలియము : అగుచో నీతఁ డీ తలుపుఁ దీయునులెమ్ము.

అని తలుపులు దీయించి, తానుగూడ నశ్వారూఢుఁడై చనుచు, డెకెనుతో "వింటివా? ఆ పాపులు డివిటు సోదరుల నిరువురను దుదముట్టించిరి సుమా" యనియెను.

డెకెను : ఎంతఘోరము! ఏలినవారు హాలండు సింహాసన

మధిష్ఠించుట కష్టముగా నా సోదరు లిరువురు జీవించి యుండిననే మేలయ్యెడిదని నా తలంపు.

విలియము : నిజమే, యిది యిట్లు జరుగకుండిననే బాగుగా నుండెడిది. కడచినదానికి వగచి ఫలములేదు. ఇంతకు నిందు మనజోక్యము లేదుకదా. వీరి మరణ వార్తకంటె ముందుగా మనము శిబిరముఁ జేర వలయును, రమ్ము.

అని గుఱ్ఱమును ముందున కురికించి, మిత్రులగు డివిట్టుల దురంతమును వినినప్పుడు లూయీ చక్రవర్తి మోమెట్లుండునో చూడ నబ్బదుకదా యని తలపోయుచుఁజనియెను.

## 3

"డార్టు" నగర వాసియుఁ, గోర్నీలియసు డివిటునకు ధర్మపుత్రుండు నగు "వానుబారలు కోర్నీలియసు" సంపన్నుఁడు. తాతతండ్రులు గూడఁబెట్టిన ధనమును, భూమియుఁ జాలినంత కలవు. డివిటు సోదరు లెంతగాఁ బ్రోత్సహించినను గోర్నీలియసు రాజకార్యముల జోలికిఁ జనక, కలిగినంతలో సుఖముగ ననుభవించుచు, విద్యావ్యాసంగ మొనర్చెడు వాఁడు. చిత్రలేఖన మాతని యభిమానవిద్య. ఆ నాటి చిత్రకారులలో నాతఁడు నొకింత పొగడ్త కెక్కెను. జంతుశాస్త్రమునఁగూడ నాతని కభిమానము మెండు. ప్రకృతిరమణీయత కాతఁడు ముగ్ధుఁడై తదారాధనము సల్పుచుండును. నదీతీరమున నుపవనోపశోభిత మగు నాతనియిల్లుచూడ ముచ్చటఁ గొల్పుచుండును. వాని యింటఁ జక్కని పుస్తకభాండారము గలదు. విద్యాధనములకుఁ దోడు వినయముగూడ వాని నాశ్రి

యుంచుటచే వారు పలుకు బూజ్యులై, యెల్లవారికిఁ దలలోని నాల్కయై మెలఁగుచుండును.

ఆ కాలమున హాలండు పోర్చుగలు దేశములలో బుష్ప జాతులను వివిధదోహదక్రియలచేఁ బెంచి చిత్రవర్ణము లగు కుసుమముల నుత్పత్తి చేయువా రెందఱో బయల్వెడలిరి. ఆ దేశములో, తీఱికగల సంపన్నుల కెల్ల పుష్పజాతులఁ బెంచు టయే పని. ప్రకృతిసౌందర్యోపాసనమే నిత్యకృత్యముగాఁ గాలము గడపు రసికుఁడు కొర్నీలియసు. కావున నాఁతడుఁ గూడఁ బూవుఁదీవల సాక మొదలిడెను. ఆ దినములలో నూతనముగా హాలండు దేశమునకుఁ గొని తెచ్చిన మెట్టకలువలో వివిధజాతుల నుత్పాదించుటయే యా పుష్పవ్యవసాయకులకుఁ బనియై, యా కృషియందు పరస్పరము స్పర్థ వహింపఁ దొడఁ గిరి.

కొర్నీలియసునకు వలసినంత తీఱికయు, విద్యాబుద్ధులును, చేమునుఁగ ధనమును, వీని యన్నింటికిఁ దోడు రస జ్ఞతయుఁ గలవు. కావునఁ గొలఁదినాళ్ళలోనే పుష్పవ్యవసాయ కులలో నాతని పేరు వన్నెకెక్కెను. తన తల్లి "జేను" పేర నొకటియు, గురుఁడగు "కొర్నీలియసు" పేర నొకటియు, రెండు క్రొత్త కలువజాతుల నాతఁడు సృష్టించెను. మొన్న మొన్నటిదనుక చిత్రలేఖకులలో మేటి యనిపించుకొన్న వాఁడు నేఁడు పుష్పలతాకర్షకులలోఁ గూడ వాసికెక్కెను. విశాలమగు గృహోపవనమునఁ గలువమొక్కలకు వలయు సూర్య రశ్మియుఁ, జలువయు, నీడయు లభించు నేర్పాటులు గావించు కొని, పుష్పములఁ దక్క నితరప్రపంచము నెఱుఁగక యాతఁడు కాలము వెళ్లఁద్రోయుచుండెను.

కొర్నీలియసు నింటి పొరుగున "ఇజాకు బాక్ట్సలు" అను మఱియొకఁడు గూడఁ బూవులఁ బ్రోదిసల్పుచుండెను. బాక్ట్సలు, కొర్నీలియసువలె సంపన్నగృహస్థుఁడు గాకున్నను, కుసుమసౌందర్యలుబ్ధుఁడై, కలిగిన యంతలో శ్రమచేసి పూవులఁ బెంచుచుండెను. అతఁడుఁ గూడఁ గలువపూవులలో రెండు క్రొత్తజాతులను సృష్టించి, కొంత ప్రసిద్ధి వడసినవాఁడు. తనకుఁగల కొలఁది పెరటిలోనే యించుకంత మడిచేసి, యందు నానాగోత్రముల కలువ మొక్కలను నారువోసి ప్రాణపదముగా బెంచుకొనుచుఁ, దన ప్రసిద్ధికి, జీవికకు నవియే యాధరువుగా నానందించువాఁడు. పొరుగింటి కొర్నీలియసుకూడఁ గ్రొత్తగాఁ బుష్పవ్యవసాయము మొదలిడిన విషయ మాతఁ డెఱుఁగఁడు.

ఉన్నట్లుండి కొర్నీలియసు, బాక్ట్సలు నింటి దెస తన గృహమునకుఁ గ్రొత్తగాఁ గొన్ని మార్పు లొనరించి, మఱి యొక నూత్నతలము నిర్మించెను. ఆ క్రొత్తయంతస్తులోఁ దన కలువవిత్తనముల నద్దాలయరలలో సమర్చి వలసినంత నీడయు, వెలుఁగును, గాఁకయుఁ, జలువయు లభించు నదు పాయము లొనర్చుకొనెను.

కొర్నీలియసు కట్టించిన క్రొత్త మేడ ప్రాతసూర్యున కడ్డమై నిలచి బాక్ట్సలు పూలమడికిఁ దొంటికంటెఁ గూడ నానుకూల్యము ఘటియించెను. అప్రయత్నముగాఁ దనపూల మొక్కలకు లభించిన యనుకూలతకు బాక్ట్సలు సంతసించుచుఁ, గొర్నీలియసును జిత్రకారునిఁగా నెఱిఁగి యున్న వాఁడుగాన, చిత్రలేఖనమున కనువగు సౌధము నాతఁడు నిర్మించుకొనుచుండె నని తలఁచెను. తుదకుఁ గొర్నీలియసు క్రొత్తమేడలో గవాక్షముల గుండఁ బూలతొట్లు, విత్తన

ముల బ్రదర్శించు కాచనుందసములు మున్నగు వానిఁ దిలకించి యించుక శంకించియు, పూవులఁ బ్రోదిసేయు వాని యింటిని జిత్తరువు వ్రాయ నెంచి కోర్నీలియసు తత్తత్పరికరముల సమకూర్చుకొనుచుండనోపు నని సమాధానపడెను. అయ్యో, మనసుఁ బట్టఁజాలక యొకనాఁటి సంజవేళఁ దన గోడకు నిచ్చెన నైచి దానిపై నెక్కి కోర్నీలియసు దొడ్డిని బరికించి చూచెను. చూచి, నిచ్చెనపై నున్నవాఁడట్లే కట్టెయై పోయెను.

ఆ దొడ్డిలోఁ గలువమడులు, నాకులు దొడుగుచున్న మొలకలు, మడులలోనికి నెలుకలు మున్నగునవి వచ్చి దుంప బెల్లగింపకుండఁ జుట్టు నుక్కుతీఁగె యల్లికలు, మొక్కల కెండ తగులకుండ సమరించిన చలువపందిరులు పరికింపఁగనే బాక్ట్సలు గుండెలో రాయిపడెను.

చిత్రలేఖకుఁ డనుకొన్న కోర్నీలియసు పుష్పకర్షకుఁ డయ్యె నని యెఱుఁగఁగనే వాని కవశత జనియించి నిచ్చెనపై నుండి క్రిందపడెను. ఇఁక నేమున్నది? కోర్నీలియసువంటి ధనికుఁడుఁ బండితుఁడుఁ బూవులఁ బెంచ బూనినచోఁ దనవంటి నిర్భాగ్యపుష్పకర్షకులకు దారియేది? దైవదుర్విపాకము నేమన వచ్చు? ఎంత పని చేసితివోయి కోర్నీలియసు! ఈ పేదవాని నోటికడ యన్నముఁ దీసివైచెదవా? నా చిన్నారి మొక్కలకు నా నిర్భాగ్యపుటింటిలో చక్కని నీడయు, వెలుఁగు లభింపక, నా పడుకగది వానికొసఁగి నేను వెలుపలి వసారాలో నేలఁ గూలుచుండ నీ మొక్కలకుఁ బ్రత్యేకభవనమా! ఈ పేద వానిని నీవింకఁ బొట్టపోసికొనన నీయవు!

అని యసూయాగ్రస్తుఁడై కుములుచుండెను. కోర్నీలియసు సామాన్య ధనికుఁడుఁ గాఁడు. ధనవత్తకుఁ దోడు డివిటు

సోదరుల కాత్మీయుఁడన్న విఖ్యాతి! అట్టివానితోఁ స్పర్థ వహించి తానింక వేగఁగలఁడా! తన మొగ మింక నెవ్వరు చూతురు? పురుషోత్తముఁ డలెగ్జాండరున కోడియుఁ, దన్ను జయించిన వాఁడు జగజ్జేత కదా యని యూఱటచెందెను. బాక్ట్సలు కట్టి యూఱట వోడమదాయెను. కోర్నీలియసు ఎల్లి యొక క్రొత్తజాతి పూవు సృజించి, దానిని జానుడివిటుపేర నంకిత మొనర్చి, సులభముగా నెంతయో విఖ్యాతి నార్జింపఁగలఁడు. తనబోంట్ల కిఁక బ్రదుకుతెరువు లేదుగదా యని వగచుచు, మాత్సర్యమే తనపాలిటి శత్రువుగా బాక్ట్సలం నాటి రేయి నిదుర పట్టక, కోర్నీలియసును దైవమును నిందించెను.

తొల్లి పూవులే లోకముగా నెంచి తత్పోషణపాలన వ్యాపారమున నిమగ్నుఁడై యానందించు బాక్ట్సలుకుఁ దన పూలమొక్కలను వీక్షించుటకుఁగూడ మొగము చెల్ల దాయెను. పొరుగింట నందనవనము పెరుగుచుండ నింక చస మాలిన తన పూలమడితోఁ దనకుఁగాని లోకమునకుఁ గాని యేమిపని యున్నది? కోర్నీలియసు పూలమొక్కలనే పరీక్షించుచు, దినదినము క్రొత్తవన్నెలీను వాని రమణీయత హృదయమున చిచ్చువెట్ట, తన దృష్టియు నాత్మయు వానికే యప్పగించి, క్షణము వానిని గాంచకున్నచోఁ నేమియుఁ దోఁచక; జీవితము నామొక్కల చెంతనే గడపుచున్న బాక్ట్సలు, సూక్ష్మదర్శినియంత్ర మొండు సంపాదించి, దాని సాహాయ్యమున మేడమీఁది మొక్కలను, క్రింద పెరటిలోని నారుమడిని పరిశీలింపు చుండెను. హృదయమున రగులు చున్న యసూయాగ్నికతన వాని కను లగ్నిగోళములయ్యె నా పూవుల నొక్క పెట్టఁ గాల్చి మసియొనర్ప నేరవయ్యె.

తటోవేచి యొక్కపరి ఆ మొలక లన్నింటిఁ గాలమట్టి, పెటికి వైచి, సర్వనాశన మొనర్పవలయునని వాని హృదయమున గుతూహలము వొడమియుఁ బూలపైఁ గల సహజానురాగ మా దురాచరణమునకుఁ బాల్పడనీయదయ్యె. నిరపరాధము లగు నా సుమములను జేతులారఁ గసిమసంగుట కెట్టి కట్టిడి రక్కసున కేనియు మనసొగ్గదన్నచో, చిననాటి నుండియుఁ బూవులఁ జేసేతఁ బెంచిన బొక్సనులు అట్టి కటికతనమునకుఁ జాలునా? మఱి తన నోటికడ జీవనమును; దన విఖ్యాతి నప హరించుటకుఁ గారణభూతములైన యా పూవులు దన కనుల ముందు తలయెత్తికొని, తన్ను గేలిసేయుచుండఁగా మిన్న కుండ జాలునా?

ఇది యిటులుండ, "హార్లము" నగరమునుండి, పుష్ప ప్రియపరిషత్తు, నల్లగలువపూవును సాధించిన వానికి లక్ష వరహాలు పారితోషిక మొసఁగుదు నని ప్రకటించెను. బొక్సను లుతోపాటు, తక్కిన పుష్పకర్షకు లెల్లరు నది యసాధ్యమని మిన్నకుండిరి. కొర్నిలియసు ఆ ప్రకటనము నాలకించి, యాలోచనాధీనుఁడై, ప్రయత్నమునకు సాధ్యముకాని పని యుండునా యని యెంచి, నల్లగలువ జనించుటకుఁ జేయ వలయు నుపాయము లెల్ల నాలోచించి, తత్కార్యమునఁ బ్రవృత్తుఁ డయ్యెను. వర్ణములను మార్చుటకై యెన్నియో దోహదము లొనర్చి నల్లగలువకై ప్రయత్నింపుచుండఁ గనులు మిఱుమిట్లుగొలుపుఁ గెంపువన్నె క్రమముగాఁ గపాయ వర్ణముగాఁ, గపాయవర్ణము గోధుమవన్నెగా, గోదుమవన్నె బూడిదవన్నెగా మాఱి, తుదకు నలుపు వన్నె యించు కించుక తలచూపుచుండెను.

ఈ మార్పులను బరికించుచున్న బ్రాహ్మణులు కడుపు మండి, యొక నాటి రేయి, రెండు పిల్లులను గొని తెచ్చి వాని యొండొంటి పాదములకుఁ బొడవుపాటి బందము వైచి, తన గోడమీఁద నుండి కొర్నెలియసు పూల మడిలోనికి వానిని వదలెను. అవి యిటు నటుఁ బెనఁగి చెటి యొక దెసకుఁ బోఁటి గింజుకొనుచుండ, నా బందపుఁద్రాడు మడిలోని మొక్క జను పెల్లగించి తలక్రిందు చేసి ప్రాణములు దీయుచుండెను. కొంత తడ వా మార్జాలద్వంద్వము, కఠోరధ్వానసమేత ముగా నట్లు గింజుకొనఁ దుదకా బందపుఁద్రాడు తెగి, యవి చెటియొక దెసఁ బాఱిపోయెను.

ఉదయమున కొర్నెలియసు పూలమడి చెంత కరిగి పరీక్షింప, నెన్నియో మొలకలు సమూలముగాఁ బెల్లగిలి, రణరంగమున హతసైనికులవలె నేలబడి యుండుటఁగాంచి, తత్కారణ మారయఁ జాలక విషాదభరితుఁడై, సేవకులను విచారించెను. వాండ్రు, రాత్రి పిల్లులు పోరాడిన ధ్వని మాత్రము తమకు వినవచ్చె ననియు, నంతకు మించి యేమియు నెఱుఁగ మనియు వచించిరి. అంతట సావధాన ముగాఁ బరిశీలింప, నున్ననై చెమ్మ యెక్కియున్న మడిలో మార్జాలపాదచిహ్నములు స్పష్టమై కాన్పించెను.

ప్రాణపదములగు మొలక లెన్నియో విగతజీవములై పడియుండఁ, గన్న బిడ్డలఁ గోల్పోయిన తండ్రిమాడ్కి నా యుదారహృదయుఁ డొకింత తడవు వగచియు, ప్రాణాధిక ములుగాఁ బెంచుకొనుచున్న నల్లగలువ మొలకలు మాత్రము చెక్కుచెదరమి కెంతయు సంతసించి, ఈ మేలు దనకు మిగిల్చిన సర్వేశ్వరున కంజలి వట్టెను. పిమ్మట నిది పనికాదని, రాత్రులం

దామడి చెంతనే శయనింప నొక సేవకుని నియమించి నల్ల గలువలను మేడ మీఁదికిఁ గొంపోయెను.

ఇది యెల్లఁ బరికించుచునే యున్న బాక్ట్సలు నల్లగలువలు సజీవములై యుంటకు వగచి, తన దాయ యదృష్టమును, తెలివిమాలిన యా పిల్లలను నిందించెను. ఈ యల్పప్రయోజనమునకై పుష్పమారకుఁడ నైతిగదా యని విలపించెను.

అది మొదలనుదినము దెల్లవారుజామున కొర్నిలియసు మేడమీఁద దీపము వెలిగించి నల్లగలువ కేవియో దోహదము లొనర్చుచుండుట సూక్ష్మదర్శిని సాహాయ్యమున బాక్ట్సలు చూచుచుండెను. ధీశాలియు, శాస్త్రజ్ఞుఁడు నగు కొర్నిలియసు వివిధవర్ణములగు ద్రవములలో విత్తనముల నాన్పుటయు, నేవియో ద్రవ్యములను నీళ్ళతో మఱిగించుటయుఁ గన్పించుచుండెను నలుపువన్నె యెక్కవలసినవాని నాతఁడు చీకటింటిలో దాచుచుండెను. ఎఱుపువన్నె యెక్కవలసినవాని నెండ కెదురుగా నిలుపుచుండెను. తెలు పెక్కవలసిన మోసులను దర్పణముల కాంతిలో నిలిపి యుంచుచుండెను.

ఇంద్రజాలమువలె నూత్నవర్ణములు సృజించుచున్న కొర్నిలియసు శేముషీవిశేషమున కచ్చెరువడియు, నారాటపడియు, నసూయఁ జెందియు, నా దోహదకృత్యము లెచ్చటఁ గనుచాటయి పోవునో యను భీతిమై, సూక్ష్మదర్శినియందే తన పంచప్రాణములను నిలిపి, తదేకగతిమై, గోడకుఁ జేరవైచిన నిచ్చెనయే యిల్లుగా బాక్ట్సలు కాలముగడపుచుండెను. అసూయాక్రోధవివశుఁడై దోహదక్రియల నవలోకించువాఁడు, కరమునందలి సూక్ష్మదర్శిని "పిస్తోలు"కా భ్రమించి, కొర్ని

లియసు ప్రాణములు గోన నుద్యుక్తుఁడై, పిస్తోలు మీటకొఱకు వ్రేళ్లతో నెమకి, యద్దానిఁ గాంచక హతాశుఁడై మరల నోడ లెటింగెడి వాఁడు.

## ౪

ఈ విధమున సుమసంసారమును బోషించుకొనుచుఁ గోర్నీలియసు కాలముఁబుచ్చుచుండ ౧౬౭౨ వ సంవత్సరము జనవరి నెలలో నొకనాటి సాయంసమయమున "కోర్నీలియసు డివిటు" డార్టునగరమున కేతెంచి, తన ధర్మపుత్రుని జూడవచ్చెను.

కోర్నీలియసు గురుదేవుని భక్తిపురస్సరుఁడై లోనికిఁ దోడితెచ్చి, పూలమొక్కల నన్నిఁటిఁ జూపి, తత్తద్విశేషములు వర్ణించి చెప్పుచుండ, డివిటు శిష్యునితో నేకాంతముఁ గాక్షించెను. అపుడు వెంటనున్న సేవకుల నావల కంపువాఁడై, కోర్నీలియసు, "ఆర్యా! ఇంక నభ్యంతరభవనమున విశేషముల జిత్తగింతురా ?" యనియెను.

చిననాటినుండి కోర్నీలియసు నెత్తి పెంచిన వృద్ధపరిచారిక తక్క సేవకు లెవ్వరు నభ్యంతరభవనమున నడుగిడరు. కావున సేవకుని చేతనున్న దీవియఁ దాగ్రహించి, కోర్నీలియసు దేశికద్వితీయుఁడై కాచగృహముఁ బ్రవేశించెను.

అంతకు మున్న సూక్ష్మదర్శినితో గోడపై నాయత్తుఁడై యున్న బాక్ట్సలు వారిరువురు కాచగృహములోని కరుగుటయు, నచట డివిటు, తన దుస్తులలోనుండి, భద్రముగా ముడిచి ముద్రించిన కాగితపు సంచి యొండు వెలికిఁదీసి శిష్యుని

హస్తముల నిచ్చుటయు; నాత డద్దానిని పుష్పమూలముల దాఁచెడి పెట్టెలో దాచుటయుఁ దిలకించెను.

బొక్సలు, తొలుత నా కట్టలోఁ గలువ విత్తనము లుండనోపుననియు, గురుఁడు శిష్యునకు పూల మొక్కలపైఁగల ప్రీతి నెఱిఁగి, క్రొత్తజాతులు దెచ్చి యిచ్చెను కాఁబోలు ననియు నెంచెను. కాని, యవి పూలజాతులే యగుచో కొర్నిలియను సకుతూహలిౖయె వానిని వెనువెంటనే విచ్చి చూచెడివాఁడు. అట్లు చూడక భద్రముగాఁ దాఁచుటఁ జూడ నవియేవియో వ్యవహారపత్రములు కావచ్చునని నిశ్చయించెను. నిజమున కవి జానుడివిటునకు ఫ్రాన్సుదేశాధీశునకు మధ్య నడచిన రహస్యలేఖలు. అప్పటికే డివిటు సోదరులు ప్రజానురాగమును గోల్పోవుచుండుటచే, నెటుపోయి యెటువచ్చునో యని యెంచి, కొర్నిలియసు రాజ్యతంత్రముతో సంబంధము లేక జ్ఞానసముపార్జనైకరతిౖయె కాలము బుచ్చునని ప్రసిద్ధి వడసినవాఁడు గావున నాతని చెంత దాఁచినచో భద్రముగా నుండుననియు, నెవ్వరు నాతని ననుమానింపరనియుఁ దలఁచి కొర్నిలియసు డివిటు తత్పత్రముల నచట దాఁచనిచ్చెను.

డివిటుసోదరులపై దేశమున వ్యాపించుచున్న నిందలను బొక్సలు కర్ణాకర్ణిగా వినినవాఁడు గావున, నా పత్రములు రాజతంత్రరహస్యగర్భితము లగునని యూహించెను. కొర్నిలియసు డివిటు, ఆ పత్రము లిట్టి వట్టివని చెప్పక, వానిని ప్రాణతుల్యముగా భద్రపఱుపుమనియుఁ, దనకుఁగాని తనయాజ్ఞ గొని తెచ్చినవానికిగాని కాక, యన్యులకు వాని నొసఁగ వలదనియు శిష్యున కెఱిఁగించి పిమ్మటఁ దనయింటి కేగెను.

ఆ పత్రముల రహస్యము నెఱుంగనివాఁడుగాన వానిని

పెట్టెలో భద్రమొనర్చిన పిదప తత్ప్రసక్తిఁ గోర్నీలియసు మఱచెను. కాని బాక్ట్సలు మఱచునా? మింటిపై నెచటనో తొలుత నరచేయి యంతయై కాన్పించి, క్రమముగా విస్తరిల్లి తుపాను గొనితెచ్చు మబ్బుతునుకపై ననుభవజ్ఞుఁడగు సరంగువలె, బాక్ట్సలా కాగితముల మీఁదనే మనస్సు లగ్నమొనర్చెను.

కోర్నీలియసు ఇతరచింతలఁ దిగఁద్రావి నల్లగలువ మీఁదనే ప్రాణపంచకము నిల్పి, దినదినము వలయు దోహదములు సల్పుచుండ ౧౬౭౨ వ సంవత్సరమున నాగస్టు ౨౦ వ నాడు నల్లగలువదుంప మూడు మొలకల నిడెను. నాటి సాయంతన మా యంకురత్రయమును తల్లిదుంపనుండి యల్లన నూడ్చి భద్రముగఁ గొనివచ్చి కాచగృహమున నాసీనుఁడై తదంకురముల ముందిడుకొని యానందవశమున నిట్లు తల పోయఁజొచ్చెను.

"నే నింక నల్లగలువ పూవును సాధించినట్లే! ప్రపంచ మెన్నఁడు కనివిని యెఱుఁగని పుష్ప మీ యంకురములనుండి వికసించినపుడుకదా నా తపస్సు ఫలించుట! నాఁడుకదా యీ కోర్నీలియసు పేరు విశ్వమంతట వ్యాపించి చిరస్థాయియగును! ఈ పూవుకతన నాకు లభించు లక్షవరహాలలో సగము దీనజనమున కొసంగుదును. దేశమును కలవరపెట్టుచున్న నేటి విప్లవ ప్రభంజనుఁడు నాపై సోకకుండఁ బ్రజానురాగము నార్జింతును. వెనుక నొకతూరి యీ యూరిలోని యల్లరిమూక యకారణముగ నాయింటిని ముట్టడించెను. ఏబదివేల వరహాలు పేదసాదలకు నొసంగుదునేని నాకింక నట్టి భయముండదు. నేను నిర్భయముగా నా పుష్పవ్యవసాయము కొనసాగించుకొన

వచ్చును. నాపూఁదోట నింకను పెంచి క్రొత్త జాతులు నాటుటకు ధనము వెచ్చింపవలసి యున్నది. అపురూప పుష్పములకు జన్మభూమియగు ప్రాచ్యఖండమున కేగి యచటి వింత లారయవలసియున్నది. కాని, దేశమున వ్యాపించుచున్న రణగుణధ్వనుల నాలింప నిప్పటిలో నా కా తీర్థయాత్ర కొనసాగునట్లు తోఁచదు."

"ఈ యంకురముల రామణీయక మేమిచెప్ప! వీని నున్నదనము తీరుతీయములుఁ దిలకింప మచ్చలేని నల్లగలువపొడముట నిక్కము. ఈ యంకురముల మేనఁగల నాళములు కంటికిఁ గానరాకున్నవి. ఇంక వీనిపూవులు కాలవర్ణములగుట - కేమి సందియము? ఆ నా చిన్నారిబిడ్డకు నాపేరే పెట్టుకొందును. జగమును మోహింపఁజేయు నా పేరిట నా పుష్పమును గాంచిన వారెల్ల 'సీ పూ వెక్కడి' దన, 'ఇది యెచటపొడమిన' దన, 'దీని నేరు పెంచి' రన, 'ఇది యిట్టి' దని తచ్చరిత్రము నక్కజమ్మువై వర్ణించి చెప్పుకొందురు. కొర్నీలియస్! నీవు చరితార్థుఁడవు. నీ కింతకన్న నేమి భాగ్యము వలయును! నీ వే ప్రాణికి నిసుమంత చెఱుపుచేసి యెఱుఁగవు. నీ పేరేకాదు, నీ పూవులకుఁ దన్నామములు పెట్టినకతన పూజ్యులగు డివిటు సోదరుల పేరులఁగూడ నిరపరాధములగు నీ పుష్పసంతానము లాచంద్రార్కము నిలుపఁ గలవు."

ఇట్లు పలు తలపోతల మునిఁగి మనోరథప్రవాహములఁ దేలుచు నెడనెడ "నా చిన్నారి కూనలారా!"యని యా మోసుల ముద్దులాడుచుండఁ దటాలున సేవకుఁడొకఁడు ప్రవేశించి, "స్వామీ! హేగ్ నగరమునుండి వార్తాహరుఁ

డొకఁడు వచ్చెను." అని తెలిపెను. కొర్నీలియ సా మాటల కులికిపడి "హేగ్ నగరమునుండి వార్తాహరుఁడా! ఎవఁడు వాఁడు ?" అని ప్రశ్నించెను.

సేవకుడు : జానుమంత్రి యాప్తానుచరుఁడు క్రెయిక్.

కొర్నీలియస్: క్రెయిక్ వచ్చెనా? ఇంచుక నిలు మనుము.

అనుచుండఁగనే క్రెయిక్ తత్తఱపాటున లోనికివచ్చి "ఆర్యా! నేనింకఁ దడయరాదు" అనియెను. ఆ సంభ్రమము గాంచి నివ్వెఱపడిన కొర్నీలియసు చేతనున్న యంకురములు జాఱి నేల బడెను. ప్రాణాధికము లగు నా మొలకల నెమకి కొనుచుఁ గొర్నీలియస్ "ఏమోయి! యీ తత్తఱపాటు. విశేషము లేమి ?" అని ప్రశ్నించెను,

క్రెయిక్ "సర్వము నిందు గలదు. తమరు చదువు కొనుఁడు" అనుచు నొకకాగితము బల్లపై నుంచి, తాను లోనికి వచ్చునపుడు వీథిలోఁ బ్రజలు గుమిగూడు చుండుటఁ దిలకించినవాఁడు గాన నేద్దియో యాపద రానున్న దని శంకించి, పరువుపరువున నటనుండి వెడలిపోయెను.

అంకురముల నెమకుచున్న కొర్నీలియసు, "మంచిది, మంచిది, చదువుకొందును లెమ్ము!" అని యన్యమనస్కుఁడై పలికిన పలుకులు మాత్రము క్రెయిక్ చెవిఁబడెను.

పిమ్మటఁ గొంతవడి కా యంకురములఁ గనుఁగొని యవి నలిగిపోయెనేమో యని భయపడుచు, వాని చక్క నొత్తుచు, చంకనుండి జారిపడిన బిడ్డలఁ దల్లివోలె సమా శ్వాసము సల్పుచుండ, వృద్ధపరిచారిక తొట్రుపాటున లోని కేతెంచి, "కుమారా! పాఱిపొమ్ము, పాఱిపొ"మ్మని తీవరింప సాగెను.

కొర్నీలియసు : మరలనేమి యుపద్రవము వచ్చినదే?
దాది : కుమారా! సైనికులు మనయిల్లు ముట్టడించిరి.
కొర్నీ : మన యింటి నేల ముట్టడించిరి ?
దాది : అయ్యో తండ్రీ! నీకొఱకే.
కొర్నీ : నా కొఱకా ?
దాది : నిన్ను నిర్బంధింతురట.
కొర్నీ: నన్ను నిర్బంధింప నేటికే వెఱ్ఱిదానా ?
దాది : ఏమి పాపమో కుమారా! వారుగో, మేడమీదికి వచ్చుచున్నారు. పాఱిపొమ్ము. ధనకవశాదుల వెంటఁ గొనిపొమ్ము. తండ్రీ! జాగు సేయకుము.
కొర్నీ : పాఱిపోవుటకు మార్గమేది ?
దాది: ఆ గవాక్షము గుండ క్రింది కుఱుకుము తండ్రీ! అయ్యో! నేఁడెట్టి దుర్దినము ?
కొర్నీ : ఇంత యెత్తునుండి క్రింది కుఱుకుటయా!
దాది : భయములేదు. క్రింది నేల మెత్తగానున్నది.
కొర్నీ : మంచిమాట చెప్పితివి! నా పూల మొక్కలపై పడు మందువా!

అనుచు నాతఁడు గవాక్షమునుండి తొంగిచూడ సాయుధులగు భటులు గానవచ్చిరి. ఇంక నాతఁడు చేయునది లేక యేదియెట్లయిన కానిమ్మని చేతనున్న యంకురముల మాత్రము క్రేయి కంతకుమున్ను బల్లపై నిడిపోయిన యుత్తర మిది యది యని యరయక వేగముగ నద్దాన మడచి, భద్రముగ తన దుస్తులలో డాచెను. వృద్ధధాత్రి నిట్టూర్పుచుఁ గనుల నీరిడికొనుచు నిలిచియుండెను. సైనికు లింతలో లోని కేతెంచిరి. వారి నాయకుఁడు "కొర్నీలియసు నీవేనా?" యని,

యాతనిఁ దొల్లి యెఱింగినవాఁడయ్యు నాచారము నిర్వర్తించెను. "నేనే" అని కొర్నీలియసు మాఱు పలికెను.

నాయకుడు : రాజద్రోహుల రహస్య పత్రములు నీ చెంత నున్నవఁట. వాని నిచ్చివేయుము.

కొర్నీ : రాజద్రోహుల రహస్య పత్రములా!

నాయకుడు : అవును. ఆశ్చర్యము నటించెదవేల? డివిటు సోదరుల రహస్య పత్రములు గడచిన జనవరి నెలలో నీ చెంత దాచనిచ్చిరి.

ఆ మాటలచేఁ గొర్నీలియసు కావిషయము జ్ఞప్తికిఁ దగిలెను. ఆ పత్రముల నిజస్వభావ మెఱుంగనివాఁడు గావున, "నాయొద్ద రాజద్రోహ పత్రములు లేవు" అనియెను.

నాయకుడు : మహాశయా! ఇంక నేటికీ దాఁపఱికము? నీ కాచగృహ మిదియే కదా?

కొర్నీ : ఇదియే.

నాయకుఁడంతట, దనహస్తమున నున్న కాగితముల వంక నొకపరి చూచి, యంతట నాగదియెల్లఁ గలయఁజూచి, "ఆ పత్రముల నొసఁగుదువా? లేదా?" యని మరల నడిగెను.

కొర్నీ : నే నా పత్రముల నీ కిడఁజాలను. అవి నావికావు. పవిత్రన్యాసభంగము నా వలనఁగాదు.

నాయకుడు : అగుచో, డాక్టరు కొర్నీలియస్! ఈ పెట్టె దెఱచి యందున్న పత్రముల నా కర్పింపుము. ఇది రాజాజ్ఞ.

అనుచు, కొర్నీలియసు, ఆ నాఁ డా పత్రముల డాచిన పెట్టెను గేలఁజూపెను. అధికారుల కీ వృత్తమెల్ల నింత స్పష్టముగ నెట్లు తెలిసెనా యని యోజింపుచుఁ గొర్నీలియసు

తత్పేటిక విప్పకుండుట గాంచి, నాయకుఁడు, "మంచిది, నేనే తెఱచెదను లెమ్ము" అనుచు నా పెట్టె విప్పి, యందున్న లత్తాములమూల వెలికిఁదీసి, పిమ్మట డివిటు సోదరుల పత్రముల సంచి, నందు చెక్కు చెదరకున్న దానిని గ్రహించి, దాని ముడి విచ్చి, లోపలనున్న పత్రముల లక్షించి చూచి, "నిజమే! మాకుఁ దెలియవచ్చిన వృత్తము యథార్థమే" యనుకొనుచుఁ గోర్నిలియసును గాంచి, "నీవు నావెంటరమ్ము. నిన్ను చెఱపట్ట రాజాజ్ఞయైనది" అనియెను.

కోర్ని : నేను చేసిన యపరాధ మేమో?

నాయ : నీ నేరమును న్యాయాధిపతులు హేగు నగరమున వివరింపగలరు. నడుప్రము.

ఆ మాటలకు భ్రాన్పడిన కోర్నిలియసు, ఇంచుక వడికిఁ దెలిసి, గోలుగోలున నేడ్చుచున్న వృద్ధధాత్రి నాలింగన మొనర్చికొని, కన్నీటితో నిలిచియున్న సేవకుల నామంత్రణమునల్పి, వాకిట నిలిచియున్న యశ్వశకటము నధిరోహించెను. ఆ బండియు నతిరయముఁ హేగు నగరమునకుఁ దరలి పోయెను.

హేగు నగరమున నానాఁడే డివిటుసోదరుల చిత్రవధ జరిగినమాట పాఠకులు మఱచి యుండరు.

౫

కోర్నిలియసు పెట్టెలోనున్న కాగితముల రహస్య మధికారుల కెఱిఁగించినది బాక్స్టలే యను విషయము మాపాఠకు లూహించి యుందురు. రాజద్రోహాపరాధ మారోపించి కోర్నిలియసు డివిటును చెఱఁబెట్టినది మొదలు బాక్స్టలీ

యుత్తరముల రహస్యమును వెల్లడింప వలయునని యాలోచింప మొదలిడెను. కాని నిరపరాధి యగు కోర్నీలియసు నన్యాయముగ నాపదపాలుచేయుట కాతని మానస మొక్కపట్టున నొప్పినది కాదు.

కోర్నీలియసుడివిటు రాజద్రోహి యనుట స్పష్టము. ఆతని రహస్యమును దాచిన తదాప్తశిష్యుడుగూడ రాజద్రోహి కాక తప్పదు. బాక్స్టెలు రాజభక్తుడు. తనవంటి రాజభక్తులు రాజద్రోహుల రహస్యముల వెల్లడించుట పాపము కాదు; మీదు మిక్కిలి, యా రహస్యము నధికారుల కెఱిగింపనిచో దానుగూడ రాజద్రోహి కాగలడు.

ఇట్లు మనస్సును సమాధానపఱచికొని బాక్స్టెలు ౧౯ వ తేది యందొక "యాకాశరామన్న విన్నపమును" స్థానికాధికారుల కంపెను. అధికారు లా వర్తమానము నెఱింగిన వెంటనే కోర్నీలియసును నిర్బంధించి కొంపోయిరి.

ఆనాడు బాక్స్టెలు తనగదినుండి వెలుపలికిరాడయ్యె. పొరుగింట దనకతమున మూడుచున్న యాపదను గనులార వీక్షించుట కాతనికి ధైర్యము చాలలేదు. ప్రాణహత్య గావించిన దోషివలె నాటి పవలెల్ల నింటిలో డాగి యుండి, కోర్నీలియసును చెఱసాల కంపిరనువార్త సేవకుని వలన విని, నాటి రేయి పురమెల్ల మాటుమణగిన పిమ్మట నల్లన పొరుగింటి దొడ్డిలోనికి డిగియెను.

పూల మడిలో నెచ్చట నే మొక్కయున్నదో వానికి గరతలామలక మేకావున, నల్లగలువ మొక్క యుండుచోటు నెమకి యద్దాని గననేరడయ్యెను. ఒకవేళ పొరపడి యుండునా యని శంకించి, మరల మర్ల వెదకి, తుద కా

ప్రదేశ మెల్ల వేళ్లతోఁ బెల్లగించి, ఫలముగానక హతాశుఁడై మరల దనయింటిలోనికి వచ్చెను. నాటి పవ లెల్ల నింటిలో మూల ముడిఁగి యున్నవాఁడు గావున, నా నల్లగలువను కొర్నీలియసు పెల్లగించుట నాతఁ డెఱుఁగడు.

అన్యాయముగాఁ గొర్నీలియసును విపదంబుధి ముంచితినే యని కొంతవడి దుఃఖించి, "కానిమ్ము. ఆ మొక్కలు తప్పక కారాగృహమున నుండును. ఇంతపని జేసినవాఁడ నింక సందేహింప నేల?" యని, పొడవుపాటి నిచ్చెన సంపాదించి, కారాగృహగవాక్షము లానాఁడు కొర్నీలియసు తెఱచినవి తెఱచినట్లే యున్నవి కావున, నా దారిని లోనఁ బ్రవేశించెను. భర్తృహీనమై పాడువడిన యా యింటిలో వాఁ డట్లు దూఱి, తాను దొంగతన మొనరించుచుంటినే యని యించుక తెలిసి, కొంతవడి నిశ్చేష్టుఁడై నిలిచెను. ఇంక నెట్లును బ్రారంభించిన కార్యము దుదముట్టింపక తీఱదని మనసు రాయిచేసికొని, కంపితగాత్రముల నాగది యెల్ల నెమకెను. తన ప్రాణమునకుఁ బ్రాణమగు నా నల్లగలువ కాన్పించలేదు. బీరువాలు తెఱచెను, పెట్టెలు శోధించెను, మూలమూలల నరసెను. కాని చేసిన తెగువ యెల్ల వ్యర్థమయ్యెను. తన కాహారనిద్రాదుల మార మొనర్చి స్వప్నావస్థయందు గూడ సాక్షాత్కరించెడు నిష్టదైవము నచట వెదకి, కానక, తన దౌర్భాగ్యమును నిందించుకొని యిట్లు తలపోసెను.

"అయ్యో! నే నెంత బుద్ధిహీనుఁడ నైతిని; కొర్నీలియసును గారాగారకూపమునఁ బడఁద్రోసి, వాని నల్లగలువ నపహరించి, తన్మూలమున యశోధనము లార్జింప నెంచిన నా యూహ లన్నిఁటి నాదుర్దైవము మట్టిపాలు చేయునే! ఇంతకుఁ,

ప్రాణాధికమగు నల్లగలువను కొర్నీలియసు క్షణమైన నెడబాసి యుండఁగలఁడా ! నా మందబుద్ధి కీ యాలోచన తోఁపమి నెట్టి దుష్కార్యమునకుఁ దెగించితిని. ఐన నేమయ్యె? కొర్నీలియసు హేగునగరమునఁ జెఱయందున్నాఁడుగదా! ఆతఁ డెచట నుండునో కలువయు నచటనే యుండును. అది యెచట నుండునో నాకు నదియే యావాసము. నా ప్రాణము హేగునగరమున నుండ నా కీపాడు డార్టుపురమున నేమి పనియున్నది? ఈ నా బొందియ నచటికే చేర్చెదను. నెచ్చెలీ! నల్లగలువా! యిదె నీ దాసుఁడు నీ పాదసన్నిధి కరుదెంచుచున్నాఁడు."

అని నిశ్చయించి, యాగది వెడలివచ్చి, నిచ్చెన యథాపూర్వముగ నద్దాని నెలవు సేర్చి, వలువాత లేచి హేగునగరో న్ముఖుఁడై పోయెను.

అచట హేగునగరమునఁ, బ్రజలందఱు కారాగారమును విడచి, డివిటుసోదరుల చిత్రవధ గావించి, యెవరి యిండ్లకు వారేగిన పిమ్మట, నగరమున సద్దు మణఁగుట యెఱింగి, కారాగృహపాలకుఁడగు గ్రైఫసు రోజాతోఁగూడ పాతాళగృహము వెడలివచ్చెను. డివిటుసోదరులు తప్పించుకొని పోయిరను న్యాగ్రహమునఁ బ్రజలు దన్నుఁ గసిమసంగక విడిచిపుచ్చినందుల కిలువేల్పులకు మ్రొక్కుకొనుచు, శిథిలీభూతమైన ద్వారము నెట్లెట్లో మరల బంధించి, లోని కేగుచుండఁ, గొర్నీలియసును గొనితెచ్చిన భటులు తలుపుఁ దట్టిరి. గ్రైఫసు దివ్వె వెలిగించుకొని ద్వారము తెఱచెను.

కొర్నీలియసు బండి దిగి చెఱలో నడుగిడి నలుదెసలు బరికింప, వృద్ధుఁడు, మోటుమానిసియు నగు గ్రైఫసు, వాని వెన్నంటి తిరుగు భయదాకారమగు కుక్కయుఁ దక్క నితర

ప్రాణి కంటబడలేదు. గ్రిఫసు, కొర్నీలియసు గ్రామనామాదు లెఱింగి, యాతని సౌమ్యసుందరయౌవనాకారముం గాంచి, లోలోన నేమో గొణిగికొని, "కొర్నీలియసు డివిటునకు ధర్మపుత్రుఁడవా నీవు? మంచిది, యిఁక నేమి? మీ గురుని గది నీ వాక్రమింతువు, రమ్ము" అనుచు ముందునడువ, కొర్నీలియసు వెంటనేగి మేడమెట్లెక్కుచు, మేడ గదిగుమ్మముచెంత నిలిచియున్న రోజాను వీక్షించెను. ఈ క్రొత్తబంది యెవ్వరా యను కుతూహలమునఁ బడుక వీడివచ్చిన యాపడుచు ముగ్ధమోహనాకార మస్థానమగు నా భయంకరకారాగృహమధ్యమున, నా దీవియ వెలుతురులో రమణీయమై ప్రకాశించెను. పాపటనుండి చెదరి పిల్లగాలి కించు కించుక చలించుచున్న ముంగురులతోఁ గ్రొత్త మానిసి యెదుటఁ బడుటచే నలమిన యొకించుక లేతసిగ్గుకతమున కించిదవనత మగు వదనముతో, రెప్పలు గెడవ్రాలి సోగలై విశాలములైన నేత్రములతో నమ్ముద్దరాలు జాలి గడల్కొను చూపుల నా పడుచువానిం గాంచుచు నిలిచెను.

కొర్నీలియసు, మేడమీఁది గదిఁ బ్రవేశించెను. అచట డివిటుసోదరుఁడు బాధచే మూల్గుచు నా మధ్యాహ్నము దనుక బడియుండిన మంచమును గేలఁజూపి, గ్రిఫసు "ఇదిగో మీ గురుని శయ్య, యీ గది మీదే, యిందువసింపుము!" అని వచించి, తలుపుమూసి వెడలిపోయెను. ఆ కుక్కిమంచముపై గొర్నీలియసు రేయెల్ల జాగరము సల్పి, ప్రత్యూషవేళ లేచి గవాక్షము చెంతకేగి నలుదెసలఁ జూపులు నిగిడ్చెను.

కారాగారమున కవ్వలిదెస మిట్టనేలపై నేదియో నల్లని వస్తు వాతని కండ్లఁబడియెను. ఇంచుక నిదానించి చూడ

నా కపర కపర వెలుఁగునం దా పడుచువాని కచట నొక బల్లపై నేవియో పెద్దపెద్ద యక్షరములు గాన్పించెను. ఇంచుక పరికించి చూడ నందు, "పరాసుజేని కాప్తమిత్రులు, దేశ ద్రోహులు, తోడిదొంగలు నగు డివిటుసోదరులు వ్రేలు చున్నారు" అని వ్రాసియుండెను. కోర్నీలియసు తొలుతఁ దనకన్నుల నమ్మజాలక, మరల నా యక్షరపంక్తిఁ జదువుకొని "హా" యని పెద్దపెట్టున కేకవైచి, యొడ లెఱుంగని క్రోధమున గదితలుపులు మాటిమాటికిఁ దన్నసాగెను. ఆ గందరగోళముచే గ్రైఫసు మేల్కాని, తాళపుఁజెవ్వుల గుత్తిఁ గైకొని వడివడిఁ బర తెంచి తలుపుదీసి, "నీకేమి పోఁగాలము వచ్చినదా, తలుపులట్లు బ్రద్దలు సేయుచున్నావు! నీకు వెఱ్ఱి యెత్తినోపు. మీ డివిటువంశము వారికి వెఱ్ఱి యెత్తుట సాజ మువలె నున్నది" యని విసువుకొనియెను.

కోర్నీలియసు తటాలున గ్రైఫసుచేయి గ్రహించి వానిని గవాక్షముచెంతకు లాగికొనిపోయి, "యచట వ్రాసియున్న యక్షరము లేమి?" యని యడిగెను. గ్రైఫసు, "ఎచ్చట నెచ్చట" నని యడిగి, తుదకు నురికంబము దెసఁ జూపు నిగిడ్చి, "యవియా? ఆ యక్షరములు నీ కంటఁబడినవా? తెలియుచునే యున్నదిగదా! నన్నడిగెద వేల? ఆయుష్మంతుఁ డగు మా యేలిక విలియము శత్రువుల కెల్ల నట్టి శాస్తియే జరుగును". అని తెలిపెను.

కోర్నీలియసు, "డివిటు సోదరులను హత్యయొనరించిరా అక్కటా! యెంతకష్టము" అనుచు గనులుమూసికొని, మరల మంచముపైఁ గూలి, బాలునివలె వలపోయుట గ్రైఫసుచూచి "ఇందు హత్య యేమున్నది? ప్రజలు న్యాయము విచారించి

యీ దేశద్రోహుల శిక్షించుట పాత్య మెట్లగును?" అని సమా ధానము సెప్పి, కోర్నీలియసు నిశ్చేష్టుఁడై పడియుంటఁ గాంచి, మరల తలుపులు తాళమువైచి "ఈ భాగ్యమున కెంత గందర గోళము సల్పినాఁడు!" అనుకొనుచు వెడలిపోయెను.

కోర్నీలియసు ఒడలెఱింగి, తనయున్నయునికి స్మరించు కొని, యాస్తిక్యబుద్ధిగలవాఁడు కావున నించుకవడి పరాత్ప రుని ధ్యానించి, డివిటుసోదరుల యాత్మలకు శాంతిఁ బ్రసా దింపు మని వేఁడుకొనెను.

పిమ్మటఁ దనదుస్తులలోఁ బదిల పఱచియుంచిన యిందీ వరమూలముల వెలికిఁదీసి, యచట నొకరాతిపై జలపాత్రము చాటున వానిని గుప్తముచేసి, "ఇన్నియేండ్లు నేఁ బడినశ్రమ మెల్ల నారడిపోయె, నా మధురమనోరథములు మంటగలిసి పోవునే! నా యభాగ్యపుబ్రదుకుంబలె, నా కన్న యి య్యపు రూపపుప్పసంతానముకూడ గతిమాలి నశము నంతరింప వలసిన దేనా! ఈ రాతిగోడల మధ్య గఱికపోచయుఁ బుట్టదు. ఇంత మంటిపెళ్లయుఁ గాన్పించదు. రవికిరణలేశ మేనియు నీ కూపమునఁ జొఱఁబాఱదు. నా యీ కూనల నెట్లు సాకఁ గలను?" అని పలువితముల తలపోఁతలఁ జిక్కియుండ నొక చిత్రము జరిగెను. ఆ చిత్ర మేమో రాఁగల ప్రకరణమున వివరింతుము.

౬

గ్రైఫసు, బంధితున కానాటి యుదయము భోజనము దెచ్చుచు మెట్లపై కాలుజాఱి, బడఁకుండ చేతిపై నానుకొని నంతటఁ జేతికీలు దొలఁగిపోయెను. కీలు దొలఁగిన విషయము

గుర్తింపక గ్రిఫసు, తన్ను లేవఁదీయ నరుదెంచుఁ గోర్నీలియ సును, "మఱియేమియుఁ దొందరలేదు. నీ వటనుండి కదల కుము" అని యానతిచ్చుచుఁ, జేయి నేలపై నానిచి, లేవఁ బోయి కీలుతొలఁగుట గ్రహించెను. తనకు సంఘటిల్లిన ప్రమా దము గ్రహింపఁగనే యా కటికయెడంద గ్రిఫసు, భయము పెల్లున నొడలు వశముదప్పి, మూర్ఛిల్లెను.

అంతసేపు తలుపు తెఱచియే యున్నను, కోర్నీలియసు కాసమయమున నటనుండి పాఱిపోవలయునను బుద్ధి జనించి నది కాదు. తన బందకాఁడు మూర్ఛిల్లఁగనే యాతఁడు గది వెడలివచ్చి వానిని లేవఁదీసి, యుపచారములు సల్ప యత్నించుచుండెను. తండ్రి పడిన చప్పుడు విని, రోజాయు నింతలో నటకు వచ్చెను. కోర్నీలియ సామెరాక నెఱుంగఁడు. నేలఁబడియున్న తండ్రిని, దండ్రిపై వంగియున్న కోర్నీలియ యసును గాంచి, వారిరువురు జగడ మాడి యుందురనియు, కోర్నీలియసు తనతండ్రి పాటునకుఁ గారణమై యుండు ననియు నామె యనుమానించెను.

ఇంతలో గోర్నీలియసు తలసెత్తి యా పడుచుంగాంచి, యామె యింగితము గ్రహించెను. రోజాయు వెంటనే యథా ర్థము గ్రహించి, "నన్ను మన్నింపుఁడు, మీ యెడల లేని దోసము నూహించితిని. మీ సద్భావము నెంతని కొని యాడుదును" అని నీరు నిండిన కనులతో వచించెను.

ఆ మాటలకుఁ గోర్నీలియసు, తల యించుక వంచి, "యిందు కృతజ్ఞత కేమిగలదు! తోడి ప్రాణియెడల నాధర్మము నిర్వర్తించుచున్నాను" అని మాఱు పల్కెను.

రోజా యంతట, "ఇందాక మిమ్ముఁ దూలనాడినవాని

పట్ల మీారు నెఱపు నీ యుపకృతి కేవలధర్మనిర్వాహణ మని పించుకొనదు. భూతదయను మించిన పరమానుగ్రహ మిది'' యనియెను.

ఈ ముద్దరాలి హృదయమున నిట్టి యుదారమధుర భావము లెట్లు నెలకొన్నవో యని యబ్బురపడుచు నాతఁడు గ్రైఫసు హస్తము బరీక్షించుచుండ నా వృద్ధుఁడు గనులు విచ్చి, "నాకర్మము, నాసొమ్మేమో పడిపోయిన ట్లింత పెందల కడ వీని కీ యున్నము పట్టుకొని రా నేల? ఇచటఁ జేయి విఱుగఁ బడనేల? నాగతి విచారింప నొరుల కేమియవసరము? విఱిగినది నాచేయియే కదా?'' యని సణగుచుండ రోజా వారించి, "నీ వాయనను దప్పుఁదలఁచుచున్నావు. చూడుము, నీ కాతఁడు సాయపడుచున్నాఁడు'' అనెను.

గ్రైఫసు "నా కీతఁడు సాయపడుటయా?'' యని సందేహింపుచుండ, కోర్నిలియసు "అయ్యా! నిజము, నా కించుక వైద్యశాస్త్రమునఁ బ్రవేశము కలదు. మీా చేయి చక్కఁజేయఁ గలను'' అనెను.

గ్రైఫసు: నిజముగా నాచేయి చక్కఁజేయఁ గలవా?

కోర్ని : నిశ్చయముగా.

గ్రై: చేయికట్టుట కేమివలయునో చెప్పుము, చూతము.

కోర్ని : రెండు కొయ్యబద్దలు, నింతదూదియుఁ జాలును.

గ్రై: రోజా! వింటివఁటే. ఈతఁడు నాచేయిఁ గుదుట బఱచునఁట. మంచిది, వీని మూలమునఁ గొంత వ్యయము తప్పినను దప్పినట్లే. నన్నించుక లేవఁ దీయుము.

అనుచు దిన్నగానున్న చేతితోఁ గూఁతురి మెడఁ గౌఁగి

లించి యాతఁడు లేచినంతఁ గోర్నీలియ సచట నొకయాసన ముపైవానిఁ గూరుచుండ నిడి, రోజా కొనివచ్చిన యుప కరణము లందికొని, తొలఁగిన కీలును బాటునకుఁద్రోసి కట్టుకట్టెను.

కీలును జక్కఁద్రోయుటలో వృద్ధుఁడు మరల మూర్ఛిల్లఁ, గోర్నీలియసు, రోజాతో "ఇంచుక చల్లనినీళ్ళు దెమ్ము; మొగము కడిగినచో నీతఁడు తెప్పిఱిల్లును" అనియెను.

అతఁడు చెప్పిన చొప్పున రోజా నీరముఁ గొనిరాక, వాని దఱియనరిగి, "ఆర్యా! మీకు నాయొనర్చుఁ బ్రత్యుప కార మంగీకరింపుఁడు" అని పల్కెను. కోర్నీలియ సా మాట విని, "నీ తలఁపేమి?" యని యడిగెను.

రోజా : ఎల్లి మిమ్ము విచారించు ధర్మాధికారి నేఁ డిటకు వచ్చి, కోర్నీలియసుడివిటును బంధించిన గదియందే యిపుడు మీరుండుట విని, పక్కున వికృతపునవ్వు నవ్వెను. నాకుఁజూడ మీ రాపదపాలు గాఁగల రని భయమగుచున్నది.

కోర్నీ : అగుఁగాక, నాకాతఁ డేమి కీడు చేయఁగలఁడు?

రోజా : ఆ యురికంబము దెసఁ జూడుఁడు.

కోర్నీ : నే నేమైన దోస మొనర్చినఁగదా భయపడుట !

రోజా : చిత్రవధ పాలై యచట వ్రేలుచున్న డివిట్టులు మాత్రము దోసము సలిపిరా?

కోర్నీ ; నిజమే !

రోజా : మీరు దోష మొనర్చితిరో లేదో యెవరికిఁ గావల యును? మిమ్ముల నెల్లి విచారించుటయు, మఱునాడు దండించుటయు నిజము. ఈ దినములలో న్యాయవిచా-

రణమున నాలస్య ముండదు.

కార్ష్ని : అగుచో, నన్నిపు డేమిచేయుమందువు!

రోజా : నే నొంటిదానను, అబలను, మాయయ్య మూర్ఛ మునిఁగి యున్నాఁడు. కుక్క కట్టివేయఁబడినది. మీరు పాఱిపోవుట కింక నిచట నడ్డ మేమున్నది?

కార్ష్ని : ఏ మంటివి ?

రోజా : ఏ మంటినా? మిమ్ము పాఱిపొండంటిని. పూజ్యులగు డివిటుసోదరులఁ గాపాడలేక పోతిని; మిమ్మైనఁ గాపాడనిండు. ఆర్యా! జాగుసేయకుఁడు. అదె! మా యయ్య కదలుచున్నాఁడు. క్షణ మాలసించినఁ గార్యము దప్పును. సందేహింతు రేల !

ఆ మాటలు వినినిపోక్క తనవంకఁ దేఱకొనఁ జూచుచున్న కార్ష్నిలియసును గాంచి, యాపడుచు చిడిముడిపడుచు, "అట్లు మిన్నక చూతు రేల? మీకు నామాట లర్థము కాలేదా?" యని ప్రశ్నించెను.

కార్ష్ని : అయినవి; కాని,

రోజా : కాని,——

కార్ష్ని : నేను పాఱిపోను, పోయినచో నీపై నేర మెన్నుదురు.

రోజా : (సిగ్గు పడుచు) మీ కా యాలోచనము వలదు. నామాట వినుఁడు.

కార్ష్ని : బాలా! నీ మంచితనము మెచ్చఁ గూర్చుచున్నది; కాని, నేను వెళ్ళను.

రోజా : వెళ్లరా! దైవమా! యిది యేమి పట్టుదల! మీ రింకను గ్రహింపకున్నారు గదా! డివిటులను వలెనే మిమ్ముఁ గూడ చిత్రవధ గావింతు రీ పాపులు. నన్ను

గూర్చి చింతింపకుఁడు. మీా రిటనుండి పొతిపొండు. డివిట్టుల కీ ప్రదేశ మాపత్కారము."

గ్రైఫను ఇంతలో నోడ లెటింగి, "వివరిచట, దుర్మా ర్గులు, దేశద్రోహు లగు డివిటుసోదరుల పేరెత్తుచున్నారు ?" అని యఱచెను. ఆమాటలకు గోర్నెలియసు, సౌజన్యము వెల్లి విరియ, నల్లన నవ్వి "అయ్యా ! మీారు తీవరపడకుఁడు; కీలు కొలంగిన స్థితిలో వేగిరపడుట మంచిదికాదు" అని సమాధా నము సెప్పి, రోజాతో మెల్లగా, "కుమారీ ! నేను నిర్దోషిని, నిశ్చింతమై కాఁగల విచారణమునకు శిర మొగ్గుదును. నా కిం తయు భయములేదు" అనియెను.

రోజా : ఇశ్శ్. మనము మాటలాడుచుండుట మాయయ్య యెఱుఁగఁ జనదు.

కోర్నె : ఎఱిఁగినఁ బ్రమాదమా ?

రోజా : కాదా ? న న్నింక నిటకు రానీయఁడు.

అమ్మగుద మంతనపు మాటల కెడఁద ద్రవింపఁ గోర్నెలియసు, తన్ను భాగ్యశాలిగా నెంచుకొనుచుండ, గ్రైఫను, "ఏమి యీా గునగుస" లని గద్దించెను.

రోజా : నీ కిడఁదగిన పథ్యపానము లెక్కించుచున్నాఁడు.

గ్రైఫ : నాకా పథ్యము ! నీకు నే నొకపథ్యము చెప్పెదను వినుము. నీ వింక నెన్నఁడు బంధితుల చెంతకు రాఁ జనదు; వచ్చిన నచటఁ దడయఁ జనదు. తెలిసెనా ? ఇఁక దారితీయుము.

కోర్నెలియసు రోజా లొండొరులఁ జూడ్కులచే హెచ్చ రించుకొనిరి.

"నేను చెప్పినంతయు జరిగెనుగదా" యను నర్థమును

రోజా చూడ్కి ప్రదర్శింప, గోర్నీలియసు చూపు, "కానిమ్ము, అంతయు నీశ్వరేచ్ఛ" యను భావముఁ బట్టియిచ్చెను.

౭

మఱునాడు చెఱసాలయందే ధర్మాధిపులు కోర్నీలియసును విచారించిరి. విచారించుట కేమున్నది! డివిటు సోదరుల రహస్యలేఖ లాతని చెంత నున్నవనుట స్పష్టమే యయ్యెను. కాని యా లేఖలను నిందితునకుఁ గోర్నీలియసు డివిట్టిచ్చెనా? లేదా? యని సంశయము. ఆ విషయమున నించుకయు దాపరికముంచక జరిగిన వృత్తమెల్ల నిందితుఁడు పూస గ్రుచ్చినట్లు విన్పించెను. అంతియకాక, తనకు రాజ్యతంత్రములతో నెన్నఁడు సంబంధము లేదని చెప్పి, చిననాటి నుండి తా నభ్యసించిన చిత్రలేఖనాదివిద్యలు, శారీరకభౌతికాది శాస్త్రములు, తుద కలవడిన పుష్పలతాపాలనము, విశేషించి కలువ పూవులపై దనకుఁగల యభిమానము మున్నగు స్వవృత్తము నెల్ల విన్పించెను. ఆచార్యుఁడు తన కా కాగితముల నిచ్చినపుడే వానిని గలువదుంప లుండు పెట్టెలో దాచితి ననియు, మరల నెన్నఁడు వాని మొగ మెట్టిదో యెఱుగ ననియుఁ దెలిపెను.

కలువదుంపలకొఱకు నిందితుఁ డాపెట్టె నిత్యము తెఱచుచుండును గాన నాతఁడు కాగితముల మరలఁ జూడకుంట యసంభావ్య మని విచారణకర్తలు వచించిరి. పెట్టె నిత్యముఁ దెఱచుచున్నను తన దుంప లెండఁబాఱెనో, మొలక యెత్తెనో

చూచుటయే కాని యితరముఁ జూడ నవసరము లేదని నింది తుఁడు సమాధానము వచించెను.

ఆ పత్రముల నిచ్చినపుడు కోర్నీలియసుడివిటు వాని స్వభావ మిట్టిదియని చెప్పియే యుండుననియుఁ, గావున నింది తుఁడు పత్రముల నెన్నఁడుఁ బరామరిక సల్పకుండుట నమ్మ జాల మనియు విచారణ కర్తలు వచించిరి.

ఆ న్యాసస్వభావ మెఱింగియు దాఁచుట ప్రమాద కరమని, బుద్ధిశాలియు, శిష్యవత్సలుఁడునగు తన యాచార్యున కెఱుంగరానిది కాదనియుఁ, గావుననే తనకాతఁడు న్యాస స్వభావము విన్పింప లేదనియుఁ గోర్నీలియసు వాదము.

ఈ లేఖలవలన నిందితునకుఁ బ్రమాదము రాఁగూడ దని కోర్నీలియసు డివిటు దలంచినచో, వాని నిజస్వభావ మును గూర్చి తన ధర్మపుత్రునకుఁ దా నెఱిఁగింపలేదని వ్రాసి, యాకట్టలో నొక కాగితము నిమిడ్చి యుండును. లేదా, తన విచారణ సమయమున నైన, నిందితుని నిర్దోషిత్వమును ధ్రువ పఱచు పత్ర మంపియుండు నని ధర్మాధిపతి యూహించెను.

పూజావిగ్రహముకంటెఁ బవిత్రముగా మందసమున దాఁచిన పత్రము లోరుల కంటఁబడు నని గురు డూహించి యుండఁ డనియుఁ, గావున నాపత్రముల రహస్యము శిష్యుఁ డెఱుఁగఁడని యాతఁ డందు లిఖింప నవసరము లేదనియు, పత్రము మాత్ర మెదియో జానుమంత్రి తన కానాఁడు పంపిన మాట నిజమే యనియు, తా నపు డన్యమనస్కుఁడై యున్న కతన నద్దానిఁ దిలకింపలే దనియు, వెదకినచో నిప్పటికిఁ దన కాచమందిరమున నా లేఖ దొరకవచ్చుననియు కోర్నీలియసు నివేదించెను.

ప్రేయికుఁ హాలంపు విడిచిపోవుటచే వాని సాక్ష్యము దుర్లభము. ఆ పత్ర మిపుడు దొరకుననను నిశ్చయ మేమికలదు! కావున నావిషయముసఁ గోర్టులియఁసుకూడ నంతగా పట్టుఁబట్టఁడయ్యె.

ఇట్లు కొంతదన్క వాదము జరిగినమీఁద నిందితుఁడు తన యభిప్రాయమును శాంతగంభీరవచనముల నిట్లువచించెను.

“ధర్మాధిపా! మీ ప్రశ్నములకు సమాధానముగా నేను యథార్థము మాత్రమే చెప్పగలను. చిత్తగింపుఁడు. ఆ కాగితముల నాగురుఁడు నా కొసఁగినమాట నిజమే యని యింతకు మున్న చెప్పితిని. ఆ యుత్తరముల స్వభావము మాత్రము నాటికి నేటికిఁగూడ నే నెఱుఁగ నని యీశ్వరసాక్షికముగాఁ జెప్పుచున్నాను. అవి జానుడివిటు వ్రాసిన లేఖ లనువిషయము గూడ నన్ను నిర్బంధించు సమయముననే నా కెఱుఁగవచ్చెను. నా యింట నీ యుత్తరము లున్న వను రహస్య మొరుల కెట్లు తెలియవచ్చెనో నా కెఱుఁగఁబడ కున్నది. మందభాగ్యుఁ డగు నా ధర్మజనకుఁడు నా కడ నిడిన న్యాసము నంగీకరించుట యపరాధ మెట్లగునో నే నూహింపనేరకున్నాను. మీఁదఁ దమ చిత్తము.”

పిదప విచారణకర్తలు కొంత తడవు తమలోఁ దాము సంప్రదించుకొనిరి. ఈ పడుచువాఁడు కలువపూవులఁ బెంచు నెపమునఁ బ్రజ కేదియో ద్రోహము దలఁచుచుండ నోపు నని యొకరు నిశ్చయించిరి.

పైకి నిరపరాధులవలె సౌమ్యముగాఁ గానుపించువారే తఱచు ద్రోహచింతనము సల్పుదు రని యొకరు సూచించిరి.

డివిటుసోదరుల కాప్తుఁ డగుటకూడ ననుమానమునకుఁ

గారణ మనియు, నీతఁ డేదియో ప్రతీకారము చేయఁగలఁడు గాన వీనిని విడువఁ జన దనియు నొకరనిరి.

ఈతఁ డొక్కపుష్పవ్యవసాయమునో, రాజతంత్రమునో నమ్ముకొనక రెంటిలో వ్రేలిడుట చూడ నీతఁ డవ్యవస్థిత చిత్తుఁడై యుండవలెను ననియు, నిట్టివాండ్రు ప్రజాశాంతి భంగకారు లనియు ముఖ్య విచారణకర్త తేల్చెను.

తన యేలుబడి కీ యంతరాయమును గూడఁ దొలఁగించినచో నేలిక యగు విలియమునకు విచారణకర్తలపై నను గ్రహము పోడము నని యందఱు నేకవాక్యముగ నిశ్చయించి నిందితుని శిరచ్ఛేద మొనర్ప నాజ్ఞ యిచ్చిరి.

ఇంతసేపుఁ దన గదియందే యున్న నిందితునకు విచారణకర్త లీ తీర్పువార్త నంపిరి.

గ్రైఫసు, చేతికీలు తొలఁగిన బాధచే నానాఁడు జ్వర పడెను. కావున వాని క్రింది యధికారి, వార్తాహరుని వెంట నిడుకొని, నిందితుని గదిలోని కరుగుటఁ జూచి రోజాకూడ నల్లన వెంట నేగి, తలుపువెనక నక్కి యుండెను.

వార్తాహరుఁ డా తీర్పుఁ జదివి వినిపించిన పిమ్మట, "నీ వింక నే మైనఁ జెప్పికొందువా?" యని నిందితు నడిగి యాచారము నిర్వర్తించెను.

కొర్నీలియసు, "నే నింకఁ జెప్పఁ దగిన దే మున్నది! దేహధారికి మృత్యు వెన్నఁడే నున్న దే; కాని నేటి యీ రూపమునఁ గూడ నది సాక్షాత్కరింపఁ గల దని యూహింపనైతి" నని నిర్వికారుఁడై బదులు పల్కెను. ఆ మాట లాలించి యాశ్చర్యమగ్నుఁడై వార్తాహరుఁడు పనుచుండఁ, గొర్నీలియసు వానిని నిల్పి, "అడుగ మఱచితిని, యిది — నా యింగితము

గ్రహింపవా?—యిది యెప్పుడు జరుగును?" అని ప్రశ్నించెను.

వాఁడు, "నేఁడే, పండ్రెండుగంటలవేళ" నని చెప్పి వెడలిపోయెను. తలుపుబంధించి నూతన కారాగృహాధికారియు నేగుచుండ, నందనుకఁ దలుపుచాటున నిల్చియున్న రోజా వాని నిల్పి, వాని కేదియో చెప్పి, తాళపుచెవుల గుత్తిఁ దీసి కొనియెను. వాఁ డంతట రెండు మెట్లు దిగి యచటఁ గూరు చుండెను. మెట్లక్రింద కుక్క కావలి యుండెను.

రోజా యంతటఁ దలుపుఁ దెరచి, కన్నుల బాష్పజల మోడికలు గట్టి, నిశ్వాసభారమున వక్షస్థల ముబికిపడుచుండ, హస్తయుగ మాస్ఫాలించి, "ఆర్యా! ఆర్యా!" యని, యెలుగు కుత్తుకఁ దగుల మఱి మాటలాడ లేకపోయెను.

కోర్నిలియసు రోజా యవస్థ పరికించి భావభరమున, "రోజా! నాకుఁ గాలము చేరువ యైనది. నీ యభిమత మేమియో వేగముగఁ దెలుపుము" అని యడిగెను.

రోజా చేతులు సగ మాకసము దెసకు, సగ మాతని దెసకుఁ జాచి, "నా కొక్క వర మొసఁగుఁడు" అనియెను.

కోర్ని: ఏడువకు రోజా! యేడువకు. నా దుర్విధికన్న, నీ కన్నీరు నా మనస్సును దొందఱ పెట్టుచున్నది. నిరప రాధి నగు నా చావునకు దుఃఖింపజనదు. నిర్వికార చిత్తమున సంతోషముగ నా ప్రాణములు వీడగలను. ఉడుగుము రోజా! దుఃఖ ముడుగుము. చూడుము. నా మాట విందువుగాదు! వట్టి బేలవు గదా నీవు! ఏ డ్పుడిగి చెప్పుము, నీ కేమో వలయునంటివి.

రోజా:—(మోకరించి యంజలి పట్టి) నా తండ్రి యప రాధము సైపుము.

కొర్నీ: (ఆశ్చర్యమున) మీ తండ్రినా, మీ తండ్రినా!

రోజా: అవును; ఆతేఁడు మీ యెడలఁ గ్రూరముగ వర్తించెను. మా యయ్య కది సాజము, ఆతని వర్తన మందఱిపట్ల నంతియే.

కొర్నీ: రోజా! ఆతని క్రౌర్యమునకు ఫలముగా నిన్నుఁ గీలుతోలఁగుట చాలదా! నే నాతని క్రౌర్యము సైచితిని.

రోజా: నే నింక ధన్యను. ఆర్యా! మీ రింక వచింపుఁడు, మీకు నా వలనఁ గాఁ దగిన దేమియు లేదా?

కొర్నీ: (నవ్వుచు) నీ క్రాల్గన్నుల బాష్పము లార్చుకొనుటయే నేను కోరునది.

రోజా: మీ మాట చెప్పుఁడు; వేఱు కోరిక యెద్దియు లేదా మీకు?

కొర్నీ: బేలపడుచా! యింక రెండు గడియలలోఁ జావనున్న నా కేమి గోర్కె లుండును!

రోజా: ఈ యంత్యముహూర్తమున నీశ్వరస్మరణ మొనర్చుకొందు రేని మీ చెంతకుఁ బురోహితునంపుదురు. పిలువ నందునా?

కొర్నీ: నే నిపుడు క్రొత్తగా నీశ్వరస్మరణ మొనర్పనక్కఱ లేదు. ఆనందమయుఁ డగు భగవానుని సుందరసృష్టినే నే నాజన్మము నారాధించితిని. ఇపుడు నాకున్న దొక్కటియే చింత; యది తన్మహిమాలేశమును గూర్చిన చింతయే. రోజా! నీ వా చింత నీడేర్పఁబూనుకొందు వేని సంతసింతును.

రోజా: ఆనతిం డార్యా! యానతిండు.

కొర్నీ: నీవు నవ్వనని ముందుగా నా చేతిలోఁ జేయి వేయలేము.

రోజా: (దుఃఖగద్గద కంఠియై) నవ్వుటయా! అయ్యో! యీ సమయమున నవ్వా! ఆర్యా! మీరు నా కన్నీరు చూచుచుండ లేదా?

కొర్నీ: రోజా! నీతోడి పరిచయ మల్పమైనను, నీ సౌజన్యము నెఱింగితిని. ఇట్టి సౌజన్యసౌందర్యము లొక్కచోట నుండవు. ఇట్టి నీ కోఱికఁ జింతింపని నన్ను సైరింపుము. నే నీ యంత్యకాలమునఁ గ్రొత్తచింతఁ బెట్టుకొనఁ దగదు కదా!

అతఁ డిట్లనుచుండ పదునొకండు గంటలు కొట్టుట వినఁబడెను. రోజా యాపాదమస్తకముగాఁ గంపించి రోమాంచితయయ్యెను.

కొర్నీలియసు రోజాభయకారణము గ్రహించి 'నిజము రోజా! ఇంక నెంతయో వ్యవధి లేదు' అనుచు, డివిటు వ్రాసిన లేఖలో ముడిచియున్న యిందీవరాంకురముల వెలికిఁ దీసి రోజాకుఁ జూపెట్టి యిట్లనెను. "రోజా! నాకుఁ బూవు లనిన నెంతయో ప్రీతి. పూవులకన్నఁ బ్రేమింపఁదగిన పదార్థమింకొకటి కల దని యింతకుమున్ను నే నెఱుంగను. నీ నెమ్మోముఁ ద్రిప్పకుము రోజా! యింకఁ జాటేల? నీపై నాకుఁ బొడమిన ప్రేమ నే నిపుడు చాటిచెప్పినను ప్రమాదము లేదు గదా! నా యీసాహసమును దండించుట కదే వధ్యశిల సిద్ధముగా నున్నది. పూవుల నంతగాఁ బ్రేమించి వానితోడ నే యానందించుచు, వానిలో నెన్నియో క్రొత్తజాతుల సృజించి, తుదకు నల్లగలువను సాధించితిని. ఈ నల్లగలువ రహస్య మొరు

తెలుఁగరు. దానిని సాధించినవానికి హార్లెమునగర పుష్పప్రియ పరిషత్తు లక్షవరహాల పారితోషిక మొసఁగును. ఆ లక్షవరహాలును – వానికొఱకు నేను చింతించుట లేదు సుమీ – అవి యీ కాగితములో నున్నవి. ఇవిగో! దీనిలోనున్న ఈ మూఁడు దుంపలు నా వరహాలను సంపాదింపఁ గలవు. వీనిని నీకుఁ గాన్క యిడుచున్నాను; గ్రహింపుము.”

రోజా: అదియేమి! ఆర్యా!

కోర్నీ: సంశయింపకుము రోజా! వీనిని గ్రహించుట కింక నా కెవ్వరు నాప్తులు లేరు. నాకుఁ దలిదండ్రులు దోఁబుట్టువులు లేరు. ఇంక నా యచ్చపుఁ బ్రీతికిఁ బాత్రు లెవ్వరు లేరు. నన్నుఁ బ్రేమించువారు కలరేమో కాని వారిని నే నెఱుఁగను. ఏకాకినై ఈ చెఱసాలలో దిక్కుమాలియున్న నన్నీతరుణమున నాదుకొని యోదార్చు నీ కన్న నా కింక నాప్తు లెవ్వరు?

రోజా: కాని, యీ సొమ్మల్పము కాదుగదా!

కోర్నీ: రోజా! నేను ముమ్మాటికి నీకే యీ ద్రవ్య మిచ్చుచున్నాను. ఈ సొమ్ము నీ చక్కఁదనమున కనురూపుఁడగు భర్తను నీ కొనఁగూర్చుఁగాక, నీకీ ద్రవ్యము నరణముగా నిచ్చుచున్నాను. సొమ్ము రాదని సంశయించుచుంటి వేమో? నా మాట నమ్ముము. ఈ మూలముల నల్లగలువలు పూచి తీరును. నీ కా వరహాలు లభించి తీరును. నిన్ను నేఁ గోరునది యెల్ల నొక్కటి. నేను నా పువ్వులఁ బ్రేమించినట్లు, నిన్నుఁ బ్రేమింపఁగల యందగాని, నీ ప్రేమ కాకరమగువానిఁ దక్క నొరుని పెండ్లియాడనని నాతో నీ విపుడు బాస

చేయవలెను. నా మాట కడ్డము రాకుము. రోజా! నా బ్రతుకు నిముసములలో నున్నది.

వెక్కి వెక్కి ఏడ్చుచున్న రోజా పాణిపల్లవము లాతఁడు గ్రహించి, "ఇదిగో, యీ యంకురములు సాకు విధ మెఱిఁగింతు వినుము. మా యూరి కేగి. నా తోటమాలి నడిగి, మా తోటలోని యీశాన్యమడిలో నున్న మంటిని దెచ్చి, యొక పెట్టెలోఁబోసి యీ దుంపల నందు నాటుము. ఇంక నేడు నెలల కవి మొగ్గ దొడుగును. మొగ్గ పుట్టినపిదప జాగ్రత్త సుమీ, రాత్రుల శీతవాతమును, బవటివేళ నెండయు వానికిఁ దగులరాదు. ఆ ముకుళములు నల్లనై వికసించును. అవి వికసింపఁగనే హార్లెముసంఘాధిపున కెఱిఁగింతు వేని, తద్వర్ణముఁ బరీక్షించి నీ కా లక్షవరహాలు నిత్తురు."

వేడినిట్టూర్పులు విడుచుచు రోజా వినుచుండెను. ఇంకొక ముహూర్తకాలమున ముగియ నున్న జీవితముకొఱకు కాతఁడు దుఃఖింపఁడు కాని, తన ప్రాణముకన్న నధిక మగు, నల్లగలువపూవును కనులారఁ గాంచు భాగ్యము నోచుకోనఁ గదా యను విచారమునఁ బొడమిన బాష్పకణమును గేలవోఁ దుడిచికొని యాతఁడు మరలఁ జెప్ప సాగెను. "రోజా! నాకు వేఱేమియు కోర్కెలు లేవు. కాని, ఆ నల్లగలువపూవు మన యిరువురిపేరఁ బ్రసిద్ధి కెక్కుట నా యభీష్టము. నాకు లేఖనోపకరణములు దెచ్చి యొసఁగుదువేని నీ జ్ఞాపకార్థ మీ విషయ మెల్ల వ్రాసి యిచ్చెదను."

అటులనే వెక్కి యేడ్చుచున్న రోజా, మొన్న కొర్నీలి యసు డివిటు తనకిచ్చిన బైబిలు నాతని కిచ్చి, "యిది పూజ్యుఁడగు నీ గురుఁడు నా కొసఁగినది. ఈ గ్రంథముఁ బఠింపుచు

నయ్యెనఘుఁడీ చెఱలోఁ దనకుఁ బొడమిన బాధలెల్ల సహించెను. దీని మాహాత్మ్యము నెఱిఁగినదానఁగాన నీకవసరమగు నేమో యని నేఁడు నావెంటఁ గొనివచ్చితిని. నీవు వ్రాయఁ దలచిన దండు వ్రాయుము. నేను చదువు నేర్చుకున్నను, నీ యానతి నిర్వర్తించుటకు వీలొందవును" అని చెప్పెను.

ఇందీవరమూలముల ముడిచిన కాగితము కూడ నా బైబిలులోనిదే యను విషయము పాఠకులు మఱచియుండరు. ఆ గ్రంథమునఁ దుదిపుట యందు దాతఁడు సుస్పష్టముగ, నిష్కంపముగ నిట్లు లిఖించెను.

"ఆన, ౧౬౭౨ వ సంవత్సరము, ఆగష్టు ౨౩ వ దినమున, నిరపరాధినయ్యు, శిరచ్ఛేదమున నీశ్వరైక్యము జెందనున్న నేను, స్థిరచరరూపకమైన నా సంపదయెల్ల ప్రభుత్వవశము కాఁగా, నాకు మిగిలిన సర్వసంపత్కల్ప మగు నీ కలువ పూదుంపలు మూటిని, కారాగృహాధిపుఁ డగు గ్రైఫను కూతురు రోజా యను చిన్నదానికి మనఃపూర్వకముగ సమర్పించుచున్నాను. ఈ దుంపల నల్లగలువ పూవులు పూచుట సిద్ధము గాన హార్లెమునగర సంఘము తా నొసంగు లక్షవరహాలు నీ చిన్నదాని కొసఁగవచ్చును. తన్ను వలచి వలపించు గుణవంతుని, నందగాని, నా వయసువాని నీ పడుచు చేపట్టఁ వలయు నను నిబంధము మాత్రము కద్దు. అట్లు పూచిన నల్లగలువను, రోజా పేరు, నా పేరు కలిసి వచ్చునటుల "రోజా బార్లీని" యని పిలువ వలయును.

ఈశ్వరుఁడు నన్ననుగ్రహించుఁ గాత. రోజా సౌభాగ్యవతియు నాయుష్మతియు నగుఁగాత.

కొర్నీలియసు వాన్ బారల్."

ఇట్లు వ్రాసి, కంటికి మంటికి నేకధారగా నేడ్చు రోజాకు వినిపించి, కంపమానమగు నాపె కెంగేలుదోయి ముద్దిడికొని, విచారసమ్మిశ్రమగ నవ్వుచు, "నా నిబంధనములకు సమ్మతించితివి కదా?" యని యడిగెను.

రోజా: ఏమో? నేనెఱుఁగను.

కోర్నీ: నీ వెఱుఁగమి యెట్లు?

రోజా: ఆకోర్కెలలో నొకదానిఁ దీర్పనేవలనఁగాదేమో?

కోర్నీ: అది యేది చెపుమా; నీ వంగీకరించితివని యెంచితిని సుమా.

రోజా: ఈ సొమ్ము నా కరణముగాఁ గదా యొసంగుచుంటిరి?

కోర్నీ: అవును.

రోజా: నేను వలచిన పురుషునిఁ జేపట్టవలయునని కదా నిబంధనము.

కోర్నీ: నిజము.

రోజా: అగుచో నే నీ సొమ్ము గ్రహింపఁదగను. నే నెవ్వరి - గామింపను. పెండ్లియు నాడను.

ఈమాట లెట్లో పలికి మూర్ఛిలనున్న రోజాను కోర్నీలియసు పడకుండ నిలుపఁబోవు తరుణమున నెవ్వరో మేడ మెట్లెక్కివచ్చు సవ్వడియు శునకారావమును విన వచ్చెను.

రోజా నమ్మాళించుకొని "అయ్యో! వారు నిన్నుఁ గొనిపోవ నేతెంచుచున్నారు. ఇంక నేమైనఁ జెప్పవలసినది లేదుకదా" యని చేతులు బిసికికొనుచుఁ బలికి, మోకరించి, నెమ్మొగముఁ గరతలమున మూసికొనెను.

కోర్నీ : ఈ మూలములఁ బ్రాణపదముగా నెంచుకొని, నే జెప్పినట్లు సాకుము. ఈ నా తుది కోర్కె చెల్లింపుము. రోజా !, నాకింక ననుజ్ఞ యిమ్ము.

రోజా: (తలయెత్తకయే) పెండ్లియాడుట యొక్కటి తక్క ఇంక మీ రేమి యానతిచ్చిన నెఱవేర్తును. అది మాత్రము—అయ్యో! అది నా వలనఁగాదు.

ఇంతలోఁ దలవరియు, గొందఱు భటులు, నొక యధికారియుఁ గోర్నీలియసును వధ్యస్థానమునకుఁ గొంపోవ నేతెంచిరి. వారు సల్పు యత్నమెల్ల నాతఁడు గర్వదూరమగు ధైర్యమున వీక్షించుచు నిలిచి, వారివెంట నేగువాఁడై, రోజా కొఱకొక్కపరి దెసలఁ గలయ నరసి, యా చెంత నొక దారుపీఠమున సొమ్మసిలి వాలియున్న రోజాను, చెదరిన కేశపాశముచేఁ గప్పవడిన నెమ్మోముతో నోడలెఱుంగని యవస్థలోఁగూడఁ గలువదుంపల పొట్లమును గేల బిగ్గ ధరించియున్నదానిఁ గాంచెను. ఆమె వ్రేళుల సందులఁ గాన్పించుచున్న గోర్నీలియసు డివిటు లేఖను చదువు గోర్కె యాతని కప్పుడైనఁ బొడమదయ్యె. దానిఁ జదివినచోఁ దన్ను దన కలువను గాపాడుకొనఁ జాలియుండును. ఇంతకు విధివిలాస మట్టిది !

౭.

వధ్యశిల చెఱసాలకు మూడువందల హస్తముల కన్న నెక్కుడెడము లేదు. వింత జూడ నేగుదెంచిన ప్రజాసమూహముల నొత్తిగించుచు, నిరుదెసల సాయుధులై నిలిచిన సైనికుల మధ్యగా కోర్నీలియసు నడచి యేగెను. నలువైపులనుండి మూగుచున్న ప్రజాప్రవాహముల మధ్య నెత్తియి కాన్పించు

వధ్యస్థానము నడుదీవివలె నుండెను. డివిటుసోదరుల రక్తము జూచిన ప్రజల కన్నులా రుచి మరగి తచ్ఛిష్యుని రక్తముగూడ జవిచూడ వేచియుండెను. తనపైఁ గ్రోధము వెడలఁగ్రక్కుచు దుర్భాషలాడుచున్న ప్రజలయునికి, యంతర్నిహితదృష్టియై యున్న కొర్నీలియసు కెఱుకపడదయ్యెను.

అతఁ డట్లు యోజించుచున్నది తన శత్రువులఁ గూర్చియా ? ధర్మాధికృతులఁగూర్చియా? తలవరిఁగూర్చియా? కాదు. ఈ శరీరబంధనమునుండి విడివడి పరలోక మధిష్ఠించు దనయాత్మకను, సింహళద్వీపమున, వంగదేశమునఁ బారసీక మునఁ గాన్పించు సుంద రేందీవరముల గూర్చి యాతఁడు దల పోయుచుండనోపు. రాజతంత్రముల నతిమాత్రముగ డివిటు సోదరులును, పుష్పవ్యవసాయమున నతిమాత్రముగఁ గొర్నీలి యసు వాన్ బారలును మగ్నులై యెచట వధింపబడిరో, యా తుచ్ఛప్రపంచము దెస నాతఁ డూర్ధ్వలోకమునుండి జాలి చూపులు బ్రసరింపఁ జేయుచుండనోపు! "ఒక్క గొడ్డలివ్రేటుతో నా సుందరస్వప్నము నాకుఁ గరతలామలకమగును" అని యా తత్త్వజ్ఞుఁడు తనలో ననుకొని వధ్యస్థానముపై కెక్కెను. పూజ్యులగు డివిటుసోదరులకు ధర్మపుత్రుఁడనుగదా యను గర్వము తోలుకాను చూడ్కులు నిగిడ్చి, వారిని చేసేత వధిం చిన ముక్కుడిమూకల నెల్ల ధీరుఁడై కలయ వీక్షించెను.

ఆతఁడంత మోకరిలఁబడి, దైవమును స్మరింపుచు వధ్య శిలపై మొగముమోపి, గారాకారముదెస నొకపరి సకుతూ హలుఁడై వీక్షించెను. ఎట్టకేల కా మర్మముహూర్త మేతెం చెను. అతని కన్నులప్రయత్నముగా మూతపడెను. తలవరి కత్తి కేలఁగొని పైకిఁ గ్రిందికి సారింప, వధ్యశిలపై మెఱపు

మెఱసినట్లయ్యెను. కోర్నీలియసు తన నల్లగలువను ధ్యానించి తదనుజ్ఞ వేడుకొనెను. కత్తివాయినుండి దిగిన శీతలవాయు లేశము లాతని కంఠమును ముమ్మాఱు స్పృశించినట్లయినవే కాని దెబ్బతగులదు; బాధలేదు.

ఆకస మెప్పటివలెనే యున్నది. చుట్టును బ్రపంచము దొంటిమాడ్కినే యున్నది. అప్పు డెవ్వరో సాదరహాస్తములఁ దన్ను లేవఁదీయఁ గోర్నీలియసు నిలిచెను. నలువంకలఁ బాఱఁజూచి, యెదుట నెవరో యెఱ్ఱని లక్కముద్ర వైచిన పత్రము జదువుచుండుటఁ గాంచెను.

కోర్నీలియసు సుగుణములును, నాతని నిర్దోషిత్వమును విలియము భూపాలుని మనసునకు వచ్చి, యాతనిఁ గూడ వధించినచోఁ దనపాపము పండఁగల దను భీతిచే నాతనికి మరణ దండనము మాన్పి, యాజన్మకారాగృహవాసము విధించెను.

ఆ దండనము కోర్నీలియసునకుఁ దొలుత నించుక కష్టముగాఁ దోచినను, వెంటనే సమాధానపడి, "ప్రమాదము లేదు. ఇంకను నాశకలదు. రోజాయు, నా యిందీవరమూాల ములుఁ జెంతనుండును కదా" యనుకొనెను.

పాప మాతని యాశలు వెంటనే భగ్నమయ్యెను. అతఁ డీ దండనము "కాస్టను" దుర్గమున ననుభవింప వలెనఁట! అతఁ డద్దాని కించుక వగచి, యెటనయినఁ దాను జీవములతో నున్నచోఁ దన కలువలకు భయము లేదని యెంచికొని, మరల వెంటనే స్మరించుకొని, "అయ్యో! కాస్టను ప్రాంతములఁ జెమ్మయు మంచు నధికముగాదా! అచట నా కలువలు పెరుగు టెట్లు? అచట రోజాయు నుండదుగదా" యని విచా రించెను.

## ౯

విలియము దండ్యునియెడఁ జూపిన యనుగ్రహము ప్రజ కాశ్చర్యము నాశాభంగమును గూర్చెను. "ఇవిటు దుర్మతుల విషయమున మనము జాగుసేయక వెంటనే ప్రతీకారము జేసితిమికాని లేనిచో మన యేలిక వారినిఁ గూడ నిట్లే యనుగ్రహించి యుండును" అనుకొనుచుఁ బ్రజలు, పరిపరివిధములఁ జెప్పుకొనసాగిరి.

అశ్వశకటము వధ్యస్థానముచెంత సిద్ధమయ్యెను. కోర్నీలియసు శకటము నెక్కుటకుముం దొక్కపరి కారాగార గవాక్షము దెస రోజాముఖిలక్ష్మి సాక్షాత్కరించునేమో యని పరికించెను. పిమ్మట బండి వడివడిగఁ దరలిపోయెను.

శిరచ్ఛేదోత్సవము జూడ నేతెంచి భగ్నాశులైన వారిలో నెల్ల నొక్క పూరుషుని దుఃఖ మత్యంతము జాలి గొలుపు చుండెను. ఆతఁ డర్యుదయము నుండియు వధ్యస్థానము చెంతనే వేచియుండి జనసమ్మర్దము నొత్తిగించుకొని యెల్లట్లో ముందు వరుసలో నిలిచి లోచనోత్సవమున కెదురు చూచుచుండెను. ఆతఁ డొకసారి తలవరివంక "నామాట మఱ చెదవు సుమా" యన్నట్లు సాభిప్రాయముగఁ జూచెను. ఆ చూపునకు వాఁడు, "ఆ భారము నాదియే, నమ్ము" మన్నట్లు చూపులతోడనే ప్రతివచించెను. కోర్నీలియసు మరణోత్సవముఁ గనులపండువుగఁ దిలకింప నంతగాఁ గుతూహల పడుచున్న యా పౌరుని పాఠకులు గుఱుతింపరేమో! ఆతఁడు మన మిత్రుఁడు బాక్స్టలే!

బాక్స్టలు హేగ్ నగరము జేరినదాది క్షణమైన నాల

సింపక తనకార్యమునఁ బ్రవృత్తుఁడయ్యెను. తొలుదొలుత నాతఁడు గ్రిఫసును గదపిచూచెను. గ్రిఫసు బాక్ట్సలును వెడలనడచి, కుక్క నుసికొల్పెను. బాక్ట్స లంతమాత్రమున విరక్తి జెందక మఱునాడు మరల చెఱసాలకు వచ్చి, గ్రిఫసు జ్వరితుఁడగుట యెఱింగి, యల్లన రోజాకుమారి దఱిసి, తన వచ్చినకార్యము దెల్పి, తన, కెట్టులైన నా కలువదుంపలఁ దెచ్చియిచ్చినచో నాకన్నెకు సరిగంచు కుళాయిఁ దార హారములు గొని యిచ్చెదనని యాసచూపెను. ఆ చిన్నదియుఁ, గలువమొలకల విలువ యప్పటి కెఱుఁగనిదయ్యు, నా పని తనచేఁ గాదనియు దండ్యుని శరీరము తలవరి యధీనమగును గాన వాని నాశ్రయించుట మంచిదనియుఁ దెల్పెను.

మరణసమయమునఁగూడ గలువదుంపలు కోర్నిలియసు చెంతనే యుండునని బాక్ట్సలుకు నమ్మకమే కావున వెంటనే తలవరి నాశ్రయించెను. కోర్నిలియసు తన కాప్తబంధుఁడనియు, శిరచ్ఛేదమైన పిమ్మట నాతని యుడుపులఁ దన కిమ్మనియు, నట్లిచ్చినచో నూరువరహా లిచ్చెదననియు నాస పెట్టెను. మృతబంధు లిట్టి కోర్కెలఁ గోరుట తలవరికి వింతకాదు; కాని, ప్రాతదుస్తులకు నూరువరహాల నిచ్చు వీఁడెవఁడో కోర్నిలియసు వలెనే వెఱ్ఱివాఁడై యుండ నోపునని వాఁడు తలఁచి, తన కందుఁ బ్రమాదము లేదు గాన వల్లెయని యా సొమ్ము మున్ముందే చేతిలో వేయించు కొనియెను. బాక్ట్సలు కా నూరువరహాల పెట్టుబడియు లక్షవరహాల నీనునని పాప మా తలవరి యెఱుంగఁడు.

దౌర్భాగ్యుఁడగు బాక్ట్సలు తా నొందుదలఁప దైవ మొండు దలంచి, ప్రణయాధిదేవతయగు రోజారూపమునను,

కరుణామయుఁడగు విలియము రూపమునను నెడ సొచ్చి, కలువ దుంపలును, కొర్నీలియసును బాక్ట్సలు కందనీయఁ డయ్యె.

కొర్నీలియసు వధ్యశిలపై నానుకొన్నప్పుడు, కలువ మొలకలు నలిగిపోయెనేమో యని బాక్ట్సలు గుండెలు కొట్టుకొనెను. మందబుద్ధియగు నీ తలవరి, వెంటనే శిరము ఖండింపక, కత్తిని మీఁదికిఁ గ్రిందికి నిన్నిసార్లు సారింప నేటికని యలజడిఁ జెందెను. తుదకు విలియము ప్రభుని యాజ్ఞ నాలించి, కెవ్వునఁ గేకవైచి వెనుక వరుసలోని జనులపైఁ గూలెను. వీలుపడనయ్యెఁ గాని, కొర్నీలియసు కంఠముఁ దన చేతులార బిగ్గ నులిమి ప్రాణములను, కలువ పూదుంపలను గూడ బాక్ట్సలు హరించెడువాఁడు.

ఇంతకుఁ గొర్నీలియసు మృతిచెందలేదు. కాస్టను దుర్గమున జీవించి యుండఁగలఁడు. ఈ మొండి హాతకుఁడచటనే తనకలువలఁ గూడ సాకి మొగ్గ దొడిగించును గాఁబోలు! దుర్విధీ! యెంతపని చేసితివి!

బండి చనుచుంటఁ గాంచి, బాక్ట్సలు గూడ నా జన సమ్మర్దములోఁబడి పఱుగిడ యత్నించెను. ఆ తొందరలో జనుల కాళ్లక్రిందఁ బడెను. రానేలపైఁ బడుటచేఁ గాలు సేతులు గాయములయ్యెను. ఒడలెఱుంగక తమ్ము మట్టగించుచు నేఁగు నా వెట్టివానిపైఁ బ్రజ తలకొక దెబ్బవైచెను. అడుగడుగునఁ బడి లేచుచుండ వానిమొగము గీఱుకొని పోయెను. పడి లేచినపుడెల్ల మర్దించుఁ బ్రజలలోఁ బెనఁగులాడుటచే నుడుపులు చినిఁగి జీరాడుచుండెను. ఈ యవస్థకుఁ దోడు బాక్ట్సలు మే నెఱుంగక యెడనెడఁ దలపై జేసే

మోదికొనుచు, హృదయస్థమగు నీర్వ్యాధిదేవతకు గాన్క-లిడనో యనఁ గేశముల గుప్పిటఁబట్టి యూడఁబెఱుకు చుండెను.

## ౧౦

కొర్నీలియసును కాస్టను దుర్గమునందొక గదిలో బంధించిరి. తొల్లి "గ్రోషియస్స"ను వాఁడొకఁ డా గదిలో బంధింపఁబడి, తుదకుఁ దప్పించుకొని పోయెను గానఁ దన్నా గదియందే బంధించుట శుభసూచకమని కొర్నీలియసు దలఁచెను.

ఇనుపచువ్వల కిటికీనుండి దవ్వులఁగాన్పించు జన్మభూమి యగు డార్టు నగరముఁ గాంచుచు నాతఁ డొకనాఁడు నిలచి యుండ, నాదెసనుండి పావురములపదు వొకటి వచ్చి దుర్గ ప్రకోష్టమున వ్రాలెను. కొర్నీలియసు దినదినముఁ దన కొసఁగు నాహారమునఁ గొంతభాగ మా పావురముల కెర యిడుచుఁ గ్రమముగా వానిలో నొక మిథునమును మాలిమి సల్పెను. కొన్నాళ్లకుఁ గపోతి గ్రుడ్లనిడెను. అప్పటికి ౧౬౭౩ వ సంవత్సరము ప్రారంభించెను. అంత నొక నాఁ డొక కపోతి మెడకల సందున లేఖను గట్టి దానిని వదలెను. అదియు మగపిట్టను గ్రుడ్లపోషణమునకుఁ జాలించి యీవ్వున డార్టు నగరమున కెగిరిపోయెను.

కొర్నీలియ సా పత్రముఁ దనధాత్రిపేర వ్రాసెను. అందే రోజాపేర నింకొక లేఖ గూడ నిమిడ్చెను. ఈ యుత్తర మెవ్వరి చేఁజిక్కినను తనధాత్రికి కృపాపరులై యందింపుఁ డని యందే విన్నవించెను.

అవి మొదట బొక్కెనలు పెంపుడు పావురములు. వాఁడు నల్లకలువకై యిల్లు, వాకిలి, తోఁట, దొడ్డి వదలి యేగిన పిమ్మట, వానిపరిచారకుఁడు దినదిన మా పావురములఁ దన పొట్ట నిడుకొనుటఁ గాంచి, కృపాపరయగు కొర్నీలియసు ధాత్రి వానికి ధనమొసఁగి యా పావురములఁ గైకొని తాను పెంచుచు వానితోఁ గాలము వెళ్ళదీయుచుండెను.

దినదినము నల్లెగిరిపోయి యా పావురము సాయంతనము తిరిగి వచ్చినపుడు కొర్నీలియసు దాని యెఱకల సందున నా పత్ర మల్లే యుండుటఁ గాంచి ఖిన్నుఁడయ్యెడువాఁడు. తుద కొకనాటి సంజవేళ పావురము లేఖ లేకుండఁ తిరిగి వచ్చుట నరసి యాతఁడు సంతసించెను.

శుభము లెన్నఁడు నొంటిగైరావు. ఉన్నటు లుండి యొకనాఁడు మేడ మెట్లపై నుండి, సుపరిచిత మగు కంఠధ్వని యొండు కొర్నీలియసుహృదయము నానందప్లావిత మొనర్చుచు వినవచ్చెను. "అంత భాగ్యమా! రోజా యిచటి కేల వచ్చును? వచ్చినను చెరసాల నా పడుచున కింత సులభ ప్రవేశ మెట్లు లభించు?" ననుకొనుచు కొర్నీలియసు ఆశానిరాశల మధ్య నూగులాడుచుండఁగనే తలుపురెక్కలు విడి, యినుపకమ్ములలో నుండి యా ముద్దరాలి నెమ్మోము, విచారపరీతమయ్యు సుందరమై, వివర్ణమయ్యు సుభగమై కాన్పించెను.

వచ్చుచునే రోజా, "ఆర్యా! వచ్చితి వచ్చితి" ననియెను. కొర్నీలియసు బాహువులు మింటికిఁ జాచి, యొక్కపరి యానందనిమీలితనయనుఁడై, "రోజా! రోజా!" యని పలుకరించెను.

రోజా : ఇశ్శ్! మాయయ్య నా వెనుకనే వచ్చుచున్నాఁడు.

కొర్నీ : మీ యయ్యయా !

రోజా : అవును; క్రింద దుర్గాధిపునితో మాటలాడుచు నాతని యానతి గ్రహించుచున్నాఁడు.

కొర్నీ : దుర్గపాలకుని యానతులు గ్రహించుట యేల?

రోజా : ఆ కథ యంతయు మూఁడుమాటలలోఁ జెప్పెద వినుము. విలియముప్రభునిధాత్రి మా మేనత్త; నీ యుత్తర మందగనే, యాపెచే విలియమునకుఁ జెప్పించి, మాయయ్య కీ చెఱసాలపై నాధిపత్యము సంపాదించితిని. ఈ మార్పు గోరుటకుఁ గారణ మా ప్రభుఁ డెఱుంగఁడు గాన సమ్మతించెను.

కొర్నీ : ఎంతపని చేసితివి రోజా ! ఇఁక ననుదినము నాకుఁ గన్పించుచుందువుగా !

రోజా : నా కెన్నిసార్లు, వీలైన నన్నిసార్లు గన్పింతును.

కొర్నీ : రోజా! నాముద్దుల రోజాకు నాపై నించుక ప్రీతి కద్దు.

రోజా : ఇంచుకంతయా! ఆర్యా! నీవు చాల నల్పసంతుష్టుఁ డవు సుమా !

కొర్నీలియ సాపెదెసకు సానురాగముగఁ గరయుగము సాచెను. చువ్వలలోనుండి వారి యంగుళ్యగ్రములు మాత్ర మొండొంటి స్పృశించెను.

"అదె ; మాయయ్య !" యనుచు రోజా వెనుదిఱిగి యేగి జనకు నెదుర్కొనెను.

గ్రిఫసు వెనువెంట వాని శునకముగూడఁ దోఁక యాడించుకొనుచు నరుదెంచి క్రొత్తబందీల పరిచయము సంపాదించు కొనుచుండెను, తండ్రితో రోజా, "అయ్యో! యీగది చరిత్రము వింటివా నీవు? గ్రోషియసు తప్పించుకొని యేగిన దీ గదినుండియే" యని చెప్పెను. గ్రిఫసు, "ఈ గదియే నఁటే! మంచిది; నా పాలనమున నట్టి ప్రమాదము జరుగదు లెమ్మ" అనుచు గదితలుపు దెఱచి, చీకటిలో నున్న కొర్నీలియసుచు గురుతింపక, "ఎవ్వరయా గదిలో? వింటివా, నేను మీ క్రొత్త చెఱకాఁడను. నా స్వభావము నెఱుఁగుదువో, యెఱుగవో? నీ విచటి నియమము లతిక్రమింప నంతవఱకు నా యంత మంచివాఁ డుండఁడు. అతిక్రమించితివో? నా జాడ నెఱుంగుదువు" అని హెచ్చరించెను.

కొర్నీలియసు దీపపువెలుఁగులోనికి వచ్చి, "గ్రిఫసు మహాశయా! నిన్ను నేను బాగుగా నెఱుఁగుదు" ననెను.

గ్రి: ఎవరు! వాన్ బొరలు కొర్నీలియసా? చిత్రముగ్గా నున్నది మన పునస్సమాగమము.

కొర్నీ: నిజము; మీచేయి బాగుగా నెమ్మదించినట్లున్నది?

గ్రి: నా చేయి బాగుగనే యున్నది గాని, మా ప్రభువు నిన్ను విడిచిపుచ్చుట మాత్రము బాగున్నది కాదు. నే నైనచో నిట్టి ప్రమాదము సల్పియుండను.

కొర్నీ: అది యెట్లు?

గ్రి: నీవు మరల నేదియో దుస్తంత్ర మొనర్పకమానవు. నీవేకాదు. నీవంటి విద్వాంసుల కెల్లఁ గుట్రలు బన్నుటయే పని. ఒక విద్వాంసుని కన్న పదిమంది సైని

కుల నడుపులో నుంచుట సుకరము. వాండ్రకుఁ గడుపు నిండఁ దిండియుఁ ద్రాగుడు నున్నచో నూరక పడియుం దురు. మీరు కడుపునిండఁ దినరు. తనివి తీరఁ ద్రావరు. కావుననే మీ బుద్ధులు నిర్మలముగా నుండి యేవియో దురాలోచనములు సల్పుచుండును. నీకు ముందుగనే తెలియఁ జెప్పుచున్నాను. ఆ యాటలు నా యొద్ద సాగవు. నీ చెంత పుస్తకములు, కాగితములు నుండరాదు. గ్రంథములలో నింద్రజాల ముండును. దురాత్ముఁడు గ్రోషియసు గ్రంథముల మూలముననే తప్పించుకొని యేగినాఁడు.

కొర్నీ : నేను పాఱిపోయెద నని మీరు భయపడ నక్కఱ లేదు. ఇంతకుము న్నాతలఁ పున్నను ప్రస్తుత మద్దాని ముమ్మాటికి విడనాడితిని.

గై్ర: మంచిమాటయే. కాని జాగ్రత్తగా మాత్రముం దుము; నేను మాత్రము హెచ్చరిక దప్పియుండను. ఇంతకు మా ప్రభువు పొఱపడుటచేఁగదా మన యిర్వుర కీ యాయాసము.

కొర్నీ : పొఱపడెనా మీ ప్రభువు! అవు నవును. నన్ను బ్రదుకనిచ్చుట పొఱపాటు కాదా మఱి! మీ మంచి తనము మాత్రము ఎంత మెచ్చుకొన్నను దనివితీఱదు.

గై్ర: కాదా మఱి? దుశ్చింతనముల కన్నిఁటికి శిరచ్ఛే దమే మందు. డివిట్టులఁ జూడుము; ఇపు డెంత మన శ్శాంతి చేకూరినదో వారికి?

కొర్నీ : మహాశయా! మీ కఱకుదన మింకఁ జాలింపుఁడు.

ఆ సోదరులు నాకుఁ బూజ్యులుఁ బితృకల్పులని యెఱుఁగరా ?

గ్రై: ఎఱుఁగ కేమి? దుస్తంత్రమున నట్టివారు మఱి కల్ల రను విషయముగూడ నెఱుఁగుదును. నేను వారిపై ద్వేషముచే ననుటకాదు సుమా! మీఁదుమిక్కిలి నాకు వారిపై పరమానుగ్రహము.

కొర్న్ష: అది యెట్లు ?

గ్రై: ఇంత యెందులకు ? నీ విషయము యోజించుకొన రాదా ? నీకు శిరచ్ఛేదమే జరిగియున్నచో, నావలని బాధ తప్పెడిది కాదా ? నా జాడ నీ వింక నెఱుఁగవు. నిన్నుఁ గూరుచుండి నీరు ద్రావనీయను; పండుకొని నిద్ర పో నివ్వను; ఎఱిఁగి మసలుకొనుము.

ఇట్లు మాటలాడుచు గ్రైఫసు గవాక్షము దెఱచి వెలుపలికి పాఱఁజూచుచుండెను. ఆ క్రొత్తమానిసి మాటల సవ్వడికి భయపడి పావురములు గవాక్షముగుండ నవ్వలికిఁ బాఱిపోయెను. గ్రైఫసు వానింగాంచి, "ఓహో! యివి యెక్కడివి?" అని ప్రశ్నించెను.

కొర్న్ష: నా పావురములు.

గ్రై: నీ పావురములా ? నీకుఁ బావురము లెక్కడివి ? బద్ధునకు "నాది" యను పదార్థ ముండునా ?

కొర్న్ష: వానిని నాకుఁ బరమేశ్వరుఁ డనుగ్రహించినాఁడు.

గ్రై: అనుగ్రహించును. అనుగ్రహింప కేమి! నేనుమాత్ర మీ నియమాతిక్రమణము సహింపను. తెల్లవారుసరికివి నా పాకశాలలో నుండగలవు.

కొర్న్ష: అవి నీచేఁ జిక్కినప్పటిమాట కదా ! నిరపరాధ

ములగు నీ పులుఁగులు నాకుఁ గాకుండఁ జేయుదు వేని నీవి యంతకుమున్నే కావు.

గ్రి : చూచెదవుగా! ఎల్లి వాని గొంతు నులిమి తీరుదును.

అనుచు నాతఁడు వెలుపలికి వంగి, ప్రకోష్ఠమువంకఁ దిలకించుచుండ, నా సందున గోర్నీలియసు, రోజాచెంత కేగి యాపెకరము స్పృశింప, నామె యల్లన, "రాత్రి తొమ్మిది గంటలకు" అని వచించెను.

పావురముల మఱునాడు తప్పక పట్టుకొందు నని నిశ్చయించుకొని, గ్రిఫసు గదితలుపు మూసి బీగమువైచి, కూఁతు వెంట నిడుకొని మిగిలిన బంధితులఁగూడఁ జూడ నేగెను.

ఇంక నా కటికవాఁ డెట్లును పావురములఁ జంపక విడువఁడని నిశ్చయించి గోర్నీలియసు వెంటనే గవాక్షము చెంత నున్న పావురపుగూడు నాశనము జేసెను.

గ్రిఫసు చూపిన మొఱకుదనమును, వాని దుర్భాషలును, బెదరింపులుగూడ, రోజారాకచేఁ గలిగిన మధుర భావపరంపరలోఁ దలచూప లేకపోయెను.

అనుకొన్నచొప్పున రోజా తొమ్మిదిగంటలు విన్పించు సరికి, దీవియ యొండు కేలఁగొని యల్లనఁ దలుపుతెక్కలఁ దెఱచి, "యిదె వచ్చితి" ననియెను.

కోర్నీ : వచ్చితివా! నా రోజా! వచ్చితివా?

రోజా : నారాక మీకు సంతోషప్రదమే యన్నమాట!

కోర్నీ : అదియు నడుగవలెనా? ఇపుడు నీ వెట్లు రా గలిగితివి రోజా!

రోజా : మాయయ్య పెందలకడనే భుజించి మద్యపుమైకముచే నించుక నిదురించెను. మధుపానమును నిందింతు

వేమో? దాని పుణ్యమా యని మన కీ సమాగమ
భాగ్య మొదవినది.

కొర్నీలియసు "రోజాకు నాపై నెంతదయ!" యనుచుఁ
జువ్వాల చెంతఁ దనమో మిడ, నా పదుచు వెనుక కేగి, "నీ
కలువమొలకలఁ దెచ్చితినిసుమా" యనియెను.

కొర్నీ : వానిని భద్రముగా దాచి తెచ్చితి వన్నమాట.

రోజా : నీ కవి ప్రాణాధికము లని చెప్పి యప్పగించితివి
కదా మఱి!

కొర్నీ : నిజమేకాని, వానిని నీ కిచ్చివైచితిని. అవి యింక
నీవియే.

రోజా : నీవు లేకున్నచోఁగదా నావి యగుట! మాయేలిక
తల్లికడుపు చల్లగా మీరు పునర్జీవితు లైతిరి. మిమ్ము
విడిచిపుచ్చినందుల కా మహారాజు చిరకాల మీనేల
సుఖియై యేలుకొనవలె నని దైవమును మ్రొక్కు-
కొంటిని. మీ లేఖ యందకున్న మీ చెంత కెటులైన
వచ్చెడుదాననే. మీ గురుని బైబిలును గాంచినపు
డెల్ల మిమ్ము నెపుడు చూతునా? యని వేగిరపడెడు
దానను. మీ యుత్తరము చేరగనే యింక నిలువలేక,
వలయు యత్న మొనర్చి, మీ సన్నిధి కేతెంచితిని.

కొర్నీలియసు, "ఎంతమంచిమనసు నీది!" యనుచు
మరల గిటికీచువ్వాల చెంతఁ దనమోవి—నామెయెడఁ గృత
జ్ఞత దెల్పుటకుఁగాఁబోలు నల్లనఁజేర్చెను. రోజా మరల
వెనుక కేగి, లేజవరాండ్ర కెల్ల సాజమగు వగలాడితనము
మెఱయ నిట్లనెను. "మీ పరిచారిక జాబు దెచ్చినపుడు
దానిఁ జదువుకొనుటకు నాకుఁ జదువురాకపోయెఁ గదా యని

చింతించితిని. అందఱకు మనసిచ్చి మాటాడు నా లేఖ నాచేతి కందియు నాయెడ మూగతనము వహించెను."

కొర్నీ : నీకుఁ జదువురా దని యప్పుడప్పుడు విచారించుచుందువన్నమాట! నీ కా విచార మెపు డెపుడు కల్గుచుండునో చెప్పుము విందము.

రోజా : నాకు లేఖలు వచ్చినపు డెల్ల.

కొర్నీ : నీకు లేఖలు వచ్చుచుండునా రోజా !

రోజా : వందలకొలఁది.

కొర్నీ : నీ కన్ని యుత్తరము లెవరు వ్రాయుదురో !

రోజా : ఎవ్వ రనిచెప్పను ! కళాశాలలోని విద్యార్థులు, సైనికోద్యోగులు, వర్తకులు, వీరువా రనుమాట యేమి ! మా కారాగారపార్శ్వమునుండి దినదినము నేగు పడుచువాం డ్రందఱు నాకు లేఖ లంపుచుందురు.

కొర్నీ : నీ వా లేఖల నెల్ల నేమిచేయుచుందువు రోజా ?

రోజా : ఇంతకుము న్నా లేఖల నెల్ల నా నెచ్చెలిచేఁ జదివించి వినుట కలదు. అది యొక వినోదముగా నుండెడిది. కాని, కొన్నాళ్ళనుండి—మఱి—యేటికి యుబుసుపోక యని యెంచి—యానాటినుంచి లేఖల నన్నిఁటి జించి వైచుచుంటిని.

కొర్నీలియసు, ప్రఫుల్లవదనుఁడై "ఏ నాఁటినుంచి?" యని ప్రీతిపుట్టఁ బ్రశ్నింప, నా జవరాలు నునుసిగ్గు కెంపు లలమిన నెమ్మోము నల్లన వంచుకొనియెను. మధురలజ్జావశమున రోజా యేమఱియున్నతఱి కొర్నీలియసు పెదవులు మరలఁ జువ్వాలచెంతకు వచ్చెను. అవి యెడసొచ్చి యున్నను

అనురాగభరిత మగు నాతనిముద్దు తన తీయందన మా సిచ్చెత కెమ్మోవి కందియిచ్చెను.

నెల్లివాడిచిన యారాగరసపుఁబోటుచే నమ్ముద్దరాలు మోమున వెల్లబాటొదవ, కనుదమ్ములు మోడ్చి, హృదయ వేగము నణచిపట్టఁజాలక, దుఃఖగద్గదయై తొట్రిలుచుఁ బాఱిపోయెను. కొర్నీలియసు మరల నొంటిదై నిలిచెను. ఆ తొందరలో రోజా నల్లగలువ మొలక తీయ మఱచి యేగెను.

## ౧౨

ఆ కోటలో నేవురే ఖైదీలుగలరు. కావున గ్రైఫసుకుఁ జేతినిండఁ బనిలేదు. ఆ యేవురిలో నాతనిదృష్టికిఁ గొర్నీలి యసు చాలఁ బ్రమాదకారకుఁడు. కుట్రలుబన్ను గొర్నీ లియ సెంత కేనియుఁ దెగించు దుండగీఁ డని వాని తలంపు. కావున ననుదిన మాతనిగదికి ముమ్మా రేగును. అణుమాత్ర మైన నియమాతిక్రమణము చూపట్టు నేమో? యది కారణ ముగా వానిఁ బీడింప వచ్చునుగదా యతని కాస. హితచింతకులు ముందుగనే త న్నెచ్చరించుచుండుటచేఁ గొర్నీలి యసు, గ్రైఫసున కెప్పటికప్పు డాశాభంగము గూర్చు చుండెను.

కొర్నీలియసునకుఁ బ్రపంచమున రోజాయుఁ గలువ మొలకలు దక్క నితరులు లేరు. ఆ కలువమొలకలు రోజాయు నున్నచోటే వానికి స్వర్గము. ఆ కన్నియను, కలు వలను విడిచి కారాగృహమునుండి వెడలిపొమ్మన్నచో నాతఁ డంగీకరింపఁడు. ఇది నిజము.

మాటదప్పక రోజా సకాలమున నరుదెంచెను. కిటికి సమీపమునకు మాత్ర మేగఁగూడ దని యాక న్నె నిశ్చయించుకొని, కొర్నీలియసు మదికి నన్యవ్యాపృతిఁ గల్గించు నదియై, వానికిఁ బ్రియతమము లగు నిందీవరాంకురముల గవాక్షముగుండ నందిచ్చెను. కొర్నీలియ సవ్వాని గ్రహింపక యామె కెంగేలి నల్లన నవ్వలకుఁ ద్రోచి యిట్లనెను. "రోజా! ఇప్పటికి వానిని నీ చెంతనే యుండనిమ్ము. నే నావిషయ మంతయు నాలోచించి నిరపాయ మగు మార్గము నిశ్చయించితిని. మనము సల్పుచున్న యీ యపూర్వసృష్టికిఁ బ్రమాదముల నెల్ల ముందే పరిహరింప వలయును. ఆవల మన యవివేకము నెంత నిందించియు ఫలముఁగానము. నీ కాపదక మంతయుఁ దెల్పెద వినుము."

తన కా కలువలపట్ల నంతగా నాదరము లేకున్నను, మందభాగ్యు డగు నాపడుచువానికి వానిపైఁ గల గాఢాదరము నెఱింగినది కావున రోజా సావధానయై వినుచుండెను.

కొ: రోజా! యీ దుర్గమున నుపవనముగాని, పెఱడు గాని, తుద కొకమిద్దెగాని యుండి యుండును.

రో: ఆర్యా! కోటలో చక్కని యుపవనము కలదు. ప్రాకారము నానుకొని వింతవింతవృక్షజాతు లెన్నియో యున్నవి.

కొ: మంచిది, రోజా! నా కా తోటనుండి పరీక్షార్థ మించుక మట్టిని దెచ్చి పెట్టవలయును.

రో: ఎల్లి నేను వచ్చునవ్వు డట్లే తెచ్చెదను.

కొ: ఎండ కెండిన మట్టిని, నీడపట్టులఁ దేమగల మన్ను

గూడఁ దీసికొనిరావలయును. ఆ రెంటిభేదము గమ నింప వలయును.

రో: అట్లే తెచ్చెదను.

కొ: ఆ మంటినిబట్టి, వలసినచో నందు మార్పు గావించి, మనము స్థలనిర్ణయ మొనర్చిన పిమ్మట, నీ మూఁడు మొలకలలో నొకదానిని, నేను చెప్పెడిదినమున నాటి, నా యెఱిఁగించు చొప్పున సాకుదు వేని యది తప్పక పూచును.

రో: దాని నేను క్షుణ్ణమైన నేమఱియుందునా!

కొ: రెండవమొలక నీగదిలోనే పెంచెదను. నీవు లేని వేళల నాకది తోడై వినోదముఁ గూర్పఁగలదు. ఇచట నది వర్ధిల్లునని నాకు నమ్మకము చాలదు. కాని యేమి చేయుదును? నాకేదియో కాలక్షేపార్థము వలయుఁ గదా! పాప మా మొలక యీ స్వార్థపరుని కాల యాపనకొఱకగుఁగాక. ఇచటఁ గూడ నప్పుడప్పు డెండపొడ తగులుచునే యుండును. లేనివేళల నా చుట్టయు దానినుసియు నామొలకకు వలయు వేడిమి సమకూర్పఁగలవు. ఈ రెండు యత్నములు నెటుపోయి యెటువచ్చునో యెఱుఁగముకాన మూఁడవ మొలక మనము దాచి యుంచుట మేలు. దానిని నీ చెంతనే యుండనిమ్ము. మనమిట్లు చేయుదుమేని నీపెండ్లికట్నము ముద్రవైచి దాచుకున్నట్లే! మనయత్నములు ఫలించు నప్పటి యానందరసభావములు భావించుకొన నా హృదయ ముప్పొంగుచున్నది.

రో: మీరు చెప్పినట్లెల్ల చేసి యా మొలకలఁ గాపాడు

భారము నాది. మీరు చింతింపకుఁడు. ఈ గదిలోఁ బెంచెడు మొక్కలకు వలయు మట్టినెల్ల నొక్కసారిగాఁ దీసికొని రాఁజాలను

కో: అంత తొందరలేదుపొమ్ము రోజా! మొలకల నాటుటకు మన కింకను నెల దినములు వ్యవధి కలదు. ఈ లోపల వలసినంత మన్ను గొనిరావచ్చును. నీవునాటెడి మొలకవిషయమున మాత్రము జాగ్రత్త సుమా!

రో: మీ కా భయమువలదు.

కో: దానిని నాటినపిమ్మట, సాకూన యెట్లున్నదో పరిశీలించి తద్విశేషములు నా కే నాటి వా నాఁడు విన్పించుచుండవలయును. గాలిలో మార్పులే వచ్చునో? మడిచెంత నదుగు జాడ లెవ్వియైన కాన్పించునో? రాత్రులు తోటలోనికిఁ బిల్లులే ప్రవేశించునో? యెప్పు డే ప్రత్యవాయము వచ్చునో? యెఱుఁగము. కావున నెల్లవేళలఁ గనుగలిగి యుండవలయును సుమా! వెనుక నొకసారి మా తోటలో నిట్లే పిల్లులు ప్రవేశించి యెన్నియో మొక్కలఁ బాడు చేసినవి.

రో: రాత్రు లట్టి చప్పుడేమైనఁ బుట్టిన నేను వినుచునే యుందును లెండు.

కో: అవునుగాని రోజా! నీవు వెన్నెలరాత్రుల నెప్పుడైనఁ దోఁటపంక జూచితివా?

రో: గవాక్షము చెంతనే నా పడక.

కో: సెబాసు! ఎందుకనెదవేమో, గోడలో కలుగుల నుండి యెలుకలు తోటలోనికి వచ్చినచో వెన్నెలలోఁ గాన్పించును. ఎలుకలు చాలఁ జెడ్డవి. కనుపడిన దాని

నెల్ల కొఱికివేయుట వానికి సాజము. పుష్పజాతుల పాలిఁటి భూతము లవి.

రో: నేను కనుగల్గియుండును లెండు. ఎలుకలుగాని, పిల్లులుగాని కన్పించినచో—

కొ: నా కెఱిఁగినతువుకాదా! మఱియొకమాట మఱచితిని. ఎలుకలు బిల్లులకన్న భయంకరమగు నింకొక జంతువు కలదుసుమా!

రో: అది యేది!

కొ: మనుష్యుఁడే! తెలిసెనా రోజా! మనుష్యజాతి, యొక్క రూపమునకుఁ గూడ కక్కుఱితిపడి, చెఱసాలఁ జొచ్చుట నీవెఱుంగుదువు. లక్షవరహాల విషయమున నెంతలోభము చెందునో! యూహించుకొనుము.

రో: నాకన్న నన్యులెవరుఁ దోటలోనికి రారు.

కొ: మేలుమేలు. రోజా! నీవు నాపాలిఁటి భాగ్యదేవతవు సుమా!

అనుచు నాతఁడు సంతోషాతిశయమున గవాక్షము సమీపింప, రోజా మొగము వెనుకకు లాగికొని, చేయిముందునకు సాచెను. ఇందీవరాంకురము దాల్చియున్న యా సుకుమారి కరకిసలయము నాతఁ డందుకొని వాలారుఁ గొనగ్రవేళ్ల నత్యంతానురాగమున ముద్దిడుకొనెను. ఆతఁ డట్లు ముద్దుగొనుటకుఁ గత మా కెంగేలు రోజాదనియా? తనకుఁ బ్రియతమమగు కలువ నా కరపల్లవము తాల్చెననియా? ఈ సందియము రసికులే తేల్చవలెను.

మిగిలిన కలువమొలకల నెపఁద కద్దుకొనుచు నాయింతి వెడలిపోయెను. అట్లద్దుకొనుటకు గత మవి యప్పు

రూపములగు నల్లగలువ మొలకలనియా? లేక కొర్నీలియసు తన కొసఁగిన వనియా? ఈ సందియము దీర్చుట మొదటిదాని యంత కష్టముకాదని మా యాశయము.

ఈ సందియముల నటు డించి ప్రకృత మనుసరింతము. ఆతఁడు తనగదిలోని కూజా నుపాయముమై పగులఁగొట్టి, రోజా దినదినము నించుకించుకగాఁ దెచ్చియిచ్చిన మట్టి నందువైచి, యుంచుక యొండుమట్టి నందుఁగలిపి, యేప్రిలు నెల యారంభమున నందుఁ గలువను నాటెను.

దినదినము రోజా వేళకువచ్చి కొంత యుబుసు పుచ్చి పోవుచుండెను. కలువలఁ బెంచు విద్యలో నామెకూడ సుశిక్షితయయ్యెఁగాన నా విషయమును గూర్చిన సంభాషణల తోడనే కాలము గడపుచుండిరి. కలువలపై నిరువురకు నెంత యభిమానమున్నను సదా వాని ముచ్చటలతోడనే ప్రొద్దు పోవునా? క్రమముగా నితరప్రసంగములలోనికి దిగిరి. రోజాతో బ్రసంగించు వేళలందుఁ బ్రపంచమునఁ బ్రసంగమునకు విషయము లిన్నికలవా యని కొర్నీలియసు వింతఁ జెందెడువాఁడు. రోజామాత్రము తన్నుఁ దా నమ్మఁజాలకయో యేమో! యెప్పుడు గవాక్షమున కొక యడుగు దూరమున నిలిచెడిది.

ఒక్క కలువల విడిచినచో రోజా ప్రసక్తియే కొర్నీలియసు మదికి వచ్చుచుండెడిది. ఆమె జనకుని చెప్పుచేతలలో నుండవలసిన యస్వతంత్రకదా యనియు, నావృద్ధున కెపుడైన కాస్టనుదుర్గమున నుద్యోగము విడిచి యేగు బుద్ధి జనించునేని రోజాకూడ వానివెంట నేగవలసినదే కదా యనియు, నపుడు మరల తా నేకాకి యగుదును కదా యనియు భయపడు

చుండెడివాఁడు. ఒకనాఁ డా ప్రసంగము వచ్చి, రోజాతో, "అపుడు పావురములచే నుత్తరములైనఁ బంపుదుననన్న, రోజా! నీకుఁ జదువురాదయ్యెఁ గదా!" యనియెను.

అట్టి యెడబా సెపుడు వచ్చునో యని రోజాయు భయంపడుచున్నదియే కాన, "అగుచో, మన మనుదినము నీ గంట కాలము సద్వినియోగము చేయఁగూడదా?" యని ప్రశ్నించెను.

కో : ఇపుడు మాత్రము దుర్వినియోగ మొనర్చుచుంటిమా?

రో : (నవ్వుచు) మీరు నాకుఁ జదువను వ్రాయను నేర్పెడిచో నింతకన్న మేలుకాదా! నన్నటుల సుశిక్షితగావింతురేని, మన కింక నెడబాటే యుండఁజాలదు, మనము గోరి యెడబాసిననే తప్ప!

కో : ఇపుడు మించిపోయెనా యేమి? మన కింక ననంతమగు వ్యవధికలదు కదా!

రో : మీ రెప్పటికిఁ జెఱసాలలోనే యుందురా యేమి? మీకుఁ బ్రాణదాన మొసఁగిన యేలిక యీ చెఱఁగూడ మీకుఁ బాపఁగూడదా? అపుడు నీవు మరల భాగ్యవంతుఁడవై, భోగములఁ దూఁగుచుందువు. ఈ నిర్భాగ్యపు రోజా నీ కపుడు జ్ఞప్తికివచ్చునా? ఈ గ్రెఘసు కూఁతు వంక నపుడు చూడనైనఁ జూతువా!

ఆ మాటల కడ్డమువచ్చి, యాతఁ డత్యాదరమున నేమో చెప్పఁబోవుచుండ, నా వగలాడి యరమోడ్పుఁగనుల నవ్వుచుఁ, బ్రసంగము మార్చి, "నీ కలువ యెటులున్నది? యడుగమఱచితి" ననెను. కలువపేరెత్తినచో నాతఁడు విశ్వమును, రోజానుగూడ మఱచునని యమ్ముద్దియ యెఱుంగును.

ఆతఁడు వెంటనే, "దినదిన ప్రవర్ధమానముగ నున్నది. దాని మేను నలుపుదిరిగి మొలక లెత్తుచున్నది. ఇక వారము దినములలో నా కూన యాకులు దొడుగుట నిశ్చయము" అని చెప్పెను.

రో: నా మొక్క వృత్తాంతము విన్పింతునా!

రోజాపట్ల నంతకుము న్నతఁడు చూపిన కౌతుకమువంటి కౌతుకమే కలువపట్లఁగూడఁ దలచూప, "అవశ్యము వచింపుము రోజా!" యనియెను.

నల్లగలువపొడఁ దనయెడఁ గార్నెలియసునకుఁ గల యీ ద్విభ్రాంతిత్రయామె మనస్సునకు వచ్చి యున్నదియే కావున, ముసిముసినవ్వు దొలంక రోజా బదులు చెప్పెను. "నా ప్రయత్నము మీయత్నముకంటెఁ బెద్దది. మీరు చెప్పిన చొప్పున గులకరాయి లేనిదిగా, నించుక తేమ నేలగాఁజూచి, చేరువఁ జెట్లులేనిచోట, నించుక యిసుకఁ గూడఁ జేర్చి, మడి గావించి యద్దాని విత్తు బదనుజేసి యుంచితిని."

కో: బళిబళి, తరువాత?

రో: మొలక నాటుటకు మీయానతి కొఱ కెదురుచూచుచుంటిని. నా కచట మంచిగాలి,వలసినంత యెండయుఁ దేమయుఁ గలదుగాన మీ కన్న నే నించుక వెనుక నాటవలయునని కదా చెప్పితిరి?

కొర్నెలియసు సంతోషాతిశయమున చప్పటులు జఱచుచు, "బళి బళీ రోజా! నీవు మంచి శిష్యురాలవు. తప్పక లక్షవరహాలు సంపాదించుకొనఁ గల"వనెను.

రోజా: (నవ్వుచు) మీ శిష్యురాలీ కలువ వ్యవసాయమే కాక యింకను నేర్చుకొనవలసినవి కలవని మఱువకుడు.

కో: నిజము రోజా! చదువు నేర్పవలయు నని నీకంటె నాకెక్కుడు తొందరగానే యున్నది.

రో: ఎప్పుడు ప్రారంభింతము?

కో: ఈ లగ్నముననే.

రో: వలదు. ఎల్లి ప్రారంభింతము లెండు.

కో: ఏల?

రో: నేటి గంటసేపు ముగిసినది. నే నింక నరుగవలెను.

కో: అప్పుడే గంట యైనదా! మన మే గ్రంథ మారంభింతము?

రో: నా చెంత నొక గ్రంథ మున్నయదిగా, మన భాగ్యదేవత!

కో: మంచిది. ఇఁక రేపఁటికే కదా—

రో: రేపఁటికే.

మఱునాఁడు రోజా, డివిటు తన కిచ్చిన బైబిలును వెంటఁ గొని తెచ్చెను.

## ౧౩

ఆనాఁడు రోజా కక్షరాభ్యాస మారంభమయ్యెను. మహోల్లాసకర మగు నా గురుశిష్యుల చదువువేడ్క నెవరు వర్ణింపగలరు?

ఒక కేల దీవియు, నొక కేలఁ బుస్తకమును బట్టి యమ్ముగుద గవాక్షముచెంత నిల్చి, దీపపుఁగాంతి యక్షరములపైఁ బడునట్లు దీపము నెత్తివట్ట, గురుడు, పూచికపుల్లతో నొక్కొక్క యక్షరమునే చూపి చెప్పుచుండును. దీపము నెత్తిపట్టుకొను శ్రమ వాప నెంచి కొర్నీలియ సద్దాని గవాక్షపుఁగమ్మికిఁ దగిలించెను.

పాటలప్రభ మగు నా జవరాలి నునుమేని లావణ్యమును, తరళనేత్రదీధితియు, దీపపుఁగాంతిలో ద్విగుణీకృతమానోజ్ఞములై గురునికన్నులకుఁ బండువు గూర్చుచుండును. ఆ మేధానిధి సుశిక్షణముచే రోజాకు ధీపాటవము నానాట విస్తరిల్లి ప్రకాశించె నన నబ్బుర మేమి! కష్టమైన ఘట్టములు వచ్చినపుడు రాగరసప్లావితము లగు వారి హృదయములు సునాయాసముగ నొడ్డుఁ జేరెడివి.

ఒకనాటి సంజవేళ రోజా యరగంట యాలస్యముగా నేతెంచెను. గురుఁడు కారణ మడుగ, రోజా, "కోపింపకుఁడు. నా యపరాధ మిందు లేశమును లేదు. పూర్వస్నేహితుఁ డొకఁడు మా యయ్యను జూడ వచ్చెను. అతఁడు మంచి మాటకారి; చక్కని కథలు సెప్పగలఁడు. ధనము వెచ్చించుటకు లక్ష్యముసేయఁడు. అతఁడు తెకతేర మద్యము వోయింప, మా యయ్య యాతని చెలిమి మరిగినాఁడు" అని బదులు సెప్పెను.

కొ: ఈ క్రొత్తమానిసిఁ గూర్చి యింక నేమైన నీకు వివరములు తెలియునా?

రో: ఏదీ! పదునైదు దినములనుండియే యాతఁడు కోటలోనికి రా మొదలిడినదియు, మా యయ్య కాతని నెయ్యము బలమైనదియు.

కొ: (ఇంచుక యాలోచించి) ఎవఁడో గూఢచారి కావచ్చును. కారాగృహాధికారిని, ఖైదీలనుగూడ నిట్లు పరిశీలించుచుండుట కద్దు.

రో: ఏమో? నా కట్లు తోఁచలేదు. అతఁ డెవరికొఱకు

వచ్చెనో కాని మా యయ్యను గనుపెట్టి చూచుటకు మాత్రము కాదు.

కో: మఱి యెవరికొఱకే తెంచియుండును ?

రో: నా కొఱకేమో.

కో: నీ కోసమా !

రో: అగును. ఏల కాకూడదు ?

కో: (నిట్టూర్చుచు) నిజము రోజా ! ఎంతకాల మని వరిని వరింపక కన్నెవుగా నుందువు ! ఈతఁడు నీకు భర్త యేల కారాదు !

రో: కాఁదగఁ డని నేను చెప్పితినా ?

కో: నీ యూహ నిజ మగుచో నదృష్టవతివే నీవు !

రో: అదృష్టమా ? దురదృష్టమా ?

కో: మేలుమేలు ! రోజా ! ఈ దురదృష్టము నెటుల నూహింపఁగల్గితివి ?

రో: కారణ మే మన—

కో: చెప్పుము విందము. వినుటకు నా కాతురముగా నున్నది.

రో: మేము హేగునగరమున నున్నపుడే యీతఁ డొకటి రెండు సారులు కారాగారములోనికి వచ్చెను. అన్న టుల, నా కిపుడు జ్ఞప్తికి వచ్చుచున్నది. నీ వచట బంధింపఁబడియున్న దినములందే యీతఁ డచటి కేతెంచినది. నే నా నగరము విడువఁగనే యీతఁడు వీడు టయు, నే నిటకు వచ్చినతోడనే వచ్చుటయుఁ జూడ నా కనుమాన మగుచున్నది. హేగునగరమున నిన్నుఁ జూచు నెపమున వచ్చెను ప్రాఁతను.

కో: వన్నా!

రో: నిన్నే? అది కేవలము విషయమే. అది నిజ మగుచో నిప్పుడు నా మాటయే చెప్పవచ్చునుగా! నిన్న మా యయ్యతోఁ బల్కుచుండ వింటిని; నిన్నాతఁ డెఱుఁ గనే యెఱుఁగడఁట!

కో: తరువాత, తరువాత! ఈతఁ డెవ్వఁడో, యేలవచ్చెనో యూహింపఁగలనేమో నీ వెఱింగిన దెల్లఁ జెప్పుము.

రో: నీ మిత్రు లెవరు నీ కొఱకు వచ్చి యుండరుగదా!

కో: నీ వెఱింగిన వృద్ధధాత్రి తక్క నా కింక నెవ్వరును లేరు.

రో: అగుచో నా యనుమానమే నిశ్చయముకానచ్చును. నిన్నటి సంజవేళ నేను తోటలో మడి చక్కఁజేయు చుండ నీతఁడు చెట్లచాటునుండి నన్నుఁ దొంగి చూచు చుండెను. నే నాతనిఁ జూచితి నని యాతఁడెఱుంగఁడు. కాని, నేను పాదు త్రవ్వుచున్నంతసేపు, నచటనే నిలిచి కనుపెట్టుచుండెను.

కో: ఇఁకనేమి? వాడు నిన్ను వలచియే వచ్చినాఁడు? పోనిమ్ము; ఆతఁ డందగాఁడేనా? వయసువాఁడేనా? చెప్పుము.

రో: (బిట్టునవ్వుచు) అందము, వయసునా? ఏబదియేండ్ల యా గ్రద్దముక్కువగ్గునకు వయస్సు, నందమునా! నా వంక మొగమెత్తి చూడను, నాతో మాటలాడను గూడ వానికి ధైర్యము లేదు.

కో: వాని పేరు?

రో: జేకబు గ్రైజెల్సు.

కో : అయినచో నెవ్వఁడో! నే నెఱుఁగను.

రో : నీ కొఱకు వచ్చియుండఁ డని నిశ్చయమే కదా.

కో : నిన్ను వలచియే యాతఁడు వచ్చెను; నిన్నొకపరి చూచినవాఁడు నిన్నుఁ గామింపకుండ వశమఁట కాని, నీ కాతనిపై వలపు లేదు కద!

రో : ముమ్మాటికి లేదు.

కో : నే నింక నిశ్చింతనై నుండవచ్చును గద!

రో : ఉండవచ్చును.

కో : నీ విపుడు చదువ నేర్చితివి కాన, నీవు చెంత లేనపుడు నేను పొందు తాపముం గూర్చియు నా మనసున పొడము ననుమానముల గూర్చియు నీకు వ్రాయు చుందును.

రో : పెద్ద పెద్ద యక్షరములు విడివిడిగా వ్రాయుదువేని చదువఁ గలను.

ఔత్సుక్యజనక మగు నీ ప్రసంగము మార్ప నెంచి, రోజా, "మీ కలువ యెట్లున్నదో చెప్పరె తిరి" యనియెను.

కో : రోజా! నే నుదయము, మట్టి నించుక తొలగించి చూచునప్పటికి, నా యానంద మేమి చెప్పను? అప్పుడే చివురు తలచూపుచున్నది. మృత్యు ముఖమునుండి వెలియము నన్నుఁ దప్పించినప్పటికన్న కలువ మొలక నుండి వెడలుచున్న యా చైతన్యవిలసనము జూచి నప్పుడు నాకు భావవివశత్వము జనించినది.

రో : మఱి, నా కలువ నెప్పుడు నాటుమందువు?

కో : అనుకూల దినము జూచి తెలుపుదును. నీవు నాటు చున్న రహస్య మేరికిఁ దెలియరాదు సుమా.

ఈ విద్యయందే మాత్రము ప్రవేశము గలవాఁడైన దానిఁ జూడఁగనే అది యపురూపమని యిట్టె గ్రహింపఁ గలఁడు. దానిని నాటిన శిమ్మట, మూఁడవ మొలక నతిభద్రముగా దాచవలయును సుమా, రోజా!

రో: భయపడకుఁడు. మీ రిచ్చినప్పటి వలె, నా కాగితపుఁ బొట్లములోనే యుంచి, నా జిలుగు దుస్తుల యడుగున బెట్టెలో భద్రముగా దాచి యుంచితిని లెండు. నా కింక ననుజ్ఞ నిండు.

కో: నేఁడు వచ్చుటయే యాలస్యమాయెఁ గదా! అప్పుడే యేగెదవా?

రో: నే నింక నాలసించినచో, మా యయ్యయు నా వలపుకాఁడు ననుమానింపరా!

అనుచు నా పడు చులికిపడుచు, "అదిగో! యేదియో యలికిడి! మేడ మెట్లపై నడుగుల చప్పుడువలె నున్నది." యనెను.

కో: మీ యయ్య కాఁడు గద?

రో: మా యయ్య యేమి! యంత సద్దులేకుండ నరుదెంచుట యేమి! జేకబు మహాశయుఁడేమో!

అని, వేవేగ నామె పదిమెట్లు డిగునప్పటికి, క్రింద నెవరో తలుపు మూసిన చప్పుడు స్పష్టముగా వినుపించెను.

ఈ సంఘటనచేఁ గోర్నీలియసు హృదయముకూడ కలఁతపడియెను; రానున్న సంకటముల కది సూచనామాత్రమే!

మఱునాఁ డెట్టియు విశేషములు లేవు. గ్రీఫసు యథా ప్రకారము మూఁడుసార్లు వచ్చి చూచి యేగెను. అతఁడు నేఁడు

వచ్చినవేళకు రేవు రాఁడు. వేళ తప్పించి వచ్చి కొర్నీలియసును పరీక్షించుచుండును.

ఎప్పుడేమి మునుఁగునో యను భయమునఁగొర్నీలియసు హెచ్చరిక గలిగి యా మట్టిపాత్రను బదిలముగా దాచుచుండెడివాఁడు. అయ్యో, నొకనాటి యుదయమున, మట్టిపాత్ర ముందిడుకొని, మట్టి నించుకంత తొలగించి, మోసెత్తెనేమో యని సకుతూహలముగ నాతఁడు పరికించుచుండ, గ్రిఫసు తటాలునఁ దలుపుఁ దెఱచి లోనికి వచ్చెను. హోరు గాలి వీచుచున్న కతమునను, నన్యమనస్కుఁడై యున్న కారణమునను గొర్నీలియసు వాని రాక నెఱుంగఁడయ్యె.

అట్లు వచ్చినవాఁడు, కొర్నీలియసు చేతుల నా మట్టిపాత్ర ముండుటఁ గాంచి, యనుమానించి, పిట్టపై వ్రాలు డేగవలె, మీఁదికుఱికి, తన యెడ్డచేయి నా మట్టిలో గ్రుచ్చి, "దొఱకితివి, దొఱకితివి; చెప్పు మిందేమున్నదో?" యని గద్దించి యడిగెను.

కొర్నీలియసు వడవడ వణంకుచు, "నేమియు లేదు, ఏమియు లేదు" అనుచుండ, గ్రిఫసు మఱియు ననుమానించి, "పగిలిపోయిన కూజా! దానిలో మన్ను! ఇఁక నేమి! ఇందేదో రహస్యమున్నది, చెప్పు" మనెను.

కొర్నీలియసు, పిల్లను గోల్పోవు పులుంగుమాడ్కి, దీనవదనుఁడై, చేతులు పిసికికొనుచు జాలివొడమునట్లు "అయ్యో! గ్రిఫసు! ఇటు చూడుము! నా మాట వినుము," అనుచుండ, వాఁడు విడువక, మట్టి యంతయుఁ బెల్లగించి వ్రేళ్లతో నెమకుచుండెను.

కొర్నీలియసు వెలవెలఁ బోవుచు, జాగ్రత్తసుమీ,

జాగ్రత్త," యని తత్తరపడుచుండ, గ్రిఫసు, "జాగ్రత్త యేటికి? యిందేమున్నదో చెప్పరాదా మఱి!" యనియెను.

కొర్నీలియసు, "నీకుఁ బుణ్యముండును. విడువు" మని వేఁడియు ఫలము గానక, తెగువచేసి, వాని చేతులలోనిపాత్రను తటాలున లాగికొని, నిక్షేపమునువోలె, కక్షమున దాచెను.

దానితో నా వృద్ధుని యనుమానము మఱియుఁ బ్రవృద్ధమై, యం దేదో దుస్తంత్ర మిమిడియున్న దని నిశ్చయించి, యా రహస్యమును భేదింపక విడువ నని పూని, చేత నున్న దండము పైకెత్తి కొర్నీలియసుమీఁది కుఱికెను. పైకెత్తిన బడియను లక్ష్యమొనర్పక బంధితుఁ డా మట్టిపాత్రనే ప్రాణపదముగాఁ బదిల మొనర్చుకొనుట యరసి, గ్రిఫసు దండము నవలఁ బాఱవైచి మరల నా మట్టిపాత్రను లాగికొనఁ బూనెను. కొర్నీలియసు తన పట్టు విడువఁడయ్యె; గ్రిఫసు, "ఓహో! నాకు మాఱొడ్డి పెనఁగులాడెదవుగా! మంచిది," యని యఱ్ఱాడు గఱచుచుండ, కొర్నీలియసు, "కలువను విడిచి పెట్టుము. నేను నా కలువను వదలను" అని పెనఁగుచుండెను. గ్రిఫసు, "కలువయా? నీ వేసములు నే నెఱుఁగుదును. నన్ను మోసగింతువా" యనెను.

కొ: మోసము కాదు. నమ్ము మిది కలువయే.

గ్రి: నీ పట్టు విడిచెదవా, భటులఁ బిలువుమందువా?

కొ: ఎవ్వరినైనఁ బిలిచికొమ్ము; ఈ మొలకను బ్రాణములతో వదలను.

ఇట్లనుచుండ, గ్రిఫసు అంతకంతకుఁ బెచ్చుపెఱుగుచున్న క్రోధమున, మరల నా మట్టిని బెల్లగించి యందలి కలువదుంపను వెలికిఁదీసి, యా రాతినేలపై విసరికొట్టి కాలితో

మట్టగించెను. భిన్నభిన్నమై, రూపఱిపోయి ప్రాణరసము వెలి గ్రక్కిన తన ప్రియతమాంకూరమును గాంచి, సాధుశీలుఁడగు నయ్యుదారహృదయునకుఁ గన్నులు జిఱ్ఱఁదిరిగి, యొడలు వివశమగుచు, నాడుగఱచి, చేత నున్న మృత్పాత్రతో నా రాక్షసుని శిరము వ్రక్కలు చేయ నెంచి లేచెను. ఉత్తరక్షణ మున నంత పనియు జరిగెడిదే, కాని, యింతలో, "వలదు వల" దనుచు దీనాస్యయై కన్నీటితో చేతులు మోడ్చి రోజా కుమారి గవాక్షముచెంతఁ బ్రత్యక్షమాయెను.

కోర్నీలియసు పైకెత్తిన మట్టిపాత్ర నంతట డించి, "ఎంత పని చేసితివి, రాక్షసుఁడా! ఈ మందభాగ్యుని గారాబపుఁగలువ నీకేమి యపకృతి సల్పినది!" యని క్రోధ దుఃఖములు మల్లడిగొనఁ బలికెను.

అంతట రోజా, "తండ్రీ! యేమి పని చేసితివి! చేతు లార ప్రాణహరణ మొనర్చితివికదా" యనెను.

గ్రైఫసు పండ్లుఁ గొఱుకుచు కూఁతువంకఁ దిరిగి, "ఓసి చెల్లీ! నీ కిచట నేమి పని? నోరు మెదపక యవలఁ బొమ్ము" అని గద్దించెను. కోర్నీలియసు దుఃఖాతిశయమున "ఎంతటి మందభాగ్యుఁడను! నేఁ డెట్టి దుర్దినము!" అని వగచుచుండెను.

గ్రైఫసు, తన యకార్యమున కించుక లజ్జించుచు, "ఇంతకు నిది వట్టికలువయే కదా! పోనిమ్ము; నీకు వలసినన్ని కలువలు తెచ్చి సాకికొమ్ము; ఇచట నా తోటలో వందల కొలది యున్నవి" యనఁ, గోర్నీలియసు, "నీ కలువలు నీవు నట్టేటఁ గలియుఁడు, పొండు. నీవు పదిలక్షలకలువ లిచ్చి నను నా కలువసాటి యగునా?" యని తెగనాడుటఁ గాంచి,

గ్రీఫసు, మరల ననుమానము లేకత్త, "నిజము పలికితివి! అటుల దారికి రమ్ము; నా యనుమానము నిక్కమైనదికదా! చూచుటకుఁ గలువవలె నున్నదేకాని, యం దేదియో యింద్ర జాల మున్నది! ఈ కలువ నెపమున మా యేలిక కేదియో యపకార మూహించుచుంటివికాదా! పడుచువాఁడా! నేను మున్నే చెప్పితిని, నీ తలఁ దీయకుంట తప్పిద మని" అని నిజ విజయసూచకముగ, గంభీరముగా వచించెను.

రోజా, "అవి యేటిమాటలు తండ్రీ! యుడుగుము" అని మందలింప, వృద్ధుఁడుఁ గోర్నిలియసుతో, "నీ యాటలు నాకడ సాగ వని తొలుతనే చెప్పితిని. మరల నిట్టి తంత్రము లకు దొరకొంటివా, యిట్టి శాస్తియే జరగును. నిన్ను ముప్పు త్రిప్పలు పెట్టుదు నని చెప్పలేదా నేను! ఇఁకనైన నెఱిఁగి మసలుకొమ్ము" అనియెను.

కోర్నిలియసు, "సర్వనాశకుఁడా, యిటనుండి పొమ్ము" అనుచుఁ, బ్రణష్టమై పడియున్న కలువదెస, నైరాశ్యము మోమున వ్రేలఁ, గాంచుచుండ, రోజా వాని దైన్యమునకు జాలిచెందుచుఁ, జెంత కేతెంచి, "ఆర్యా! రెండవ మొలక రేపు నాటుదము. వగవకుఁ" డని యల్లనఁ బలికి యోదా ర్చెను.

## ౧౪

రోజా యిట్లు సమాశ్వాసింపుచుండ, మెట్లపైనుండి యెవరో "ఆ గందరగోళ మేమి" యని ప్రశ్నించిరి. వెంటనే, రోజా, "అయ్యో! వింటివా? అదె జాకబు నీకై యలజడిఁ జెందుచున్నాఁ" డనెను.

గ్రిఫసు, "అలజడి చెందఁడా మఱి! ఎంతగోల చేసి నాఁడీ పండితుఁడు! నా ప్రాణములను గూడ హరించుటకు సిద్ధమైనాఁడు! వీండ్రదనెన్నఁడు నమ్మి యుండరాదు. ఇక పోదము పద" అనుచు తలుపు బిగమువైచి యేగెను.

ఏకాకియగు కోర్నీలియసు నుఖాశ్రువులు రాల్చుచు, "వృద్ధ హాతకుఁడా! నన్నుఁ గాలితో మట్టితివి కదరా! నా ప్రాణములు హరించితివి. నా కింక జీవితాశ లేదు" అని వగవఁ జొచ్చెను.

పరమేశ్వరుఁ డాతనికి రోజా పేరిటి సంజీవనౌషధము ఘటించి యొసఁగకున్నచో, నీ దురంతవేదనచే నాతఁడు మంచముఁ బట్టవలసినవాఁడే!

మఱునాఁడు రోజా యరుదెంచుచునే, "మా యయ్య నీ పుష్పవ్యవసాయమున కింక నడ్డమురాఁ" డని శుభవార్త చెప్పెను.

కో: (అనుత్సుకుఁడై) నీ కెట్లు తెలియును?

రో: ఆతఁడే చెప్పెను.

కో: నన్ను మోసగింపనేమో?

రో: కాదు. ఆతఁడు పశ్చాత్తప్తుఁ డైనాఁడు.

కో: ఏమో? కావలసిన దెల్ల నాయెఁగదా!

రో. మనమిత్రుఁడు జేకబునదుపదేశముచే మాయయ్యకుఁ బశ్చాత్తాపము జనించినది. ఆతఁడు మాయయ్య నిడిన చీవాట్లు మీరు వినవలసినది!

కో: ఎట్లు? జేకబు నిన్నింకను విడువలేదా యేమి?

రో: విడువను లేదు, మానను లేదు; కథయంతయు వినుఁడు. మాయయ్య తా నిచటఁ బ్రదర్శించిన ప్రతాప మెల్ల

మిత్రునకు సవిస్తరముగా విన్పించెను. ఆ వృత్తమెల్ల వినిన జాకబు నైఖరి మీరు చూడకపోతిరి! ఈ దుర్గమున కాతఁడు నిప్పుబెట్టునేమో యని నాకు భయము పుట్టినది. జ్యోతులవలె కనులెఱ్ఱఁజేసి, తల వెంట్రుకలు నిక్క, పిడికిళ్లు బిగించిన యాతని క్రోధమూర్తిఁ గాంచి నప్పుడు, మా యయ్యను గొంతు నులిమి చంపునేమో యనిపించినది. "ఎంతపని చేసితివి? కలువ మొలకను గాల మట్టి చంపితివా! ఎంత క్రౌర్యము! ఈ పాప మొనర్ప నీమన సెటులొప్పినది?" యని యడుగ, మాయయ్య, "నీకుఁ గూడ పిచ్చియెత్తెనా యేమి!" యని యక్కజమందెను.

కో: ఎంతమంచివాఁడు జాకబు! ఎంతదయాళుఁడు! ఎంత యుదారుఁడు!

రో: మాయయ్య నాతఁడు దెగనాడుట చూడ నాకు వింత యైనది. "ఆ మొలక నెట్లు చంపితివి! దైవమా! యెంత ఘోర మెంతపాప!" మనుచు నాతఁడు పలుమఱు విచారించి, నా వంకకుఁదిఱిగి, "ఆతని చెంత నీ యొక్క మొలక యేనా యున్నది?" యని యడిగెను.

కో: నిన్నా ప్రశ్న మడిగెనా యాతఁడు?

రో: అంతట మా యయ్య, "ఇంకను గలవేని వెదకిపట్టు కొందము" అనియెను. జేకబు మా జనకుని దెసనుఱిమి చూచి, "వెదకుదువు! అంతటి ప్రబుద్ధుఁడవే యగుదువు" అని తూలనాడి, మరల నన్ను, "ఈ యకార్యమునకుఁ బాప మా పడుచువాఁ డేమనెను?" అని యడిగెను.

"కలువమొలకపై మీకుఁ గల యతిమాత్రానురాగ మేరికిఁ దెలియనీయవల దని యింతకుమున్న నాకుఁ దెలిపి యుంటిరి కాన, వానితో నేమి చెప్పుటకు నాకు పాలుపోయి నదికాదు. నేనట్లు తటపటాయించుచుండ, నదృష్టవశమున, నా జనకుఁడు 'ఏమనెనా! తన సొమ్మంతయుఁ గొల్లపోయి నట్లు గోలచేసెను' అని సమాధానము వచించెను.

"నే నంతట నందుకొని, నీ వన్యాయముగా నట్టి యకార్య మొనర్చినప్పు డాతఁడు గోలచేయుట వింతయా!" యంటిని.

"మా యయ్య యపుడు, 'మీ కందఱకు నొక్కటే వెఱ్ఱి యెత్తినటులున్నది! ముష్టికలువయొక్క భాగ్యమున కింత మంది గగ్గోలు సల్పుట యెందులకో నాకుఁ దెలియరాకు న్నది. సంత కేగిన వందలకొలఁది కలువ లమ్మకమునకు దొఱకును' అనెను.

"నేను చల్లగా, 'అవియెల్ల దీనియంత విలువకలవి కావేమో' యంటిని."

కో: నీవామాట యనినప్పుడు జాకబు ఏమియు నన లేదా!

రో: ఈ మాటలు వినఁగనే యాతని కనులు విద్యుల్లతల వలె తళుక్కని మెఱసెను. పిమ్మట సుధామధుర వాక్య ముల నన్ను లాలించుచు, 'అగుచో, అమ్మాయీ! రోజా! నీ తలం పా మొలక చాల విలువకలదనియేనా?' అని యల్లనఁ బ్రశ్నించెను.

"నేను వెంటనే, పొరపడి మాట జాఱితిఁగదా యని గ్రహించి, ధైమియు నెఱుఁగనట్లు, 'ఏమో కలువల ప్రాశ స్త్యమునుగూర్చి నాకేమి తెలియును? విలువగలవి కాకున్నను

కైదీ లిట్టి వస్తువులతోఁ గాలము గడుపుచుండుట మాకను భూతవిషయము. పాప మీ వాన్ బారలుగూడ నట్లే యీ కలువమొలకతో కాలక్షేప మొనర్చుచుండెను. వానికి వినోదముఁ గల్పించు నీ యొక్క వస్తువును హరించుట యన్యాయము కాదా ?' యంటిని.

"నా జనకుఁడప్పుడు, 'మొదలు వానికీ కలువ యెచట నుండి వచ్చినదో మనము విచారింపవలెను' అని నా దెసఁ జూడ, నే నాచూపు మోవజాలక, యవ్వలిమో మగుడు, జేకబు సవిమర్శదృష్టి నన్ను వీక్షించుచుంట యరసితిని. "శేషం కోపేన పూరయేత్" అన్నట్లు, కొన్ని ప్రశ్నముల నీగుటకుఁ గోపమే చక్కనిదారి. నేను చివాలున నటనుండి లేచి బయలు దేరి వచ్చుచుంటిని. అపుడు జాకబు నా జనకునితో మెల్లగా, 'నీవు బంధితుని, వాని యుడుపులను జక్కగా శోధించితివేని, ఇంక నట్టి కలువలు వానికడ నున్నచో బయల్పడును. సాధారణముగా మూడు మొలకలు సేకరించుటకలదు' అనెను."

కో : (ఉలికిపడి) మూడు మొలకలా! వాఁడెట్లెటింగెనో కదా!

రో : నాకు నదియే సందియము జనించి వారికగపడకుండఁ బొంచియుండి వింటిని. మాయయ్య, 'ఇంకను మొలక లున్న వే యనుము. వాని చెంత నే యుండునని సిద్ధాంత మేమి ?' యనుచుండెను.

"జాకబు,'అగుచో నీవే దేని నెపమున బంధితుని గ్రింధికిఁ గొనిరమ్ము, నేను వాని గదియెల్ల శోధింతును' అనియెను."

కో : అయ్యో! అయ్యో! ఈ జాకబు పాపివలె నున్నాఁడే!

రో : నాకు నటులే తోచుచున్నది.

కో: (ఆలోచనాధీనుఁడై) చూడుము, రోజా! నీ వానాడు కలువనాటుటకు మడి చదును చేయుచుండ నిన్నీతఁడు తోటలోనికి వెన్నంటి వచ్చెనని కదా చెప్పితివి?

రో: నిజమే.

కో: చెట్లచాటునఁబొంచియుండి నిన్నుఁ బరీక్షించెఁగాదా?

రో: అగును.

కో: రోజా! యింకను సందియమా?

రో: ఏ విషయమున?

కో: నిన్ను వలచి గాదుసుమా వాఁ డేతెంచినది.

రో: మఱి యెవ్వారిని వలచి వచ్చెను!

కో: వాఁడు నా మొలక కోసమే వచ్చెను. వాఁడు నా కలువ కన్నె నే వలచినాఁడు.

రో: నిక్కమే కావచ్చును.

కో: నీ కింకను సందియమున్నచోఁ దీర్చుకొన వచ్చును.

రో: ఎట్లు?

కో: ఎల్లి నీవు తోటలోని కేగుము. తొలినాటి వలెనే యాతఁడు చూచుచుండగా నేగవలయును. వాఁడు నిన్ను వెంబడించి రాఁగలఁడు. నీవు కలువ మొలక నాటుచున్నట్లు నటింపుము. పిమ్మట నింటిలోని కేగి తలుపువైచి, వాని కగపడకుండ వాఁడేమి చేయునో పరీక్షింపుము.

రో: పరీక్షించిన పిమ్మట?

కో: పిమ్మట మనము కర్తవ్య మూహించుకొందము.

రో: (నిట్టూర్చి) ఔరా! కలువలపై నెంత ప్రీతి నీకు!

కో: (నిట్టూర్చుచు) రోజా! నిజము వచించుచున్నాను.

మీయయ్య నిన్న నా యభాగ్యపు మొలకను ద్రొక్కి-వైచినదాది నా మేనిలో సగము లోపించినటు లున్నది సుమా!

రో: అగుచో, మీరు మాయయ్య చెప్పినట్లేల చేయ రాదు?

కొ: మీయయ్య యేమి చెప్పెను?

రో: మీకు వందలకొలది కలువల నిచ్చెదనని చెప్పలేదా?

కొ: నిజమే.

రో: ఇకనేమి? రెండు మూడు మొలకల నడిగి తీసికొని, వానితోఁబాటు మీ మూడవ మొలకను సాకవచ్చును.

కొ: నిజమేకాని; మీయయ్య యొక్కఁడైనచో నీ యుపాయము కొనసాగును. దౌర్భాగ్యపు జాకబు దాపురమయ్యె నాపాలిఁటికి. వాని కన్నులు గప్పఁగలమా? యని సందేహము.

రో: అదియు నిజమే. కాని, మీ కత్యంతప్రియతమమగు నీ వ్యాపారము నీ కారణమున మానుకొనఁగలరా?

ఆ పడుచు నవ్వుచు నొకించుక వ్యంగ్యగర్భముగా నిట్లు పలుకఁ, గోర్నిలియసు, కొండొకతడ వాలోచనాధీనుఁడై, ప్రియతమమైన కోర్కె-నడంచుకొన యత్నించుచున్న వాఁడువోలె మిన్నకుండి, పిదపఁ దన మనోనిశ్చయము నిట్లు గంభీరముగా వచించెను.

"ఆ పని నావలనఁ గాదు. నే నీ వ్యాపారమును విరమించుటకన్న దౌర్బల్యము, దోషము, నైచ్యము వేఱొండు కలదా! వీరల యసూయాక్రోధములకు వెఱచి, నాకు లభించిన యీ యవకాశముగూడ జాఱవిడుతునేని నా పావ

మునకు నిష్కృతి యుండదు. రోజా ! ఇఁక సందేహములతోఁ బని లేదు. రేపు నీ మొలకను నాటు విషయమును నిశ్చయింప వలసినదే. (నిట్టూర్చి) కాని, రోజా ! మూఁడవ మొలక నెట్లు దాచెదవో సుమా ! లుబ్ధుఁడు తన యార్జించిన మొట్టమొదటి కాసును, కోల్పోవు తుట్టతుదికాసునుబోలె, తల్లి బిడ్డనుబోలె, క్షతగాత్రుఁడు తన మేనిలోని నెత్తురు రక్షించువానిబోలె దానిని గాపాడు భారము నీది. తుదకదియే మనపాలిటి భాగ్యదేవతయై, యభీష్టదాయిని కాఁగలదని నా యాత్మకుఁ దోఁచుచున్నది."

రోజా దైన్యమును దెచ్చికోలు గాంభీర్యమున మాటు కొనుచు, "ఆర్యా! మీరు దిగులు నెందకుఁడు. మీ యానతి శిరసావహించెదను" అనియెను.

కోర్నీలియసు సముత్సుకతావశుఁడై మఱియు నిట్లు వచింపఁ దొడఁగెను. "రోజా ! యింకొక మాట చెప్పెద నాలింపుము. నీ వెంత మెలఁకువనై వర్తించినను, ఆ దేస మాలిన జాకబుగాని, నీ తండ్రిగాని నీమాటలు చేతలు నను మానించినట్లు నీకుఁ దోఁచినచో, సుంతయు సంశయింపక నన్నైనఁ ద్యజింపుము కాని, కలువ నేమఱఁ జనదు. రోజా ! అట్లు చూచెదవేమి ! నీ వలనకదా నేను జీవించియున్నది ! నీకన్న నాకింక నెవరున్నారు ? అవసర మొదవినచో యీ నన్నైనఁ ద్యజింపుము. నన్నుఁ జూచుటకు రావలదు. కలువను జూచుకొను చుండుము."

ఈ మాటలచే హృదయము జారిపోవ, రోజా, నీరు గ్రమ్ము కనులతో "అక్కటా!" యనెను.

కో : అదియేమి రోజా !

రో: నా కోర్కె విషయము స్పష్టమైనది.

కో: అది యేది?

రో: కలువలపై నీకుఁగల యీ ప్రీతి, నీ హృదయమున నన్యవిధమగు ప్రీతికిఁ దావు లేకుండఁ జేసినది.

అని వెక్కి వెక్కి యేడ్చుచు నా జవరాలచ్చట నిలువక వెడలిపోయెను. నాటిరేయి కోర్నీలియసుపాలిఁటికి కాలరాత్రియై వానిని దుర్భర వేదనపాలు సల్పెను.

రోజాకు తనపైఁ గినుక వొడమినది. అట్లు కినుక వొడముట న్యాయ్యమే. ఇంక నా పడుచు తన్నుఁ జూడ నరుదేరదు. తన కింక రోజా వార్తలు, కలువ వార్తలు గూడఁ దెలియరావు.

ఈ విచారమున నాపుష్పకర్షకుని మానసము రోజావైపు మలుసూపుట వాని కుసుమరసజ్ఞతకు లోపమే కావచ్చును. చింతాపరంపరలో మునిఁగి, కొట్టుకొని, యలసి, తెలవారు జామున నిద్రాధీనుఁడగుసరి కాతని మనోనేత్రము నెదుట సాక్షాత్కరించిన దా ద్రాక్షానుల రోజాయే కాని కలువకన్నె మాత్రముకాదు. మా కథానాయకున కిది గౌరవాపాదకము కాకున్నను, సత్యమునే వచించుట మా ధర్మము.

## ౧౫

నాటిరేయి రోజా కన్నుమూయలేదు. కోర్నీలియసు మాటలయ్యాబల హృదయపద్మమున ములుకులై నాటిన కతన, నచట నాతఁడు తనకై వెతచెందుచుంట నెఱుంగనేర దయ్యె. కలువకన్నె యాతని మానసము గుత్తగొన్నదికా

నిశ్చయించిన రోజా కా రాత్రి కన్నీటి కాలువలతో వేగెను. తెల్లవారినపిమ్మట గోర్నీలియసుచెంత కింకఁ జనరాదని నిశ్చయించుకొనెను.

తా నేగకున్న నాతని గారాపుగలువవార్త లించుకయు నెఱుంగరాని కోర్నీలియ సెంత యారాటపడునో! ఎవని దురవస్థకుఁ దొలుత జాలిచెంది, పిదప నెయ్యము వహించి, తుద కెవ్వనికిఁ దన మానసము చూఱవిడిచెనో, యాత డిపుడు, కలువవార్త లెఱుంగక నెతఁజెంద నాచేఁడియ మిన్న కుండఁగలడా! కావున నాతనికి లేఖామూలమునఁ దద్వార్త లంపనెంచెను. ఉత్తరము వ్రాయు నేర్పింక నామె కలవడ లేదు. ఎవరిచెంతనైన నలవరచుకొందమన్నఁ గోర్నీలియసుఁ దక్క నింకొక గురుని వరించుటకు మనసొగ్గదయ్యె. కావున స్వయముగ నిరంతరాభ్యాస మొనర్పఁ దొడఁగెను.

"డివిటు" తనకిచ్చిన బైబి లామె యభ్యాసమునకు ముఖ్యసాధనము. ఆ గ్రంథము తెఱచినపుడెల్ల, దాని తుది పుటలో నాఁడు కోర్నీలియసు వ్రాసిన పంక్తులు కండ్లఁబడును. ఆపంక్తులఁ జదివినపుడెల్ల, క్రొల్గనుల నుష్ణబాష్పము లుప్పతిల్లి, పాలిస చెక్కుటద్దముల జాల్వార, నధీరయై, "యక్కటా! యా నాఁడు నన్నితఁడు వలచె ననియే మురిసి పోతిఁగదా!" యని పలవించును.

పాపము! కోర్నీలియసు హృదయరంగమున, కలువకు, రోజాకు నొదవిన పోరాటములో నిప్పటికి రోజాదే మేలు చేయియైన రహస్య మా బేల యెఱుంగక, యనుదిన మట్లు కుమారిలుచు నుత్తరము వ్రాయు నేర్పు నభ్యసించుచుండెను.

ఇఁక నచటఁ గోర్నీలియసుకుఁ దెల్లవారునప్పటికి

రోజాపైఁ గూర్కి పంపఁబొాలెను. అంతమాత్రమునఁ గలువ యాతని మదికి పూర్తిమైపోయెనని యూహింపరాదు. కాకున్నఁ దొల్లి కలువనే సర్వస్వముగా నెంచుకొని, దాని కొఱకు రోజానైనఁ ద్యజింపనెంచువాఁ డిపుడు, దైవికమానుషిక సృష్టివిలాసములు మూర్తీభవించిన యయ్యపురూపపుష్ప మును నూత్నప్రేయసివశమునఁ గైసేసి యానందించు భాగ్యమున కువ్విళులూరఁదొడఁగెను.

ఆ పవలెల్ల నాతని మనస్సు పరిపరివిధముల నేగుచు నేమియుఁ దోఁచినదికాదు. ప్రేయసి యథాప్రకారము తన్నుఁ జూడవచ్చునో రాదో యను భయముచే నాతఁడు కళవళ పడెను. సూర్యుఁ డస్తమించినదాది హృదయము దడదడ లాడఁ జొచ్చెను. నిన్న రోజాతోఁ దానొనర్చిన నెలివి మాలిన ప్రసంగము ప్రత్యక్షరము స్మరించుకొని తన మనోహారిణి పూపమన సా మాటలచే నెంత నొచ్చెనో యని సంతాపము చెందెను. "నన్నుఁ జూడరాకున్నను మానె గాని, కలువను మాత్రము కావాడు" మని, యా పరమోపకారశీలతో నాడి, యామె సరళహృదయమును నొప్పించిన తన కఱకుదనమునకు నిష్కృతి యున్నె యని నిందించుకొనెను.

క్రమముగా నొక్కొక్క ఘడియ గడచుచుండెను. రోజా జాడ కాన్పించదు. ఏడుగంటలు కొట్టిరి; యెనిమిదియుఁ గొట్టిరి. తుదకుఁ దొమ్మిదిగంటలు నాతని హృదయము మీఁదనే కొట్టినట్లాయెను.

హృదయముపైఁ జేయివైచి తదావేగము నడచిపట్టి, యయ్యెలనాగ వచ్చుచున్నదేమో? యడుగుల సవ్వడియైన గాగరాకుచ్చెలసద్దయిన విన్పించునేమో ? యని మనస్సు

చెవులలో నిలిపి యాలకించెను. మరల పావుగంట కొట్టిరి; యరగంట విన్పించెను. ముప్పాతికగంట నినదించెను. తుదకు బదిగంటలు మోగెను. ఆతని గదినుండి ఆపూఁబోడి మరలి యేగు వేళకూడ నతిక్రమించెను.

తాను భయపడినట్లే యైనది. ఆ మనస్విని కినుక పూని తన్నగతికుని గావించినది. "నా కిట్లు కాఁదగినదే. ఆమె రాకుంట దోసమా? నేను మాత్ర మా స్థితిలో నెట్లు వత్తును?" అనుకొనెను. అనికొనియెనేకాని యింక నడియాస పీడింప, మరల విసఁజొచ్చెను; అర్ధరాత్రముదన్క నెదురెదురే చూచి, నిరాశ జేసికొని యెట్లో శయ్యపై నొఱగెను.

ఉదయమున గ్రైఫసు యథాకాలమున నరుదెంచినపుడు కోర్నిలియసు వానివంకఁ జూడఁడయ్యె. వానిని ప్రసంగము లోనికి దింపి రోజానుగూర్చి ప్రశ్నింపనెంచెను గాని యాతఁ డెట్లూహించునో యని తలఁచి మిన్నకుండెను. ఒకవేళ, రోజా జబ్బుగానుండి రాలేదేమో యను నాస వాని నింకను బాధింపఁదొడఁగెను.

రోజా యెన్నఁడుఁ బగటివేళ వచ్చు నలవాటు లేదు. నాఁడు మాత్రము వేళ దప్పించి వచ్చు నను నమ్మకము లేకున్నను మాటిమాటికి నతఁ డులికిపడుచు, ద్వారము దెస మరలి చూడఁదొడఁగెను. రెండవసారి గ్రైఫసు వచ్చినపుడు, కోర్నిలియసు మనసు నిలువనోపక, వానియెడ నతిమాత్రాదరము నటించుచు రోజా సేమ మడిగెను. వాఁడు కుశలమే యన్నట్లు తలయూచి వెడలిపోయెను.

మూడవపర్యాయము వచ్చినపుడు ప్రశ్నము మార్చి

"కోటలో నేరికి జబ్బు చేయలేదుగదా?" యని యడిగెను. 'లే'దని తటాలునఁ దలుపునైచి యాతఁ డేగెను. తనపట్ల బంధితుడు సూపు నాత్మాదరము, తన్ను లంచపంచము లిచ్చి లోగొనుటకుఁ గానోపు నను సందియము మాత్రము వానికి జనించెను. మరల సాయంత్ర మేడుగంట లగునప్ప టికిఁ దొలినాటి యాందోళన మెల్ల ద్విగుణీకృతమై పొడ సూపెను. అనుదిన మాతని చీకటిగదిలోనికి వెలుఁగు గొని తెచ్చి, మఱునాడు తిరిగి యేతెంచునందనుక చాలినంత వెలుఁగు నాతని హృదయమున నించి యేగు భాగ్యదేవత నాఁడుగూడ సాక్షాత్కరింప దాయెను.

భగ్నాశాదుఃఖితుఁడై యానిశిగూడ నాతఁడెట్లో వేగించెను. మఱునాఁడు గ్రైఫసు వచ్చినప్పుడు, వాని యెడఁ గొర్నీలియసునకు సాజమైన యేవము ముమ్మడియై వాని చూపులు మాటలు దుస్సహమై తోచెను. కూఁతురు రాకుండ నీ పాలసుఁడే యభ్యంతరము కల్పించెనేమో యను నాశ కొర్నీలియసు హృదయమున నింకను మినుకు మినుకు మనుచుండెను.

దుష్టుఁ డగు నావృద్ధుని గొంతునులిమి చంపుద మన్నంత క్రోధము జనించెనుకాని, యట్లొర్చినచో నింక నెన్నఁటికి రోజా తన మోము చూడ దను భీతిమై నాతఁ డూరకుండెను.

సాయంతనవేళ నా భగ్నాశుని హృదయమున దైన్యము నకుఁ జీకటికూడఁ దోడయ్యెను. రోజాను గూర్చిన వెతకుఁ గలువను గూర్చిన దిగులు తోడయ్యెను. కలువలు నాటుట కా దినము లెంతయు ననుకూలములు. రోజాకుఁ గినుక యీ తరుణముననే జనింపవలయునా! ఈ తరుణము జాఱవిడిచినచో

నట్టె యెద నింకరాదు. ప్రియావియోగదుఃఖమునకుఁ దోడు కలువ స్త్రీనఁగాచి తుదకు నక్కలపాలొనరించు దుఃఖముకూడ నీ నిర్భాగ్యునకు సమకూరునేమో!

ఈ విషాదములచే నాలవనాఁ డాకలియు డప్పియు నాతనికి దూరమైపోయెను. విషణ్ణభావముచే మూకమై, యన్నము నీరు ముట్టమిచే నీరసించిన యాతని యాకారము చూపఱకు జాలి గొల్పుచుండెను. తల మరల వెనుకకు రాదేమో యను భీతియు విడనాడి, గవాక్షపుగమ్ముల సందున దూర్చి, దుర్గములోని తోట కనులఁ బడునేమో యని నిక్కి చూచును. తోటలో నా ప్రాతస్సమయమున రోజాయో కలువయో దృష్టిగోచరమగునని యా మందభాగ్యుని యాశ.

బంధితుఁ డాదినమెల్ల సన్నోదకముల వర్జించి మంచముపైఁ బడియుండుట యరసి గ్రైఫను నాటిరేయి భోజనవేళ, "పంజరములోని విద్వద్విహంగ మిఁక నెన్నాళ్లో జీవింపఁ" దనెను.

రోజా యులికిపడి నివ్వెఱఁజెందెను. జాకబు, "అట్లను చుంటివేమి!" యని ప్రశ్నించెను.

గ్రై: అన్నము నీరు వర్జించి మంచముపైఁ బడియున్నవాఁ డెన్నాళ్లు జీవించును?

రోజా విగతప్రాణవోలె తెల్లనై "పాపము, కలువకై బెంగపెట్టుకొన్నాఁడు కాబోలు" ననుకొనుచు, డిల్లవోయిన మానసముతో, శయనమందిరమున కేగి, రేయెల్ల జాబులు వ్రాయుచుండెను.

ఉదయమునఁ గొర్నిలియసు మంచము వీడి యల్లన గవాక్షము చెంత కేగ నచటఁ బడియున్న కాగితమొండు

కాన్పించెను. అతఁ డొక్క యెదుటున నద్దాని లంకించుకొని, తత్తరపడుచు నందిట్లు చదువుకొనెను. "దిగులు చెందకుఁడు. మీ కలువ సుఖముగా నున్నది."

ఈ యుత్తరముచే నాతని దుఃఖ మించుక యుపశమించి నను, ఆ మాటలలోని ధ్వని యాతని నలంచెను. రోజా రోషావిష్ట యయ్యెనేకాని రుజాగ్రస్త కాదని తెల్లమయ్యెను. ఆ నెలంత తనకుఁ దానై రా మానెఁగాని యొరు లామె నడ్డగింప లేదు. రోజాను గాంచనేరక తా నపేలుకడలిం బడియుండఁ దన్నుఁ గాంచకుండ నా పైదలి మనసు బిగ్గపట్టుకొన్నది. కానిప్పుడు, ఈ లేఖకు బ్రత్యుత్తరము వ్రాసి యచ్చుటనే యొడెదనని నిశ్చయించి, "కలువనై నేను దిగులు పెందుట లేదు. నిన్నుఁ గాంచనేరక దురపిల్లుచుంటిని" అని వ్రాసి యా తలుపుక్రిందనే యుంచెను.

రోజా వచ్చిన జాడయు వెళ్లిన జాడయు లేదు. కాని అతఁ డట్లు వేచియుండ నూర్పుగాలివోలె నల్పమై, ముద్దువోలె కోమలమైన వాక్కున, 'రేపు' అను ధ్వని విన్పించెను.

రేపటి కెనిమిదినాళ్లు వా రొండొరులఁ జూచికొని.

## ౧౬

మరునాటి మలుసంజ రోజా వచ్చువేళకుఁ గొర్నేలియసు తలుపుచెంతనే వేచియుండెను. ఎప్పటివోలె రోజా పదధ్వనియుఁ బిదప దీవియవెలుఁగును వీతెంచెను.

కృశీభూతుఁడై, పాలియున్న కొర్నేలియసు నా ముగుద యరసి వెలవెలఁబోవుచు "ఆర్యా! జబ్బుగా నుంటిరా" యనెను. తనకు హృదయమున, శరీరమునఁగూడ జబ్బుగా

నున్న మాట నిజమే కాన నాతఁ డల్పస్వరమున, "అవు" ననియెను.

రో: నిన్న మీ రన్నము ముట్టక, నీరు ద్రావక మంచమునఁ బడియుండి రని మాయయ్య సెప్పగా వింటిని. మీ దిగులు వాపనెంచి మీ కత్యంతము ప్రేమాస్పద మగు గలువవార్త లేఖాముఖమున దెలిపితిని.

కొ: నేను దానికి బ్రత్యుత్తరము వ్రాసితిని. నీ వే తెంచుటఁ జూడ నీ కా లేఖ యందియే యుండును.

రో: లేఖ యందినమాట నిజము.

కొ: ఇఁక నేమి! చదువు రాదను సాకు వోయెఁగదా! నీ వ్రాత కూడఁ జాల ముచ్చటఁ గూర్చుచున్నది.

రో: ఆ యుత్తరముఁ బఠించియే, మీ కేమైన చికిత్స చేయఁదగియుండునేమో యని యూరయవచ్చితిని.

కొ: నాకుఁ జికిత్సయా! అగుచో నేదో శుభవార్త దెచ్చి నట్లున్నావు.

ఇట్లనుచు నాతఁడు చూపుల నాశాకిరణములు మెఱయ నా పడుచువంకఁ దేరకొనఁజూచెను. ఆ చూపుల నర్మభావ మెఱుంగకయో, రోజా యెఱుఁగ నెంచకయో, నిర్వికారయై, "నీ కలువవార్తలే కదా నేఁ జెప్పఁదగినవి. నీ కీ వెత దానిగూర్చియే యని నే నెఱుఁగనా" యనియెను. ములుకులంబోని యీ పలుకు లాతని డెందమును నోనాట, నాతఁడు "అక్కటా! మరల నా మాటయేనా రోజా! చెప్పితిని కదా, నాకు నీ తలంపే యని; నిన్నుఁగూర్చియే వెతఁజెందుచుంటిని. నీవు లేని జీవితము, స్వాతంత్రముగూడ నాకు వల దని. ఇంకను నీ మోడి వీడవా?" యని వేడుకొనెను.

రోజా విషాదాక్రాంతమగు చిఱునవ్వొలయఁ "బాపము, మీ కలువ కెంత కష్టపాటు వచ్చెను!" అనియెను.

ఈ మాటలచే రోజా యాతనిఁ బరీక్షింప నెంచెనో? లేదో? యెఱుంగముకాని, పాప మాతఁడావలలోఁ జిక్కెను. వడవడ వడంకుమేను, డిల్లవోయిన మానసమునై యాతఁడు తటాలున, "ఏమికష్టము? రోజా! యేమికష్టము వచ్చినది?" యని ప్రశ్నించెను.

రోజా, యాతనియాతురమును జాలిచూడ్కులఁ జూచి నిట్టూర్చి, యీ ఋజుస్వాంతునకు శక్యముకాని పని కాతని నియోగించి ఫలములే దనియు, సాజ మగు నీ యల్పలోపము తోడనే యాతని చెట్టనట్టక తీర దనియు నిశ్చయించి, "మీ రూహించినట్లే యైనది. ఆ జాకబు మీ కలువ కోసమే వచ్చెను" అని చెప్పెను.

పదుదినముల క్రింద 'జాకబు నాకోసమే వచ్చె' నని రోజా యెఱిఁగించినప్పటికన్న, నేఁడు, 'మీ కలువకోసమే వచ్చె' నని చెప్పగా వినినపుడు కొర్నెలియసు మిగుల వెలవెల్లనై, "అక్కటా" యని యార్చెను.

ఆతని విషాదాతిరేకముచే రోజా విన్నఁబోయెను. కొర్నెలియసు రోజా మోమున విన్నఁదనముఁ దిలకించి, యా మనస్విని తలం పూహించి, "రోజా! నా యెగ్గు సైపుము. నీ చరిత్రము నాకుఁ గ్రొత్తకాదు. నీ దాక్షిణ్యమును, సరళ స్వభావము నే నెఱుంగనివి కావు. ఆపత్సమయమున నిన్ను నీవు కాపాడుకొను బుద్ధిని, శక్తిని నీ కీశ్వరుఁడు ప్రసాదించి నాఁడు. మఱి నా కలువకో? దాని కట్టిశక్తి లేదుకదా! దాని వెత బాపుట కెవ రున్నారు, రోజా!" అని దిద్దుకొనసాగెను.

రోజా యామాటలకు బదులు సెప్పక, "జాకబు నన్నట్లు వెన్నాడుచున్నాఁడని విన్నదిమొదలు నీవు సెందు నారాటము గన్నంతనే నాకును నారాటము జనించినది. క్రిందటిసారి నే నిచటికి వచ్చినప్పుడు నీవు సెప్పిన—" అని పలుకుచుండఁ, గోర్నిలియసు పల్కులకడ్డమువచ్చి, "రోజా, మరల నింకొకసారి నిన్ను వేఁడికొందును. నాఁటి నా తెలివిమాలిన పలుకులు సైరింపుము. ఇంతకుమున్న వేఁడితి నా యొగ్గు సైపు మని, సైరింపవా రోజా?" యని యంజలిపట్టెను.

ఆ పలుకులు గణింపక రోజా వచింపఁదొడఁగెను.

"ఆ య్యసహ్యాపుజాకబు వచ్చినది నా కోసమో, కలువ కోసమో పరీక్షించుటకు నీ వానాఁ డొకయుపాయము సెప్పితివి."

కో: నిజము; అసహ్యాపుజాక బంటివికదా రోజా! నీ కాతనిపై నేవమేనా ?

రో: ఏవముకాదా మఱి? ఈ వారము దినములనుండి నా పడినవెత కంతటికి మూలకారణ మాతఁడేకదా ?

కో: అయ్యో! రోజా! నీవును వెతపాలైతివా? ఈమాట చెప్పి నన్ను ధన్యుని గావించితివి.

రో: ఆ దుర్దినమునకుఁ బరదినమున సంజవేళ నీ చెప్పిన చొప్పునఁ దోటలోని కేగితిని. అతఁడు నా వెనుకనే యేతెంచి; చెట్లచాటున డాగియుండెను. నేను మడిచెంత కేగి, త్రవ్వఁకోల బూని, మట్టిఁ ద్రవ్వి, కలువను నాటుచున్నట్లు కపటనాటకము నాడితిని. ఇంతసేపు నావంకఁ జూచుచునేయున్న వాని కన్నులు చెట్లసందునఁ బెద్ద పులి కన్నులవలె మెఱయుచుండెను.

కో: ఓరి నీచుఁడా! ఓరి కుమతీ!

రో: పిమ్మట నే నింటిలోని కేగి, తలుపుచాటున నిలిచి చూచుచుంటిని. నేను మరల నేతెంతు నేమో యని యాతఁడు కొంతతడవు నిదానించిచూచి, వృక్షముల మాటునుండి వెలువడివచ్చి, కొంతసేపేమియు నెఱుఁగ నట్లటునిటుఁ దిఱిగి, పిమ్మట చుట్టుదారింబడి మడిచెంతకే తెంచెను. అచట నిలిచి బెదరుజూపుల బెసలు గలయ నరసెను. మింటిదెసఁ గూడఁ జూడ్కులు సారించెను. ఎచ్చట నే ప్రాణియుఁ గన్పింపమి, నింక భయము లేదని తలఁచి, మేకపై నుఱుకు సింగపుఁగొదమపోలె మడిలోనికి లంఘించెను, నే నంతకుమున్ను త్రవ్విన క్రొత్తపాదులోని మట్టినెల్ల గాలించి చూచి, యందు నేమియు లభింపమి, మోసపోతిగదా యని గ్రహించె. పెచ్చు పెరుగుచున్న కోపము నడఁచికొని, పాఱఁజిమ్మిన మట్టి నంతయుఁ దొంటిమాడ్కి వేవేగఁ జదును గావించి, యేమియు నెఱుంగనివానిపోల్కి నిర్వికారుఁడై లోని కేతెంచెను.

కో: (మోమునఁ జిఱుచెమ్మట వోదుడుచుకొనుచు) ఓరి నీచమతీ! తుచ్ఛుఁడా! యెంతకైనఁ దగినవాఁడవురా! నేను దొలుతనే యనుమానించితిని. మఱి రోజా! నీ వా దుంప నేమి చేసితివి? దాని నాటుట కిప్పటికే యదను దప్పినది కదా!

రో: అంకురము నాటి యాఱునాళ్లయినది.

కో: ఆ! ఆ! ఎక్కడ నాటితివి వెట్లు నాటితివి? రోజా!

తొందరపడి యెచట నాటితివో కదా, దానిని ఆ నీచుఁ డపహరింపఁడుకదా !

రో : నా పడకగదిలోని కాతఁ డెట్లు రాఁగలఁడు? మీ కా భయము వలదు.

కో : ఎట్లు! పడకగదిలో నాటితివా? మంచిపని చేసితివి. ఏ మట్టిలో నాటితివో? యే పాత్రలో నాటితివో? నీళ్ళు పోసి పెంచుట లేదు కదా?

రో : మీ కా భీతియు నక్కఱలేదు. మీ కలువను నీళ్లలోఁ బెంచుట లేదు లెండు.

కో : బ్రతికితిని.

రో : చక్కని పింగాణి కొప్పెరలో మూఁడుపాళ్లు మట్టియు నొకపా లెరువును బోసి, యందు నాటితిని. మీరును, నా జాకబుహాతకుఁడు నెన్నియోమారులు కలువను బెంచు విధాన మెల్లఁ జెప్ప వినియుండియు నింకొక తెఱఁగున నొనర్తునా?

కో : చాలినంత వెలుతురు, గాలియు నున్నవా ?

రో : సూర్యుఁ డున్నంతసేపు దానికిఁ దక్కరప్రసారము లభించుచునే యున్నది. అది యించుక మోసెత్తఁగనే మీ రిచట నిడినట్లె దానిని గవాక్షములో నిలిపెదను. పూర్వాహ్ణమున తూర్పుదెస గవాక్షమున, నపరాహ్ణమున పశ్చిమగవాక్షమున నుంతును.

కో : మేలు మేలు! రోజా! నీ కెంతలో నెంత పాండిత్యము కుదిరినది ! కాని యీ కలువ మూలమున నీకుఁ దీఱిక లేకుండఁ బోవు నేమో?

రో : నిజమే కాని నా కా చింత లేదులెండు. మీకలువ

నాకు మోహపుఁగూఁతురు. ఆ బిడ్డకుఁ దల్లినై యహ రహముఁ గంట వత్తిడికొని దాని సాకుదును. (నవ్వుచు) దాని సాపత్న్యము బాపుకొనవలయు నన్నచో దానికిఁ దల్లి నగుటకంటె మార్గము లేదు.

"దయామయ కదా నాముద్దు రోజా" యనుచుఁ గోర్నీలియ సప్పు డామెపైఁ బ్రసరింపఁ జేసిన చూడ్కులో పుష్ప రసజ్ఞతకంటె శృంగారరసజ్ఞతయే ములుసూపుట గ్రహించి ఆపె యొకింత సంతుష్టి నెనసెను.

పిమ్మటఁ గొంతవడి వారిరువురు నిశ్శబ్దముగా నూర కుండిరి. వెనువెనుక కొదుగుచున్న రోజా హస్తమును గవాక్షములో నుండి కోర్నీలియసు గ్రహించెను.

కో: రోజా! కలువ నాటి ఆఱునాళ్ళాయె నని చెప్పితివి కదా. ఆకుఁ దొడిగిన జాడ యేమైన నున్నదా?

రో: రేపఁటికి మోసెత్తు నని యెంచెదను.

కో: రేపు దాని సేమము నెఱిఁగింతువు కాదు? చూడుము రోజా! నీ వన్నట్లు కూఁతుపై నాకుఁ బ్రీతి నిక్కమే కాని, తల్లిపై నంతకన్న మిక్కుటము సుమీ!

రోజా కోర్నీలియసును గ్రేగంటఁ గాంచుచు, "ఎల్లి నాకిటకు రా వలనుపడ దేమో?" యనెను.

కో: అక్కటా రోజా! రాఁజాలవా?

రో: రేపు నా కెన్నియోపను లున్నవి.

కో: నాకుమాత్ర మొక్కటే పని సుమా.

రో: నిజము. మీ కలువనుగూర్చిన తలపోత యొక్కటియే మీకు.

కో: కాదుసుమీ, రోజానుగూర్చి తలపోతయే నాకుఁ బని.

రోజా, యెుయ్యారముగఁ దల పంకించి యూరకుండెను. కొర్నీలియసు కొంత సేపటికి, "రోజా ! సృష్టిలో నిత్యత లేదు. అన్నింటికి మార్పు సాజము. వసంతపుష్పములు పోయి వర్షా కుసుమము లరుదెంచుట గాంచవా! ప్రియమార మాలతీ మరంద మానిన మధుపమే, కాలక్రమమున మల్లీసుమములపై ఝుంకారము సల్పుచు వ్రాలుచుండును" అనెను.

రో : దాని కర్థ మేమో ?

కొ : తెలియుచుండ లేదా, రోజా! నను దిగనాడి నీ వన్యాసక్త వైతివి. పోనిమ్మా, మంచిపనియే చేసితివి. ఇందు నీ దోసము లేదు. నన్ను విడనాడకు మని వేడు నర్హత లేదుకదా నాకు!"

రోజా దుఃఖ మాపుకొనఁజాలక కొర్నీలియసు చూచు నన్నయభిమానముగూడ విడనాడి, క్రొవ్వేడి బాష్పబిందువులు ముత్తెములవోలె రాలుచుండ, "దైవమా ! యిది యేటి నింద! నిన్ను విడనాడితినా నేను" అని వాపోయెను.

కొ : నన్నిచట మృత్యువుపాలు చేసి రెండియు రాకుంట విడనాడుటకాదా ?

రో : నేను రాక నిలుచుట నీ కోసమేకదా! నే నిటకు వచ్చిన నీ కలువ నెవరు సాకుదురు? దాని పోషణ భారము వహించుట నీపై విశ్వాసముచేఁ గాదా ?

కొ : రోజా ! నీ కింత యీసేల ? విశ్వమున నాకుఁగల యీ యొక్క సౌఖ్యమును సహింపలేకపోతివి.

రో : నేను సహింపని దేది ? హేగునగరమున నిన్ను వధింప నున్నా రని వినఁబడినమాటఁ దక్క నేను సైపఁ జాలని దేది ?

కో: నెచ్చెలీ! నా పుష్పప్రియత్వము నీకుఁ దాపము గూర్చుచుండలేదా?

రో: నీ పుష్పప్రియత్వము కాదు నాకుఁ దాపహేతువు. పుష్పములపై నున్నంత ప్రీతి కీ మందభాగ్య నోచదాయెఁగదా యని తపించుచున్నాను.

కో: బేలా! యూరక యధీరవు కాకుము. నావంకఁ జూడుము; నా కరము లెట్లు వణఁకుచున్నవో? నా హృదయ మెట్లు కొట్టుకొనుచున్నదియో కాంచుము. ఈ యుద్వేగమంతయు హృదయహారిణి వగు నీకొఱకు గాదా? ప్రియా! నీ వింకను నమ్మవేని యీ నల్ల గలువను పెఱికివైచి, గొంతు నులిమి దాని యల్ప ప్రాణము హరింపుము. చిననాఁటినుండి నా కాంచుచున్న యవ్యాకలంకస్వప్నము, నా సుకుమారతేజో లేశమును హరించి యార్పివేయుము. నే నించుకయు శోకింపను. రోజా! నీకు మేలుపడి, నీవే లోక మని యున్న యీ దీను ననుగ్రహింపుము. వీనిని నీ హృదయపీఠమున నభిషిక్తుని గావింపుము."

"నీ హృదయమునమాత్ర మగ్రపీఠము గలువకే యిమ్ము" అనుచున్న రోజాహస్తముల నాతఁడు గ్రహించి, పరమానురాగమున ముద్దుగొనుచుండ, రోజా నిట్టూర్చుచు మిన్నకుండెను.

అట్లు ముద్దుగొనుచు, "నా రోజాకుఁ బిమ్మటనే ఇతరము. రోజాయే నా హృదయాధిదేవత" యనెను.

రో: ఈ మాట లెవరు నమ్ముదురు లెండు!

కో: ప్రియా! నన్ను నీవే నమ్మఁజాలవా?

రో: కానిండు; కేవల మీ ప్రేమకే మీరు బద్ధులైనప్పటి మాటకదా!

కొ: నిజము, ఈ బంధనమునుండి విడివడుట నాకు శక్య మంటగాని నీవుమాత్రము కట్టువడక తప్పదుసుమా రోజా!

రో: దేనికి కట్టువడుట?

కొ: నీవు వివాహమాడ కుండుటకు.

రో: (నవ్వుచు) మీ మగవారి నరుసయే యిది; యింత నిరంకుశత్వ మెచ్చటను గానము. ఇంత స్వార్థపర తయా? చూడుము, నీ వొక సుందరిని గామించితివి; కామించి విశ్వమే మఱచితివి. శిరచ్ఛేదము విధించి, నిన్ను వధ్యస్థానమునకుఁ గొంపోవునపుడుఁగూడ దానినే తలపోసి దుఃఖించితివి. అట్టి నీ విపుడు న న్నేమి కోరు చుంటివో తలపోయుము. ఇతర సౌఖ్యములు, నానం దము విడనాడి, నిన్నే నమ్ముకొని, నీకే నన్నర్పించు కొమ్మనికదా!

కొ: "నేను కామించిన యా సుందరి యెవ్వతె రోజా!" అని యడిగి, తా నెవ్వరి వలచియుంటినా యని తల పోయఁజొచ్చెను.

రో: అప్పుడే మఱచితివా, యా వినీలగాత్రిని, ఆ లేత నడుము, చిన్నారియడుగులు, ముగ్ధమోము గల యా చిన్నదానిని!

కొ: (నవ్వి) ఆ మిథ్యాసుందరి మాటయా! అది నా స్వప్నప్రియ. నీవు నిక్కంపుఁ బ్రియురాలవు. నూత్న కాముకుఁ డగు జాకబుమాట యటుండనిమ్ము;

నీవే చెప్పితివికదా ? ఎందఱో పడుచువాండ్రు నిన్ను వలచి నీ కటాక్షలవము నర్థించి తిరుగుచుందు రని; ఆ విద్యార్థులను, సైనికులను, వర్తకులను మఱచితివా ? వగలాడీ ! ఈ యూరంగూడ నట్టికాముకు లున్నారా ?

రో: ఉన్నా, రెందఱో యున్నారు.

కో: వా రందఱు లేఖ లంపుచుందురా నీకు ?

రో: అంప కేమి ?

కో: ఇపు డా లేఖ లెల్లఁ జదువనేర్తువుకదా !

రోజా కీప్రణయలేఖలఁ జదువుకొనునేర్పు తనమూలముననేకదా లభించిన దని తలపోసి యాతఁ డుస్సు రని యూరకుండెను.

రో: ఆ పడుచువాండ్ర ప్రణయలేఖలఁ జదివికొని వారి రూపరేఖలను గుణములను బరీక్షింపకున్నచో మీ యానతి నే నెట్లు నెరవేర్పఁగలను ?

కో: అందు నా యానతి యేమి !

రో: (నిట్టూర్చుచు) ఆ నాడు డెవిటుమహాశయుని బైబిలులో నీవు వ్రాసిన యానతి మఱచితివా ? నేను మాత్ర మద్దాని మఱువలేదుసుమా! ఇపుడు చదువనేర్చితినిగాన నిత్యము దానినే పఠింపుచున్నాను. ఇర్వదియో ఇర్వదియెన్మిదివర్షముల వయసు గల యందగాని, నన్ను వలచినవానిఁ జేపట్టు మనికదా మీ రందు లిఖించితిరి. నే నిపు డట్టి ప్రియుని వెదకికొనవలదా ? పవ లెల్ల నాకు నీ కలువతోడనే సరిపోయె. ఇక సంజవేళనైన ప్రియుని వెదకికొననిండు.

కో: రోజా ! నాడు నేను మరణింతు నని యెంచి యట్లు

వ్రాసితినేగాని నేడు దైవానుగ్రహమున జీవించి యుంటినికదా.

రో: అగుచో నా యందగాని వెదకుట మాని మిమ్ము లనే చూడవచ్చెదనులెండు.

కొ: రమ్ము, రమ్ము! రోజా! యెంత గడుసరివే నీవు!

రో: నే నట్లే వచ్చెదనుకాని. మీ రొక్క పని చేయవలయును.

కొ: న న్నడుగవలయునా, రోజా! నీ దాసు నాజ్ఞాపింపుము.

రో: మూణ్ణాళ్ళనుండి గొన్న వను స్మరింపఁగూడదు మీరు.

కొ: మూన్నాళ్లే కాదు. నీవు వల దన్నచో నెన్నటికిఁ స్మరింపను.

రో: (నవ్వి) అంతపని వలదులెండు. అశక్యపుఁగోరిక లెన్నడుఁ గోరను.

అనుచు నా జవరాలు తన మృదుకపోలము యదృచ్ఛగ నో లె గవాక్షసమీపమునకు రానిచ్చెను. ఆ తళుకుఁ జెక్కుల నాతఁడు ముద్దుగొన, రోజా ప్రేమప్రగాఢమగు మంద్ర స్వరమున 'నయ్యో!' యని యార్చి పాఱిపోయెను.

౧౭

వారము దినములనుండియుఁ గూపసదృశమై యూపిరి యాడనీక భయంకరమై తోఁచిన కారాగృహము మఱునాడు తెలవారునప్పటికి బాలభానుకిరణకాంతితరంగితమై కొర్నీలి యను వాలిటికి స్వర్గమై తోఁచెను. పావురములు గొన్ని యపుడే, పటపట మను పక్షాఘాతులతో గవాక్షముచెంత

నట్టాడుచుండెను. కొన్ని ప్రకోష్ఠములనుంచి కలకూజితము లొనర్చుచుండెను.

అతఁడు వెంటనే గవాక్షము దెఱచి చూడ విశ్వమెల్ల నానందతాండవము సల్పుచున్నట్లు గాన్పించెను. ఆ బాలాతపము, నూత్న చైతన్యమును స్వాతంత్ర్యమును దన గదిలోనికిఁ గొని తెచ్చుచుండెను. గదియంతయుఁ బ్రేమజ్యోతిచే వెలిఁగి పోయెను.

వేళ కన్నము గొని తెచ్చిన గ్రైఫసు, శయ్యాతలము వీడి గవాక్షముచెంత నిలిచి కూనురాగముదీయు బంధితునిఁ గాంచి, యక్కజంపడెను. కోర్నీలియసు, గ్రైఫసును, "ఈ ప్రాతర్వేళ నీకు సుఖకరమా" యని కుశలప్రశ్న మొనర్ప వాఁడు బొమముడిఁదాల్చి మిన్నకుండెను. కోర్నీలియసు మరల "మన శునకము, మన మిత్రుఁడు జాకబు, మన చిన్నారి రోజాయు సుఖ మున్నారా ?" యని ప్రశ్నించెను.

గ్రైఫసు పండ్లు గీటుచు, "నిదిగో! నీయన్న" మనియెను.

కో : మేలు మేలు! నా కాకలి దహించుకొని పోవుచున్నది.

గ్రై : నీ కంత యాకలిగా నున్నదిగా ! నీ దుస్తంత్రము కొనసాగుచున్నదా యేమి !

కో. : దుస్తంత్రమా !

గ్రై : ఇపుడేల? నే నంతయు నెఱుంగుదును. మధ్యాహ్నమునఁగాని నీ పని పట్టను.

అనుచు వెడలిపోయెను. పండ్రెండు గంటలు మ్రోగుచుండఁగనే గ్రైఫసు నల్గురు సైనికులఁ దోడ్కొనివచ్చి, వారితో గదిలోఁ జొచ్చి, తలుపువైచి, "చూచెద రేమి? శోధింపుఁ" డనెను.

రో : కానిండు; కేవల మీ ప్రేమకే మీరు బద్ధులైనప్పటి మాటకదా !

కో : నిజము, ఈ బంధనమునుండి విడివడుట నాకు శక్య మఁటగాని నీవుమాత్రము కట్టువడక తప్పదుసుమా రోజా !

రో : దేనికి కట్టువడుట ?

కో : నీవు వివాహమాడ కుండుటకు.

లో : (నవ్వుచు) మీ మగవారి నడుసయే యిది; యింత నిరంకుశత్వ మెందుచేఁ గాఁనము. ఇంత స్వార్థపర తయా ? చూడుము, నీ వొక సుందరిని గామించితివి; కామించి విశ్వమే మఱచితివి. శిరచ్ఛేదము విధించి, నిన్ను వధ్యస్థానమునకుఁ గొంపోవునపుడుఁగూడ దానినే తలపోసి దుఃఖించితివి. అట్టి నీ విపుడు న న్నేమి కోరు చుంటివో తలపోయుము. ఇతర సౌఖ్యములు, నానం దము విడనాడి, నిన్నే నమ్ముకొని, నీకే న న్నర్పించు కొమ్మనికదా !

కో : "నేను కామించిన యా సుందరి యెవ్వతె రోజా !" అని యడిగి, తా నెవ్వరి వలచియుంటినా యని తల పోయఁజొచ్చెను.

రో : అప్పుడే మఱచితివా, యా విసీలగాత్రిని, ఆ లేత నడుము, చిన్నారియడుగులు, ముద్దుమోము గల యా చిన్నదానిని !

కో : (నవ్వి) ఆ మిథ్యాసుందరి మాటయా ! అది నా స్వప్నప్రియ. నీవు నిక్కంపుఁ బ్రియురాలవు. నూత్న కాముకుఁ డగు జాకబుమాట యటుండనిమ్ము ;

నీవే చెప్పితివికదా? ఎందఱో పడుచువాండ్రు నిన్ను వలచి నీ కటాక్షలవము నర్థించి తిరుగుచుందు రని; ఆ విద్యార్థులను, సైనికులను, వర్తకులను మఱచితివా? వగలాడీ! ఈ యూరంగూడ నట్టికాముకు లున్నారా?

రో: ఉన్నా, రెందఱో యున్నారు.

కొ: నా రందఱు లేఖ లంపుచుందురా నీకు?

రో: అంప కేమి?

కొ: ఇపు డాలేఖ లెల్లం జదువనేర్తువుకదా!

రోజా కీప్రణయలేఖలం జదువుకొనునేర్పు తనమూలమునగదా లభించిన దని తలపోసి యాతం డుస్సు రని యూరకుండెను.

రో: ఆ పడుచువాండ్ర ప్రణయలేఖలం జదివికొని వారి రూపరేఖలను గుణములను బరీక్షింపకున్నచో మీ యానతి నే నెట్లు నెరవేర్పగలను?

కొ: అందు నా యానతి యేమి!

రో: (నిట్టూర్చుచు) ఆ నాడు డిపిటుమహాశయుని బైబిలులో నీవు వ్రాసిన యానతి మఱచితివా? నేను మాత్ర మద్దాని మఱవలేదుసుమా! ఇపుడు చదువ నేర్చితింగాన నిత్యము దానినే పఠింపుచున్నాను. ఇరువదియో ఇరువదియెన్మిదివర్షముల వయసు గల యందగాని, నన్ను వలచినవానిం జేపట్టు మనికదా మీ రందు లిఖించితిరి. నే నిపు డట్టి ప్రియుని వెదకికొనవలదా? పవ లెల్ల నాకు నీ కలువతోడనే వరిపోయె. ఇక సంజవేళనైన ప్రియుని వెదకికొననిందు.

కొ: రోజా! నాడు నేను మరణింతు నని యెంచి యట్లు

వ్రాసితినేగాని నేడు దైవానుగ్రహమున జీవించి యుంటినికదా.

రో: అగుచో నా యందగాని వెదకుట మాని మిమ్ము లనే చూడవచ్చెదనులెండు.

కో: రమ్ము, రమ్ము! రోజా! యెంత గడుసరివే నీవు!

రో: నే నట్లు వచ్చెదనుకాని. మీ రొక్క పని చేయువల యును.

కో: న న్నడుగవలయునా, రోజా! నీ దాసు నాజ్ఞాపిం పుము.

రో: మూణ్ణాళ్ళపటుకుఁ గింజవను స్మరింపఁగూడదు మీరుం.

కో: మూన్నాళ్లే కాదు. నీవు వల దన్నచో నెన్నటికిఁ స్మరింపను.

రో: (నవ్వి) అంతపని యెలదులెండు. అశక్యపుఁగోరిక లెన్నడుఁ గోరను.

అనుచు నా జవరాలు తన మృదుకపోలము యదృచ్ఛన పోలె గవాక్షసమీపమునకు రానిచ్చెను. ఆ తళుకుఁ జెక్కుల నాతఁడు ముద్దుగొన, రోజా ప్రేమప్రగాఢమగు మంద్ర స్వరమున 'నయ్యో!' యని యార్చి పాఱిపోయెను.

౧౭

వారము దినములనుండియుఁ గూపసదృశమై యూపిరి యాడనీక భయంకరమై తోచిన కారాగృహము మఱునాడు తెలవారునప్పటికి బాలభానుకిరణకాంతితరంగితమై కోర్నిలి యను వానికి స్వర్గమై తోఁచెను. పావురములు కొన్ని యపుడే, పటపట యను పక్షాహతులతో గవాక్షముచెంత

నర్తిూడుచుండెను. కొన్ని ప్రకోష్ఠములనుంచి కలకూజితము లొనర్చుచుండెను.

అతఁడు వెంటనే గవాక్షము దెఱచి చూడ విశ్వమెల్ల నానందతాండవము సల్పుచున్నట్లు గాన్పించెను. ఆ బాలా తపము, నూత్న చైతన్యమును స్వాతంత్ర్యమును దన గదిలోనికిఁ గొనితెచ్చుచుండెను. గదియంతియుఁ బ్రేమజ్యోతిచే వెలిఁగి పోయెను.

వేళ కన్నము గొనితెచ్చిన గ్రైఫను, శయ్యాతలము వీడి గవాక్షముచెంత నిలిచి కూనురాగముదీయు బంధితునిఁ గాంచి, యక్కజంపడెను. కోర్నిలియసు, గ్రైఫసును, "ఈ ప్రాతర్వేళ నీకు సుఖకరమా" యని కుశలప్రశ్న మొనర్ప వాఁడు బొమముడిఁదాల్చి యిన్నకుండెను. కోర్నిలియసు మరల "మన శునకము, మన మిత్రుఁడు జాకబు, మన చిన్నారి రోజాయు సుఖ మున్నారా?" యని ప్రశ్నించెను.

గ్రైఫసు పండ్లు గీటుచు, "నిదిగో! నీయన్న"మనియెను.

కో: మేలు మేలు! నా కాకలి దహించుకొని పోవుచున్నది.

గ్రై: నీ కంత యాకలిగా నున్నదిగా! నీ దుస్తంత్రము కొనసాగుచున్నదా యేమి!

కో: దుస్తంత్రమా!

గ్రై: ఇపుడేల? నే నంతయు నెఱుంగుదును. మధ్యాహ్న మునఁగాని నీ పని పట్టను.

అనుచు వెడలిపోయెను. పండ్రెండు గంటలు మ్రోగు చుండఁగనే గ్రైఫసు నల్గురు సైనికులఁ దోడ్కొనివచ్చి, వారితో గదిలోఁ జొచ్చి, తలుపువైచి, "చూచెద రేమి? శోధింపుఁ" డనెను.

వాండ్రు బంధితుని దుస్తులు వెదకిరి. శయ్యక్రింద నెమకిరి. కిటికీలు, చూరులు గాలించిరి. గూండ్లు శోధించిరి. తెల్లకాగితములు, సీసపుఁ బుల్లయుఁ దక్క నన్య మేమియు లభింపలేదు. గ్రిఫసు సైనికులఁగూడి మొగము ముడివైచుకొని వెడలిపోయెను.

మూఁడవ కలువ మొలకను దనచెంత నుంచుకొనకుండుట మేలే యైనదని కోర్నిలియసు సంతోషించెను. సాయంత్రము గ్రిఫసు తిరిగి యేతెంచినపుడు కోర్నిలియ సాతనికోపమార్ప యత్నించెను. వాఁడు గుసగుసలాడుచు, నూడిపోఁగా మిగిలిన యొంటికోర వెలికిదోఁప, నను వెనుకకు వడచిపోయెను. అట్లు పోవుట గాంచి, కోర్నిలియసు పక్కున నవ్వ, వాఁడు "ఇల్లలు కఁగానే పండుగ ముగియలేదు లె"మ్మనుచు వెడలిపోయెను.

కోర్నిలియసున కానాఁడు పండువే. తొమ్మిది గంటలగుడు రోజా ముఖచంద్రోదయ మయ్యెను. రోజా నేఁడు దీవియ గొనిరాలేదు. చదువు ముగిసెఁగాన నింక దివ్వెతోఁ బనిలేదు. అదియునుగాక తన్ను నిరంతరము జాకబు కనుపెట్టుచుండెను. కాన దివ్వెతో వచ్చుట భద్రముకాదు. మఱియొక యభ్యంతరము గద్దు. క్షణక్షణ మా ముద్దరాలి మోమున మొలకెత్తెంచు నెలసిగ్గుదొంతరలను దీపికాకాంతి పట్టి యిచ్చును.

నాఁటిరేయి యా జంట యే ప్రసంగములోఁ బ్రొద్దుపుచ్చెనో! ఫ్రాన్సుదేశమున ముంగిళ్లనుండియు, స్పెయిను దేశమున వీథివైపు టుప్పరిగలనుండియు, ప్రాచ్యదేశమునందారామమంటపములనుండియు, కాముకజన మే ప్రసంగము లొనర్తురో వారు నదియే యొనర్చియుందురు.

ఆ ప్రసంగములచే ఘటికలకు రెక్కలు వచ్చెను. అట్లు పదిగంటలదనుక నల్లగలువ పేరెత్తకుండఁ బ్రసంగించి, రోజా వెడలిపోయెను.

కలువ పేరు దడవని ప్రసంగము పుష్పప్రియున కానంద దాయక మగునేని గోర్నిలియ స్సానందము ననుభవించెనని యే చెప్పవలెను. రోజాకన్య సౌందర్యలావణ్యామనస్వితలు నాటిరేయి వానికి మైమఱపు ఘటించెను. కాని రోజాకుఁ గలువపై నింత యీ సేటికో? స్త్రీ మాత్రమున కెల్ల నేదియో లోపముండకమానదు. రోజాకుఁ గలువపై మాత్సర్య మను దోషము పట్టినది. అర్ధరాత్రిముదనుక నాతఁ డీ లోపముఁ గూర్చియే చింతించెను. అనఁగా, మేల్కొనియున్నంత సేపు రోజాచింతనమే. పిమ్మట నిద్రించెనేకాని నిదురలో రోజా కలలే. కలలో సాక్షాత్కరించిన రోజామాత్రము దోషరహిత. కలలో నా జవరాలు కలువనుగూర్చి ప్రసంగించుటయే కాదు. చక్కని చీనాపాత్రలో నొక నల్లగలువను దెచ్చిచూపెను. ఆ యానందాతిరేకమునఁ గోర్నిలియసు వణకుచు "రోజా! రోజా! నా నిధానమా! నా ప్రాణప్రియా!" యనుచు లేచెను.

అప్పటి కప్పుడే యరుణోదయ మగుటచే నాతఁడు మరల నిదురింపక యా సుఖస్వప్నమునే కొనసాగించుచు "కలువపై నీర్ష్యయే లేదేని రోజా కెవరు సాటివత్తురు! అపుడు దివ్యాంగనలు నా రోజాకు నివాళియెత్తుటకైనఁ బనికి రారు" అనుకొనెను.

కలువపై కెత్తరాదని యాన ఇడిన గడువులో ముప్పది యాఱు గంట లప్పుడే గడచెను. ఆ సుదతిరాక కెదురు చూచుటలో మఱి పదునెనిమిది గంటలు చనును. వచ్చి

యేగినపిదప 'తదానందస్మరణముచే మిగిలిన కాలము గడప వచ్చునని యాతఁడు ధైర్యము తెచ్చుకొనెను. యథాకాలము నకు రోజా యే తెంచెను. కలువ పేరు స్మరింపరాదను నిర్బంధమున కెట్లో తలయొగ్గి కోర్నెలియసు తత్సంతాపము దిగమ్రింగికొనెను. రోజా యీన కాతఁడు కట్టువడినప్పు డాతని కోర్కికి సమ్మతించుట రోజాకుఁగూడ ' ధర్మముకావున నాతనికిఁ దన పాణిద్వయముఁ జూఁఅవిడిచెను.

మోహోద్దీపకములగు నీ వంపు చెయిదము లిందీవర స్మరణముకంటెఁ బ్రమాదకరము లన్న రహస్య మాముద్దరా లెఱుంగదు. తుదకుఁ ...గి యేగునపుడు, నెడలు వేడి యూర్పులు, కెంపెక్కిన కపోలములు, చెమ్మగిలిన చూపులు, తడియాఱిన వాతెఱయు నమ్ముగుదకా రహస్యము దెలిపెను.

మఱునాఁడా పైదలి వచ్చినతోడనే కుశలప్రశ్నాదిక మైన పిదప నల్లన నొక్కయడుగు వెనుకకువైచి యా సుందరి జాల్వార్చిన చూపున్ను ద్త్రిప్పియుఁడు చూడఁడయ్యెఁ గాని, చూచిన మిన్నుముట్టియుండును. అట్లు చూచి యా జవ్వని "ఆమె మేల్కొన్నదిసుఁడీ" యనెను. రోజా తనకుఁదానై తన్ను శృంఖలావిముక్తుని గావించునని యాతడు నమ్మఁజాలక "యెవరు మేల్కొన్నది?" యనెను.

రోజా : ఎవరా ? నా కూఁతురు, కలువకన్నె.

కో : ఎట్లు! నా వాకట్టు నీవే విప్పితివా రోజా !

బిడ్డముద్దు చెల్లించు తల్లిపోల్కి రోజా "ఔను, విప్పి తిని" అనియెను.

కోర్నెలియసు పరమానంద భరితుఁడై 'నా ప్రాణమా! రోజా' యనుచుఁ గపోలదర్పణమో, కేలుజివురో, నిటల

చంద్రబింబమో లభించుననను నాసమై బెదవుల గవాక్షమున కాన్చెను. అతనికోర్కె సహస్రగుణితమై ఫలించెనోయనం గదుష్ణము, నర్ధోన్మీలితమ్ము నగు నామె కెమ్మోవియే దొరకెను.

ఈ క్రొత్తచెయిది కమ్మగుద యొకించుక భయంపడుచు నాతఁ డరసి మరల ప్రసంగ మారంభించెను,

కో : రోజా ! యది తిన్ననై మొలచెనా? యించుక వంకర యేమైనఁ గలదా ?

రో : వంకరయే లేదు. అది స్తిమితనిలిచినది.

కో : ఎంత యెత్తు పెరిగినది రోజా ?

రో : రెండంగుళములకు తగ్గదు.

కో : ఎట్లు కాపాడెదవో రోజా ! అది యిక నానాట బెఱుగుచుండునుసుమా !

రో : ఇపుడు మాత్ర మేమటియుంటినా? నాకు దానితోడిదే లోకమయ్యెఁగదా !

కో : దానితోడిదే లోకమా ! అటులైన నీతూరి యీసు నావంతునకు వచ్చును సుమా !

రో : ఈ మాటల కేమి లెండు. దాని తలంపే మీ తలంపని మీ రెఱుఁగనిదా? క్షణమైన నాకది కనుచాటగుట లేదు. మేల్కొనినపుడు దానిపైఁ జూపే కదా! రాత్రి నిదురించుటకు మున్ను తుదిచూపు కలువమీదనే. ఉదయము మేల్కాంచఁగనే తొలిచూపు కలువమీదనే. పవలు పనిపాటులెల్ల దానిచెంతనే. ఆమె గృహప్రవేశము మొదలు నేను పడుకగది విడిచియెఱుఁగను.

కో : ఇందు వింతయేమి? రోజా! యది నీ పెండ్లి కట్నము కదా ?

వారంద్రఱు బంధితుని దుస్తులు వెదకిరి. శయ్యక్రింద నెమకిరి. కిటికీలు, చూరులు గాలించిరి. గూండ్లు శోధించిరి. తెల్ల కాగితములు, సీసపుం బుల్లయుం దక్క నన్య మేమియు లభింపలేదు. గ్రైఫసు సైనికులంగూడి మొగము ముడిచైచుకొని వెడలిపోయెను.

మూడవ కలువ మొలకను దనచెంత నుంచుకొనకుండుట మేలే యైనదని కొర్నీలియసు సంతోషించెను. సాయంత్రము గ్రైఫసు తిరిగి యేతెంచినపుడు కొర్నీలియ పాతనికోపమార్ప యత్నించెను. వాఁడు గుసగుసలాడుచు, నూడిపోగా మిగిలిన యొంటికోర రెలికిదోప, నను వెనుకకు వడచిపోయెను. అట్లు పోవుట గాంచి, కొర్నీలియసు పక్కున నవ్వ, వాఁడు "ఇల్లలుకంగానే పండుగ ముగియలేదు లె"మ్మనుచు వెడలిపోయెను.

కొర్నీలియసున కానాఁడు పండువే. తొమ్మిది గంటలగుడు రోజా ముఖచంద్రోదయ మయ్యెను. రోజా నేఁడు దీవియ గొనిరాలేదు. చదువు ముగిసెంగాన నింక దివ్వెతోం బనిలేదు. అదియునుగాక తన్ను నిరంతరము జాకబు కనిపెట్టుచుండెను. కాన దివ్వెతో వచ్చుట భద్రముకాదు. మఱి యొక యభ్యంతరముకు గద్దు. క్షణక్షణము మా ముద్దరాలి మోమున మొలతెంచు నెలసిగ్గుదొంతరలను దీపికాకాంతి పట్టియిచ్చును.

నాటిరేయి యీ జంట యేప్రసంగములోఁ బ్రొద్దుపుచ్చెనో! ఫ్రాన్సు దేశమున ముంగిళ్లనుండియు, స్పెయిను దేశమున వీథివైపు టుప్పరిగలనుండియు, ప్రాచ్యదేశమునం దారామమంటపములనుండియు, కాముకజన మేప్రసంగములొనర్తురో వారు నదియే యొనర్చియుందురు.

ఆ ప్రసంగములచే ఘటికలకు రెక్కలు వచ్చును. అట్లు పదిగంటలదనుక నల్లగలువ పేరెత్తకుండఁ బ్రసంగించి, రోజా వెడలిపోయెను.

కలువ పేరు వడవని ప్రసంగము పుష్పప్రియున కానంద దాయక మగునేని గోర్నిలియ స్సానందము ననుభవించెనని యే చెప్పవలెను. రోజాకన్య సౌందర్యలావణ్యామనస్వితలు నాఁటి రేయి వానికి మైమఱపు ఘటించెను. కాని రోజాకుఁ గలువపై నింత యీసేటికో! స్త్రీ మాత్రమున కెల్ల నేదియో లోపముండకమానదు. రోజాకుఁ గలువపై మాత్సర్య మను దోషము పట్టినది. అర్ధరాత్రముదనుక నాతఁడీ లోపముఁ గూర్చియే చింతించెను. అనఁగా, మేల్కొనియున్నంత సేపు రోజాచింతనమే. పిమ్మట నిద్రించెనేకాని నిదురలో రోజా కలలే. కలలో సాక్షాత్కరించిన రోజామాత్రము దోషరహిత. కలలో నా జవరాలు కలువనుగూర్చి ప్రసంగించుటయే కాదు. చక్కని చీనాపాత్రలో నొక నల్లగలువను దెచ్చిచూపెను. ఆ యానందాతిరేకమునఁ గోర్నిలియసు వణకుచు "రోజా! రోజా! నా నిధానమా! నా ప్రాణప్రియా!" యనుచు లేచెను.

అప్పటి కప్పుడే యరుణోదయ మగుటచే నాతఁడు మరల నిదురింపక యా సుఖస్వప్నమునే కొనసాగించుచు "కలువపై నీర్ష్యయే లేదేని రోజా కెవరు సాటివత్తురు! అపుడు దివ్యాంగనలు నా రోజాకు నివాళియెత్తుటకైనఁ బనికి రారు" అనుకొనెను.

కలువపై రెత్తరాదని యీనాఁ డుడిన గడవులో ముప్పది యాఱు గంట లప్పుడే గడచెను. ఆ సుదతిరాక కెదురు చూచుటతో మఱి పదునెనిమిది గంటలు, చనును. వచ్చి

యేగినపిదప తదానందస్మరణముచే మిగిలిన కాలము గడప వచ్చునని యాతఁడు ధైర్యము తెచ్చుకొనెను. యథాకాలమునకు రోజా యేతెంచెను. కలువ పేరు స్మరింపరాదను నిర్బంధమున కెట్లో తలయొగ్గి కోర్నీలియసు తత్సంతాపము దిగమ్రింగికొనెను. రోజా యాన కాతఁడు కట్టువడినప్పు డాతని కోర్కెకు సమ్మతించుట రోజాకుఁగూడ ధర్మముకావున నాతనికిఁ దన పాణిద్వయముఁ జూఱవిడిచెను.

మోహోద్దీపకములగు నీ వలపు చెయిదము లిందీవర స్మరణముకంటెఁ బ్రమాదకరము లన్న రహస్య మామెద్దరా లెఱుంగదు. తుదకుఁ, గిరిగి యేగుసప్పుడు, నెడలు వేడి యూర్పులు, కెంపెక్కిన కపోలములు, చెమ్మగిలిన చూపులు, తడియాఱిన వాతెఱయు నమ్మగుద కా రహస్యము దెలిపెను.

మఱునాఁ డాపైదలి వచ్చినతోడనే కుశలప్రశ్నాదిక మైన పిదప నల్లన నొక్కయడుగు వెనుకకువైచి యా సుందరి జాల్వార్చిన చూపును దత్ప్రియుఁడు చూడఁడయ్యెఁ గాని, చూచిన మిన్నుముట్టియుండును. అట్లు చూచి యా జవ్వని "ఆమె మేల్కొన్నదిసుఁడీ" యనెను. రోజా తనకుఁదానై తన్ను శృంఖలావిముక్తునిఁ గావించునని యతఁడు నమ్మఁజాలక "యెవరు మేల్కొన్నది?" యనెను.

రోజా: ఎవరా? నా కూతురు, కలువకన్నె.

కో: ఎట్లు! నా వాకట్టు నీవే విప్పితివా రోజా!

బిడ్డముద్దు చెల్లించు తల్లిపోల్కి, రోజా "ఔను, విప్పితిని" అనియెను.

కోర్నీలియసు పరమానంద భరితుఁడై 'నా ప్రాణమా! రోజా' యనుచుఁ గపోలదర్పణమో, కేలుజివురో, నిటల

చంద్రబింబమో లభించుననను నాసమైఁ బెదవుల గవాక్షమున కాన్పించెను. అతనికోర్కె సహస్రగుణితమై ఫలించెనోయనఁ గదుష్ణము, నర్ధోన్మీలితమ్ము నగు నామె కెమ్మోవియే దొరకెను.

ఈ క్రొత్తచెయిది కమ్మగుద యొకించుక భయంపడుట నాతఁ డరసి మరల ప్రసంగ మారంభించెను,

కో: రోజా! యది తిన్ననై మొలచెనా? యించుక వంకర యేమైనఁ గలదా?

రో: వంకరయే లేదు. అది నిట్టనిలిచినది.

కో: ఎంత యెత్తు పెరిగినది రోజా?

రో: రెండంగుళములకు తగ్గదు.

కో: ఎట్లు కాపాడెదవో రోజా! అది యిక నానాట బెలుగుచుండునుసుమా!

రో: ఇపుడు మాత్ర మేమటియుంటినా? నాకు దానితోడిదే లోకమయ్యెఁగదా!

కో: దానితోడిదే లోకమా! అటులైన నీతూరి యీాసు నావంతునకు వచ్చును సుమా!

రో: ఈ మాటల కేమి లెండు. దాని తలంపే మీా తలంపని మీారెఱుఁగనిదా? క్షణమైన నాకది కనుచాటగుట లేదు. మేల్కొనినపుడు దానిపైఁ జూపే కదా! రాత్రి నిదురించుటకు మున్ను తుదిచూపు కలువమీాదనే. ఉదయము మేల్కాంచఁగనే తొలిచూపు కలువమీాదనే. పవలు పనిపాటులెల్ల దానిచెంతనే. ఆమె గృహప్రవేశము మొదలు నేను పడుకగది విడిచియెఱుఁగను.

కో: ఇందు వింతయేమి? రోజా! యది నీ పెండ్లి కట్నము కదా?

రో: నిజము. నా కది వయసుకాఁడు నందగాఁడగు వల్ల భుని నా వలచినవాని ఘటించును.

కో: వగలాడీ! యీమాట లింకఁ జాలింపుము.

ఆమె మృదుపాణిపల్లవముల నాతఁ డిచ్చవచ్చినంత సేపు కేల్దోయి నిడుకొని యల్లన నొత్తుచు కలువను గూర్చి కలువదీఱ మాటలాడిన యీ సుదినము మొదల్కొని దిన దినము కలువతోపాటు వారి వలపుదీవయు ప్రబవృద్ధమై యింపు గూర్చఁ దొడఁగెను. ఆకులు దొడగెనని యొకనాఁడు, మొగ్గ వెడలెనని యొకనాఁడు, శుభవార్తలు. ఇఁక నాతని యానంద మేమి చెప్ప? సంతోషతరంగములు వేలాతిక్రమణ మొనర్ప నాతఁడు ప్రశ్నపరంపరలు గురిపించెను.

కో: ఏమంటివి రోజా! నిజముగా మొగ్గ దొడిగినదా?

రో: నిజముగా.

ఆ యానందమునఁ దూలిపడువాఁడై కొర్కిలియను గవాక్షపుఁ జువ్వల నూని నిలచి,

"ధన్యోస్మి ధన్యోస్మి" యనుకొని మరల

"రోజా! మొగ్గఁ దొడిగిన దంటివి కదా, యెంత పొడవున్నది మొగ్గ? క్రింద గుండ్రడనై, చివర మొన తేలి యున్నదా?"

రో: మొగ్గ యడుగున వర్తులభాగ మంగుళము పొడ వున్నది. చివర సూదివలె మొన తేలినది.

పిమ్మట రెణ్ణాళ్లకు రోజా "రేకులు విచ్చుచున్న"వని చెప్పెను.

"విచ్చుచున్నదా? రోజా!" యని ఔత్సుక్యముచే వణ కుచు, నాతడు—

"మరి దానివర్ణమో" యని యడిగెను.

రో: నల్లగనే యున్నది.

కో: ఈ కిటికి చువ్వల యంత నల్లగ నున్నదా?

రో: అంతకంటె నల్లగా నున్నది.

కో: ప్రియా! యేమంటివి? అంతకంటె నల్లగా నున్నదా! రోజా! నన్ను బ్రతికించితివి. ఏదీ, చెప్పు మావర్ణమెట్లున్నదో?

రో: నే నుత్తరము వ్రాసిన మషీరసమువలె నున్నది.

ఒడలెఱుంగని యానందమున కెవ్వున నార్చి యాతడు గంతువైచి యంతలో నిలిచి బద్ధాంజలియై "రోజా! నీవు నా భాగ్యదేవతవు! నీ కే వేల్పులు సరిరారు" అని పల్కెను.

రో: (నవ్వుచు) నిజముగా!

కో: రోజా! ఎంతకష్టపడితివో నీవు! నాపై నెంత యనుగ్రహమో నీకు! నా కలువ యిఁక వికసించుట నిజము, నల్లనై వికసించును. ఎంతభాగ్యము! ఎంత భాగ్యము రోజా! యీ సృష్టిలో సకలగుణపరిపూర్ణవు నీవొక్కతెవే సుమా! నిష్కళంక వన నీవే!

రో: కలువకంటెనా!

కో: వలదు, కోపనా! యీ నిష్ఠురోక్తు లింక వలదు. నీ విరసోక్తులచే నా యానందము భంగమొనర్పకుము. నీకుఁ బుణ్యముండును. నా కీ మాట చెప్పుము. ఇఁక రెండు మూనాళ్లకది నెఱవిచ్చునా?

రో: రేపో? తప్పిన, మాపో?

కో: అయ్యో! రోజా! నే నద్దానిఁ జూడనుకదా! పరమేశ్వరుని పరమాద్భుతలీలాపరిణామ మగు నా నల్ల

గలువను, నీపాణిపల్లవమును కపోలదర్పణమును ముద్దా డినపగిది,—నా నల్లగలువను మై నిమిరి, ప్రియమార ముద్దాడుభాగ్యము నాకు లేదుకదా!

రోజా కిటికిచెంత కేతెంచెను. తెలియక కాదు— గావలెననియే వచ్చి ప్రియుని ముద్దులకు నునుచెక్కులందిచ్చెను.

రో: దీని కింతయేల! తెమ్మన్నచో దాని నల్లనే బెఱికి యిటకుఁ దీసికొనిరానా?

కో: వలదు రోజా! వలదు. అది వికసింపఁగనే నీడలో నుంచుము. వెంటనే హార్లెమునగరమునకు వార్త నంపుము. పుష్పప్రియపరిషదధిపతికి నల్లగలువ పూచిన వార్త నంపుము. ఆ నగరి మిటకుఁ జాల దవ్వు. అయ్యో సొమ్మొసంగినచో వార్తాహారుఁడు లభింపకపోఁడు. రోజా! నీచెంత నేమైన ధనమున్నదా?

రో: (నవ్వి) ఉన్నది.

కో: చాలినంత?

రో: మూడునూరు లున్నవి. చాలునా!

కో: ఇఁక నేమి! మూఁడునూర్లున్నచో వార్త నంపనేల? నీవే వెళ్లిరావచ్చును.

రో: నేను తిరిగివచ్చునందనుక యీ బూవుగతి యెవరు విచా రింతురు?

కో: నిజము నిజము, పూవునుగూడ వెంటఁగొనిపొమ్ము. క్షణమైన దానిని నీవు విడచియుండరాదు.

రో: దానిని విడువకుండవలయునన్న నిన్ను విడిచియుండ వలయునుగదా?

కో: నిజము, ప్రియభాషిణీ! నిజము. దైవమా! నే నీ

నరుల కేమి యపకార మొనర్చితిని! వీండ్రు నిష్కార ణముగా నా స్వేచ్ఛను హరింపనేల? రోజా! నీవన్నది యథార్థము. నిన్ను విడిచి నేనుజీవింపఁజాలను. హార్లెము నగరమునకు వార్త నంపవలసినదే కాని నీ వేగ వలదు. అదృష్టశ్రుతపూర్వమగు నీ వింతకలువను వెదకికొనుచు నా యధ్యక్షుఁడే రాఁగలఁడు.

అనుచు, నంతలో నులికిపడి, మెలుగు త్రొట్టిల్ల, “రోజా! రోజా! తుద కది నల్లగా వికసింపదేమోకదా!” యనెను.

రో: రేపో, మాపో యంతయుఁ దెల్లమగునుకదా! తొందర పడనేల?

కొ: అయ్యో! సాయంతనముదనుక నావార్త వినకుండ నేను నిలువఁగలనా రోజా! నాకా వార్త తెలియు నట్లేదేని సంకేత మొనర్చుకొన్న మేలు.

రో: సంకేతము కన్న మంచి పనియే చేయుదును.

కొ: ఏమి చేయుదువు?

రో: ఈ రాత్రియే యది వికసించునేని నేనే వచ్చి తెల్పు దును. రేపు వికసించునేని నేను చీటి వ్రాసి, మా యయ్య రెండవతూరి వచ్చి యేగినపిమ్మట దలుపు క్రిందుగా లోనికి దూర్చి యేగుదును.

కొ: మేలు, గుణవతీ! మేలు. ఈ శుభవార్త నీనోట వినుట మేలుపై మేలుకదా!

రో: అదె, పదిగంటలు మ్రోగుచున్నవి. నేనింక నేగుదును.

కొ: పొమ్ము, రోజా! పోయిరమ్ము.

"షామ్మ షా"మ్మని యాతఁ డట్లంపుట రోజా కొకింత దుఃఖహేతు వయ్యెను. తనకలువ యేమగునో యనికదా యాతఁ డట్లు త్రోసిపుచ్చినది !

౧౮

కొర్నీలియ సా ఁయెల్ల రోజా వచ్చుచున్న దేమో యని క్షణక్షణ ములికిపడుచు, ద్వారముచెంత కేఁగి తొంగిచూచు చుండియు సుఖముగానే గడపెను. తాను రోజాకొఱకు మేల్కొనియుండ రోజా తన నల్లగలువకై మేల్కొని యుం డును. జగ మెన్నఁడు నూహించియైన యెఱుఁగని యద్భుత దివ్యలతాంతము చెంతనున్న రోజాయే తనకన్న భాగ్యశాలిని. నేటికి నల్లగలువ పుట్టి పెరుగుచున్నదనియు, వానుబార లను ఖైదీ తత్కర్తయనియు విని లోక మెంత యాశ్చర్యము నెనయునో ! యెంత పరమాద్భుతవశ మగునో కదా ?

"నిన్ను బంధముక్తుని గావింతుము, ఆ పూవు నొసఁ గెదవా" యని యెవరైన నడిగినచో ఆ బేరమును గొర్నీ లియసు కాలదన్నుట నిశ్చయము.

తెల్లవారినది ; కలువవార్త రాలేదు. అది యింకను వికసింపలేదు కాఁబోలు. పవలు గడచిపోయి నిశి వచ్చెను. నిశితో రోజాయు హాస్యప్రఫుల్లముఖియై యేతెంచెను.

కొ : ఏమైనది రోజా ?

రో : సర్వతోభద్రము. ఈ రేయి వికసించితీరును.

కొ : నల్లగనే వికసిం ... ? 

రో : కారునలుపు.

కో : మచ్చలేని నలుపేనా ?

రో : కారునలు పంటినిగా.

కో : ఎంతభాగ్య, మెంతభాగ్యము ! రోజా ! రాత్రియం తయు నాకుం గలలే!—ముఖ్యముగా నిన్నుఁ గూర్చియే! (రోజా యామాట నమ్మనట్లు తలపంకించెను) తరువాత మన కర్తవ్యమును గూర్చి—

రో : అవధారు, ఆనతిండు !

కో : కలువ నల్లనగుట నిశ్చయమేకాన నీ విఁక నాలసింపక వార్తాహారుని వెదకవలెను.

రో : సిద్ధముగనే యున్నాఁడు.

కో : నమ్మఁదగిన వాఁడేకద !

రో : ఆభారము నాది. అతఁడు నావలపుకాండ్రలో నొకఁడు.

కో : జాకబు కాఁడుగద !

రో : ఆతఁడు కాదులెండు. ఈతఁ డీ యూరివాఁడే, పాతి కేండ్ల పల్లెవారి చిన్నవాఁడు.

కో : అక్కటా !

రో : (నవ్వుచు) భయపడకుఁడు. ఇర్వదియా, తిర్వది యెన్మిది వర్షముల వానినిగా, మీరు పేర్కొన్నది ! ఈతని కింక నావయసు రాలేదుకదా !

కో : ఈ పడుచువాని విశ్వసింపవచ్చునా ?

రో : ముమ్మాటికి, నాకొఱ కాతఁడు ప్రాణమైన నొసఁగును.

కో : మేలు రోజా! మేలు. పడుచువానికి హార్లెమిచ్చుటకిఁ బదిగంటల ప్రయాణము. నాకొక కాగితము, సీసపుఁ బుల్లయు నిమ్ము ; సీసపుబుల్ల ,కాదు; కలము సిరా తెచ్చిపెట్టుము. నేనుత్తరము లిఖింతును. కాదు కాదు,

నీవే లిఖింపుము. ఈనిర్భాగ్యపు జైదీమాట లెవ్వరును నమ్మరు. కావున నీవే లేఖ వ్రాయుము. సంఘాధ్యక్షుని పేర వ్రాయుము.

రో: ఆ అధ్యక్షుఁడు వెనువెంటనే రాఁడేమో? వచ్చి తీరును. పోనిమ్ము; నీ వన్నట్లు వెంటనే రాకున్నను, ఒకనాఁడు, రెండునాళ్ళు తడయును. అంతమాత్రమున భయములేదు. అప్పటికి మన పుష్పము వికసించియే యుండును. ఇంతకు, మనము వృథా భీతిల్లుటయేకాని, పుష్పకళాభిజ్ఞుఁడగువాఁ డెన్నఁడు నాలసింపడనినమ్ముము. ఈ పరమాశ్చర్యవార్త వినిన పిమ్మట నట్టివాఁడద్దానిఁ దిలకింప కొక్కనిముస మోర్వఁగలఁడా! కావున నాతఁడు వెంటనే వచ్చి, కుసుమమును బరిశీలించి, నల్లగలువ పూచెనని పరిషత్తునకు నివేదించును. నీ వా నివేదనకుఁ బ్రతిక నొండు గైకొని ప్రూవు నాతని కప్పగింపుము. రోజా! నాకీ బంధనకర్మము పట్టుటచేఁ గాని, లేకున్న మన మిరువుర మా సుమకన్యను వెంటఁ గొని యేగెడివారము గదా! అపు డద్దాని నాచేతిలోఁ, దప్పిన నీ చేతిలో, నేమరక తాల్చి యప్పగించెడి వారము. అక్కటా! యీ మందభాగ్యున కంతటి యదృష్టమా! నా చిన్నారి కలువ ముద్దుమోము వికసించి పరులకుఁ గనులపండు వొనర్ప, నా కనులు చిల్లులుపడిపోయెను. రోజా! యీ మిథ్యామనోరథములతో నేమికాని, అధ్యక్షుఁడు నూచుదనక దాని నోరులకంటఁ బడనీయకుము. ఆ పెన్నిధాన మొరుల కంటఁ బడెనా, మనకు దక్కదు.

రో: నేను కనుగల్గి యుందునుగదా. భయములేదు.

కో: నీ విచట నుండఁగా నది వికసించునేమో!

రో: నిజము. ఆ వగలాడి యెంతకైనఁ దగినదియే.

కో: పువ్వు విచ్చినపిమ్మట క్షణమైన నాలసింపక యధ్యక్షు నకు వార్తనంపవలెం జుమీ.

రో: అధ్యక్షునకు, నీకుఁగ్నూడఁ దెలుపుదును.

అతని యాత్మస్నేహ్యమునకు రోజా యుస్సురని యొకింత యూర్చినను, తన్మానసమున సిపుడు మాత్సర్యము లేదు. ప్రియునియెడ ననివార్యమగు నీ లోప మామెకుఁ బరిపాటియై పోయెను.

రో: నాకింక ననుజ్ఞ యిండు. పూవు విచ్చఁగనే మీ కెఱిఁగింతును. వెనువెంటనే హార్లముపురికి వార్త నంపుదును.

కో: రోజా! నా పెన్నిధానమా! ఈ విశ్వమున నీతోఁ బోల్పఁదగిన వస్తువే లేదు.

రో: నల్లగలువ యున్నదికదా పోల్చుటకు! నన్ను దానితో సరిపోల్చిన నాకుఁ బరమానందము. ఆర్యా! నా కనుజ్ఞ యిండు.

కో: పోయిరమ్ము. ప్రాణప్రియా?

రో. ప్రాణప్రియా! పోయివచ్చెదను.

కో: ప్రాణాధికప్రియా! యనుము.

రో: సెలవు. ప్రాణప్రియా!

కో: అట్లుకాదు. రోజా! నిను వేఁడుకొందును. ప్రాణాధికప్రియా! యనుము.

రో: కానిమ్ము. ప్రాణాధికప్రియా! సెలవు.

అనుచు సౌఖ్యపరవశుఁడై, రోజాయేగిన పిదపఁ గోర్నీలియసు గవాక్షము చెంతనే నిలిచి, మింటిపై వెలుఁగు తారాసహస్రము నానందపులకితుఁడై యవలోకించుచు నెడ నెడ రోజా వచ్చుచున్నదేమో యని పాఱఁజూచుచు నుండెను.

“అదే; యచట నా రోజా, నా వలెనే క్షణక్షణము నిందీవరవికాసము బ్రతీక్షించుచున్నది. అల్లదే! యాకర్ణాంతములగు నామె లోచనప్రతిస్పర్ధనో యన నా యిందీవర మనుక్షణము విస్తరిల్లి వికసించుచున్నది. కలువరేకులఁ బోని యంగుళులతో రోజా, నా కలువకాడను స్పృశించుచుండనోపు! భద్రముసుమా రోజా! అల్లన స్పృశించుమా! అరవీడుచున్న దాని రేకులు నీకు ముద్దువచ్చునేమో! రోజా! కాకలు దేరుచున్న నీ కెమ్మోవితోఁ గలువను ముట్టి ముద్దాడకుమా! అహో! అచట నా ప్రాణములు రెండు నొండొంటి నిపుడు ముద్దాడుకొనుచున్నవి కదా!”

ఈ గతి నాతఁ డూహాపరంపరల నీదుచుండ, నాకసమునుండి కనులు మిఱుమిట్లు గొలుపు చుక్క యొండు తెగి, చక్కసాగి, కాస్టన్ దుర్గముపైఁబడుట నాతఁడు దిలకించి, యొడలాపాదమస్తముగా జల్లుమన, “అల్లదే! దైవము నా కలువ కాత్మజ్యోతి నంపినాడు” అనుకొనెను.

ఆతని యూహ నిజమో యన, నా నిముసముననే రోజా యేతెంచి, “రమ్ము, కోర్నీలియసు! నెచ్చెలీ! రమ్ము. ప్రాణప్రియా! రమ్ము. ప్రాణాధికప్రియా! రావేమి?” యని పిలిచెను.

కోర్నీలియసు తలుపుచెంత కొక్కఁగంతువైచి యచట,

నెదురైన రోజాకెమ్మోవి ముద్దుగొనెను. రోజా, ముద్దు లోనే, "వచ్చినది ఇల్లిదే! నల్లనై వచ్చినది" యని తెలిపెను.

కో : అయ్యో ! దాని నిచటి కేల తెచ్చితివి.

రో : నీ యానందపరిపూర్తి నర్థించి యెట్లో వెంటఁగొని వచ్చితిని.

అని దివ్వె వెలిఁగించి యా వెలుఁగున నల్లగలువ నెత్తి చూపెను. కోర్నీలియసు ఆనందపారవశ్యమున సొమ్మసిలు వాఁడై, "ఓహో! దైవమా! నేటికి నన్ననుగ్రహించితివి. నిరపరాధినగు నా నిర్బంధకష్టము నేఁడుగా ఫలించినది! నీ పరమానుగ్రహమున నా చెఱసాలజాలకముచెంత నీ వింత పూవులు రెంటిని వికసింపఁజేసి నను జరితార్థు నొనర్చితివి!"

అని మ్రొక్కులిడుచు, అష్టాదశాంగుళోచ్ఛ్రయమై, యద్భుతకాంత్యుదారమై, సౌందర్యసీమయై, వర్ణచతుష్టయాభిశోభితమై, యెట్టయెదుట సాక్షాత్కరించిన యిందీవరస్వప్నము నాతఁడు సహస్రాక్షుఁడై తిలకించెను. ఆనందోద్వేగమున నాతఁ డసురుసురగుచు, "రోజా! యింకఁ జూచెద వేమి, జాబు వ్రాయక ?" యనెను.

రోజా : "ప్రియతముఁడా! జాబు సిద్ధముగానే యున్నది. చదివిచూడు" మని యాతని కందిచ్చెను. ముత్యాలకోవ వలె ముచ్చటగూర్చు నక్షరపంక్తి నాతఁ డిట్లు చదివెను.

అధ్యక్షమహాశయా !

నల్లగలువ పదినిముసములలో వికసింపనున్నది. వికసింపగనే మీ చెంతకుఁ దద్వార్త నంపుచున్నాను. మీరు, వార్త చేరఁగనే స్వయముగ కొట్టను దుర్గమునకు విచ్చేసి యా పూవు గొనిపో వేఁడెదను. కారాగృహపాలుని తనయ

నగు నే నస్వతంత్రనుకాన నీ యద్భుతకుసుమమును మీ చెంతకుఁ గొనిరాఁజాలక, మీరే యిటకు రండని కోరుచుంటిని.

ఈ పూవు 'రోజా బార్న్లని'యని పిలువఁబడుగాత మని కోరుచున్నాను.

ఇది వికసించినది. అచ్చముగ నల్లనై వికసించినది. మహాశయా! వెంటనే విజయంచేయుఁడు.

ఇట్లు మీరాకఁ బ్రతీక్షించుచున్న
రోజా గ్రైఫసు.

కొర్నిలియు సాలేఖఁ జదివికొని, "బళిబళీ! రోజా! నీలేఖ యద్భుతముగా నున్నది. నేను వ్రాసినచో నింత యింపుగా నుండెడిది కాదుసుమా. అధ్యక్షుఁడు వచ్చిన వెంటనే యాతని ప్రశ్నముల కెల్ల సదుత్తరము లిమ్ము. దీని వృత్తాంత మంతయు నాతని కెఱిఁగింపుము. ఎంత శ్రమపడి, నిద్రాహారములు వర్జించి, యీ పుష్పమును బెంచితిమో యది యెల్ల నాతనికి విన్పింపుము. ముందీలేఖ నంపవలయు; వార్తాహారు నరయుము."

రో: ఆ యధ్యక్షుని పేరేమోకదా.

కొ: "ఆ యుత్తర మిటు లిమ్ము! ఆతని పేరు నేను దానిపై లిఖింతును. వానుహారిసేననామకుఁడగు నాతఁడు సుప్రసిద్ధుఁడు, తన్నగరపాలకుఁడును. ఉత్తరమును దెమ్ము, తెమ్ము" అని యందుకొని కరము కంపించుచుండ దానిమీద నధ్యక్షుని పేరెట్లో లిఖించి, లేఖ నా బాల కొసంగి, "కొనిపొమ్ము రోజా! వార్తాహారు నంపుము. ఇందనుక మనలఁ గాపాడిన యీశ్వరుడే మనపాలఁ గలఁడు. పోయిరమ్ము" అని రోజా నంపెను.

## ౧౯

రోజా కార్నిలియసుల పాలిటి దైవ మెచటఁగలఁడో కాని, వారు చాల విషమావస్థలోనే యుండిరి. జాకబు మహాశయుని మన పూర్వమిత్రుఁడు బాక్ట్సలుగాఁ బరిత లూహించియే యుందురు. నల్లగలువ కొఱకుఁ బ్రాణముల నైనఁ బోకడపెట్ట నిశ్చయించిన యా విషసర్ప మింటిలోఁ జేరిన పిమ్మట నింక వారి కెచ్చటి మనశ్శాంతి?

హేగునగరమున నొనర్చిన ప్రయత్నము లన్నియు భగ్నమైన పిదప వాఁడు, కాస్టనునగరమున కేతెంచి, గ్రైఫసు కదవత్రావుడు మప్పి, వానితో చెలికారమొనర్చి, రోజాను వలచివచ్చిన వానివలెఁ గోటలోఁ బీఠము వెట్టెను.

తొలినాఁడు రోజాను వెన్నాడి యాతఁడట్లు తోటలోని కేగుటయు, గ్రైఫసు కలువ మొలకను ద్రొక్కి వైచునపు డాతడు మండిపడుటయు, రోజా కార్నిలియసులకు ననుమాన కారణ మగుట మన మెఱుఁగుదుము. పిమ్మట రోజా కలువను నాటుచున్నట్లు నటించి పన్నిన వలలో నాతఁడు పూర్తిగాఁ జిక్కుకొని తన యాథార్థ్యము రోజా యెఱింగె నని గ్రహించెను.

ఆ దినములలోనే రోజా ప్రణయకలహము వెట్టుకొని యెను. ఆ పడుచువాండ్ర రహస్యము బాక్ట్సలు ముందే గ్రహించెను. కార్నిలియసుగదిలో నింకను మూలము లుండి యుండునని యూహించి, గ్రైఫసును బురికొల్పి వెదకించి విఫలమనోరథుఁ డయ్యెను.

పిమ్మట నా దినములలో రోజా తన గదినుండి వెలు

పలికి రామి నాతఁ డనుమానించి, కోటవెలుపల నొక మేడపై గది యద్దెకుఁ గైకొని, యందుఁ బ్రవేశించి యటనుండి దూరదర్శనీసాహాయ్యమున రోజాగదిలోని విశేషము లరయఁ జొచ్చెను.

పింగాణితొట్టె నొండు రోజా తన పడుకగదిలోనికిఁ గొంపోవుటయుఁ దోటలోని మట్టిని జేరవైచుటయుఁ, గలువ దుంప నందు నాటుటయు నాతఁడు గనుఁగొనెను. పిమ్మట నా తొట్టె నెండ దగులునట్లు గవాక్షమునందుంచి, రోజా యచటనే కావలియుండుట నరసెను. రాత్రులు మంచు కురియునప్పుడును బవలెండ తీవ్రముగా నున్నపుడును రోజా యా తొట్టెని గిటికినుండి తొలగించుచుంటయుఁ గాంచి యందు నల్లకలువయే యున్నదని యాతఁడు నిశ్చయించు కొనియెను.

రోజా గదిలో నున్న కలువను దొంగిలించు టెట్లు? దానిని బిడ్డనువోలె రోజా క్షణమైన నేమఱక కాచు చుండెను. ఆ తొట్టె నెట్లైనఁ జేఁజిక్కించు కొన్నచో మనోరథము సిద్ధించినట్లే. తా నద్దాని దొంగిలించితి నని రోజా చెప్పిన నెవ్వరును నమ్మరు. తాను పుష్పవ్యవసాయ కుఁడుగాఁ బేర్వడినవాఁడు. ఏమియు నెఱుఁగని యా బాలిక మాటఁగాని, దుర్గములో బంధితుఁడై యున్న నిర్భాగ్యుని పల్కులుగాని నమ్మువా రెవరు?

ఇంతలో రోజా మరలఁ దనప్రియునిఁ జూచుట కేగఁ జొచ్చెను. అదను వేచియున్న బాక్ట్సలు సంతసించెను. ఆ పడుచువాం డ్రిరువురు చెఱసాలకడ సరససల్లాపము లాడుకొను వేళలందు బాక్ట్సలు రోజాగది చెంతఁజేరి, తాళమును వక్రీ

క్షించి, రెండు మూఁడు దినములలో నొక మాఱుతాళపు
చెవి సంపాదించెను. తత్సాహాయ్యమున రోజా పడుకగదిలోఁ
బ్రవేశించెను. అప్పటికే యాకులు దొడుగుచున్న కలువ
పెన్నిధానము వలె వాని కచట సాక్షాత్కరించెను.

గోడమీఁదుగాఁ గోర్నీలియసు పెఱటిలోనికి దిగి పాదులు
శోధించినపుడును, గవాక్షమార్గమున గదిలో దూరినపుడును
గల్గిన మనోవేదన నేఁడు రోజాగదిలో దూరినపు డాతనికి జనింప
లేదు. అసూయాపిశాచము వానిని దొంగతనమున గడిదేర్చి,
వాని యంతరాత్మను నశింపఁజేయనోపు !

కలువ నపుడే తస్కరించుకొని యేగఁజూచెను. కాని,
తుద కది నల్లకలువ కానిచో వృథాచౌర్యము కాఁగలదు.
అదియుఁగాక గదికి దాళపుఁజెవి లభించినదికాన నప్పుడే దొంగి
లింపవలసిన యావశ్యకతయు లేదు. పూవు పూచెదుదనుక
నిశ్చింతమై వేచియుండవచ్చును. పూచిన పిమ్మట దొంగిలించి
నచోఁ దనచౌర్యము రోజా యెఱుంగకమున్న, తా నాపూవును
హార్లమునగరమునకుఁ గొంపోయి యధ్యక్షుని చెంతఁ బ్రద
ర్శింపవచ్చును.

దినదినము రోజా ప్రియునిచెంత కరుగు సమయమున
నాతఁడు గదిఁజొచ్చి యచట కలువచెంతనే మహోత్సుకుఁడై
కాలము గడపుచుండెడివాఁడు.

తుదకుఁ గలువ వికసించిన దినమున, రోజా యథా
ప్రకారము కోర్నీలియసుచెంత కరిగి వెనువెంటనే తిరిగివచ్చుట
చాక్సలు గాంచి పూవు వికసించె నని గ్రహించి యా రాత్రియే
తన కార్యము నెఱ్ఱవేర్చుకొన నిశ్చయించి గ్రైఫసును దలమున్గఁ
ద్రావించి వేచియుండెను.

రోజా నల్లగలువను వెంటఁగొని కోర్నీలియసుకడ కేగుట యాతఁ డరసి వెనువెంట నేగి వారి సంభాషణ మంతయు వినెను. రోజా తనగదికి మరలివచ్చి, మరల పదినిముసము లలో నద్దాని వీడి, తలుపు తాళము వైచి యేగుట బాక్ట్సలు కనుంగొనెను. పాప మా ముద్దియ వార్తాహారు నంపుటకై యట్లు వెలుపలి కేగిన తరుణమున బాక్ట్సలు గదిలో దూరి నల్లగలువ నెత్తుకొనిపోయెను.

## ౨౦

ద్విగుణీకృతానందపరవశుఁడైన కోర్నీలియసు, రోజా యేగిన పిమ్మటఁ గూడ నచ్చో నిలిచి యుండెను. తూరుపు దిక్కునఁ దెల్లవారి, కిటికిచువ్వలగుండ నించుకించుకగా వెలుతురు వచ్చుచుండెను. ఆ సమయమున నెవ్వరో తొందరగా మెట్ల నెక్కు చప్పుడు, నెదియో గందరగోళము విన్పించి, యాతఁ డులికిపడి, యద్దెసకు మరలి చూచునంతలో అశ్రుపూర్ణయు, దీనవదనయు నగు రోజా, రొజుచు మెట్లెక్కి వచ్చి "అయ్యో కోర్నీలియసు, ఇఁక నేమున్నది!" యని హస్తతలము లాస్ఫాలించుచు నిల్చెను.

కో: దైవమా, ఏమి మునిగినది!

రో: కోర్నీలియసు! మన కలువ...

కో: మన కలువ!—యే మైనది?

రో: అయ్యో! నాకు నోరాడకున్నది.

కో: చెప్పుము, రోజా! చెప్పుము.

రో: ఎవరో దాని నెత్తుకొని పోయిరి. అయ్యో! అనుచు నాయింతి కాళ్లు నిలువక నేలపై నొరగెను.

కో: అది యెట్లు రోజా! ఎట్లు దొంగిలించిరి?

రో: అయ్యో! మిత్రమా! ఏమి చెప్పుదును. నే నెంత జాగ్రత్తగా నున్నను తుద కీ తీరైనది.

కో: అక్కటా రోజా! దాని నొంటివిడిచి యెట్లేగితివి!

రో: ఒకక్షణమే! క్షణకాలమే వెలుపలి కేగితిని. వార్తాహరుని బిలువ నేగితిని.

కో: ఒక్కక్షణము చాలదా! మందభాగ్యురాలా! నే నెన్నియో విధములఁ జెప్పితిని కదా నీకు; ఆ క్షణ కాలము గదికిఁ దాళము వేయక యెట్లేగితివి?

రో: తాళము వేయుట మఱచి యేగుదునా? లేదు. తాళమువైచియే యేగితిని. తాళపుఁజెవి నా ప్రాణమునువలె వెంటనే కొంపోతిని.

కో: అగుచో, దొంగతన మెట్లు జరిగినది!

రో: ఏమి పాపమో! నా కర్థ మగుటలేదు. జాబును వార్తాహరున కిచ్చి, వెంటనే వాని నంపి తిరిగివచ్చితిని. గది తాళమువైచియే యున్నది. గదిలోని వస్తువు లెచ్చటి వచ్చటనే యున్నవి. కలువ కానరాదు. ఎవరో మాఱుతాళపుఁజెవితో నింతపని చేసిరి.

అంతకంతకు మిక్కుటమగు నార్తిచే నా ముగుద నెమ్మోము చెఱఁగునఁ గప్పికొని, వెక్కి వెక్కి యేడ్చుచుండఁ గోర్నీలియసు జూపడి యట్లే నిలిచి, "దొంగిలించిరా! నా ప్రాణమును; ఇంక నాకు బ్రతుకు తెరు వేది?" యనుకొనుచుండెను.

నేలపైఁ బడియున్న రోజా మోకాళ్లపై నిలిచి, చేతులు దోయిలించి, "కొర్నీలియసు! నన్ను మన్నింపుము, నీవు మన్నింపవేని యీ దీనురాలి కింక బ్రతుకు లేదు" అని వేడఁజొచ్చెను.

కొర్నీలియసు రోజాదుఃఖము గాంచి, క్రోధోన్మత్తుఁడై గవాక్షపుఁజువ్వల నిరుకేల బిగ్గబట్టి యూగించుచు "రోజా! రోజా! మనము వంచితుల మైతిమి. నిజమే, ఈ మహా విపత్తును దాటు యత్నము చేయవలెను గాని దుఃఖించి ఫలము లేదు. లెమ్ము! దొంగ మన మెఱిగినవాఁడేకదా! యెట కేగును! లెమ్ము".

రో: అక్కటా! నే నేమి చేయుదును? ఎందుఁ జొత్తును?

కొ: అధీరవు కాఁదగదు రోజా! ఆ జాకబు నీచుఁడు; మన పెన్నిధానమును, నిదురయు నన్నము మాని మన నోచిన నోములపంటను, మన ప్రేమప్రసవమును హరించి, ప్రతారించుచుండ దుఃఖించుచు మిన్న కుందుమా! ఆ నీచుని వెన్నంటి పట్టుకొనవలదా!

రో: మా తండ్రి కెఱుకపడకుండ నే నేమి చేయఁగలను! జ్ఞానహీన నగు నావలన నే మగును; చెప్పుఁడు. ఈ కార్యము నీవుకూడ సాధింపజాల వేమో? ఇఁక నేనా సాధించునది!

కొ: ఏ మంటివి? నాకుఁగూడ నసాధ్యమా! బేలా! నా కీతలుపు సుంత తెఱచి పిమ్మటఁ జూడు; నేమి చేసెదనో? ప్రపంచమున నేమూల డాగియున్న నా నీచునిఁ బట్టి తెచ్చి 'దాసోహ' మనిపింపక విడుతునా!

రో : అక్కటా! ఈ తలుపులు నే నెట్లు తెఱతును? తాళపుఁ జెవులు మాయయ్య మొలలో నున్నవి కదా!

కో : మీయయ్య! పరమనీచుఁడు! ఆ వృద్ధహాతకుఁడే దీని కంతకు మూలకారణము. వాఁడు, జాకబు తోడి దొంగలు.

రో : అయ్యో! అయ్యో! అట్లు లఱతు వేమి, నీపుణ్య మాయె, నెమ్మదిగా మాటలాడుము.

కో : ఇంక నా కెక్కడి నెమ్మది రోజా! నీవీ ద్వారము తెఱవఁజాల వేని, యీ చువ్వలు విఱిచెదను. నా కడ్డమైన వాని నెల్లఁ బరిమార్తును.

రో : నెచ్చెలీ! శాంతింపుము. శాంతింపుము.

కో : ఇంకను శాంతమా! ఈ చెఱసాల ధ్వంస మొనర్చి, యీ దుర్గమును నేలపా లొనరించక విడుతునా" అని బిగ్గఱగా నఱచుచుఁ దలుపు విఱుగదన్నుచు, "ఆ నీచుఁడు గ్రైఫసును సంహరింతును. వానిరక్తము గనుల జూడక విడువను. వాఁడు నా కలువను మట్టి నట్లు వానిని నా కాల మట్టెదను."

అనుచుండ రోజా యాతని యావేశము గాంచి భయభ్రాంత యగుచు, "నెచ్చెలీ! శాంతింపుము. నేను తాళపుఁ జెవి తెచ్చెదను, శాంతింపుము!" అనుచు నెట్టయెదుటఁ బ్రత్యక్షమైన జనకునిఁ గాంచి య య్యబల, "మాయయ్య!" యనుచు నివ్వెఱపోయెను. కొర్నీలియసు, "రమ్ము! వృద్ధహాతకుఁడా! రమ్ము, ముందు నీ పని బట్టెదను" అని గర్జింపుచుండ గ్రైఫసు వాని మాటలు విన్పించుకొనక, కూతుచేయి పట్టికొని, "ఏమంటివి? నీవు నా తాళపుఁ జెవి తెచ్చెదవుగా!

తెచ్చి ఈ గజదొంగ కిచ్చెదవేమి! ఈ రాక్షసుడు, ఈ యధమ విశ్వద్రోహి నీకు నెచ్చెలియా! వీనితో నీకు రాచకార్యములా! బుద్ధిలేదటే, కుమతీ! నీకు?" అని యదల్ప నా బాల చేతులు మోడ్చి, గజగజలాడుచు నిల్చెను.

కొర్నీలియసు నేటికి దొఱికెఁగదా యను సంతోషమున కూతుపైఁ గ్రోధ మించుక జాఱ, నాతనివంకఁ జూచి, "ఏమి; పశువువాఁడా! కలువపూవులు పెంచుకొను నమాయకుఁడవు గాదా నీవు! పరమశాంతుఁడ వగు పండితకిశోరమవు. పాపము! అన్నము బున్నము నెఱుఁగని యనపరాధివి! నన్నుఁజంపి, నా రక్తము కనులఁజూచెదవుగా! మంచిది. నా కూతు చచ్చినది నీకుఁ దోడిదొంగయా, మంచిది. నీ వృత్తమెల్ల దుర్గాధ్యక్షుని కెఱింగింతును లెమ్ము. ఇంక రెండునా ళ్ళోర్చుకొందువేని మా భూపాలునకు సర్వము నివేదింపఁ బడును. వెనుక హేగునగరమున జరిగిన పొఱపా టీసారి జరుగదులెమ్ము. ఆ శుభముహూర్తము దనుక శాంతింతు వేని తలుపులు నేనే తెఱచెదను. వానిని బ్రద్దలు కొట్టనెంచి రిత్త శ్రమపడకుము. —— ఇఁకఁ దమరో! రోజా దేవీ! నీ నెచ్చెలి నిప్పుడే కనులారఁ జూచుకొనుము. ఎంతలో నెంతదాన వైతివే! చచ్చినదానా! నడువుము —— విద్వత్కి శోరమా! తమ దర్శన మొనర్చుకొందును. అంత దనుక శాంతము వహింపుడు" అని పదరెను.

భయవిహ్వలయై గ్రుక్కుమిక్కనక మెట్లు దిగుచున్న రోజా కేదియో యుపాయము తోఁచి తటాలున రెండు మెట్లెక్కి "భయములేదు, కొర్నీలియసు! నిరాశఁ జెందక నన్ను నమ్మి యుండుము" అని తన పాణిఁ దాన ముద్దిడు

కొని యేగెను. వృద్ధుఁడు చిఱ్ఱు బుస్సులాడుచు వెనువెంటఁ జనియెను.

కిటికి చువ్వల నాని నిల్చియున్న కొర్నీలియసు మఱి కొంత సేపట్లు నిలిచి, పిమ్మటఁ జేతులు తమంతఁ బట్టువదల, తల జిఱ్ఱఁదిఱుగ, కన్నుగుడ్లు వెలికుఱుక, "పోయెనా, నా కలువ!" యని గొణిగికొనుచు నేల వ్రాలెను.

ఈ లోపల మనమిత్రుఁడు బాక్ట్సలు, తనకొఱకు వేచి యున్న యశ్వశకటము నధిరోహించి హార్లెమునగరమునకుఁ బయనమై పోవుచుండెను. బండి యతిరయమున నేగినచో నా కడుపునఁ గలువ కేమి యపాయము వచ్చునో యను భీతిమై 'డెల్ఫు' పురి దనుక నొకరీతి నేగ నిచ్చి, యచట నొక మందసముగొని దానిలో నాల్గుదెసల నాచుఁదీవ లమరించి; యందు దా కలువను బదిలముగా నుంచి, హార్లెము నగరముఁ బ్రవేశించెను.

కార్యము ఫలించె నను నానందము మార్గాయాసము నపనయింప, నాతఁడు వేవేగ నా కలువ నానవాలు తెలియ రాకుండ నింకొక పాత్రలో నాటి, మొదటి పింగాణి పాత్రను శకలము లొనర్చి యేటిలోఁగలిపెను. పిమ్మటఁ దాను నల్ల గలువను పరీక్షార్థమై కొనివచ్చితి నని యధ్యక్షునకు లేఖ వ్రాసి యంపి, యా నగరముననే సత్రమున విడిసియుండెను.

## ౨౧

తన సంతాపమువూట యట్టుండఁ బ్రియుని దుర్భర దుఃఖవేదనచే రోజాకుఁ గడుపు తఱిగికొనిపోఁదొడఁగెను.

ఎన్నివిధములఁ జూచిన నాతని నోదార్చుమార్గము గన్పింపదు, సరికదా! తమ రహస్యము తండ్రి కెఱుఁగవచ్చెఁగాన నింకఁ బ్రియసందర్శనముగూడ లభింపదు. పదేండ్లనుండి గోర్డెలియాను పడిన పాటులెల్ల, జాగరణము లొనర్చుచు నోచిన నోములెల్ల వమ్మైపోవుటకుఁ గతము తానేకదా యని యెంచి, యెట్లయినఁ గలుపను సాధించికాని యాతని మోముఁ జూడఁజాల నని నిశ్చయించుకొనెను. ఎలప్రాయంపుటబలయు, బుద్ధిమతియు, నుచితజ్ఞయుఁ గాన, వెంటనే కార్యనిశ్చయ మొనర్చుకొని, తన చెంత నున్న రొక్కమును గైకొని, పెట్టెలోఁ బదిలముగా నున్న మూడవ కలువమొలకను హృదయసమీపమున దూర్చుకొని, తలుపు బీగము వైచి, యొరులకుఁ గానరాకుండఁ గోట వెడలిపోయెను.

ఆ యూరిలోనున్న గుఱ్ఱపుబండినొక్కదానిని బాక్సెలు పోవుటకుఁ డెక్కి యేగెఁగాన రోజా గుఱ్ఱము నొండు బాడుగకుఁ గైకొనిఁ దాని నధిరోహించి పయనమయ్యెను.

తనకన్న ముందు బయలుదేరి నడచి యేగుచున్న పల్లె పడుచువాని నొక గంటసేపటికిఁ గలిసికొని యాతఁడు తోడై వడివడిగఁ దనవెంట నడచి యేతేర జాముప్రొద్దు పోవుసరికి రోజా డెల్ఫుపురముఁ బ్రవేశించెను.

ఇట కాస్టనుదుర్గమున భోజనవేళకుఁ గూతురు తన గది వీడి రాకుంటఁ గాంచి గ్రిఫను సేవకు నొకని నామెను బిలిచిరమ్మని యంపెను. ఆమె గదిలో లేదనియు, గది తాళము వైచియున్నదనియు వాఁడెఱింగింప, గ్రిఫను కళవళంపడి, దుర్గమంతయు శోధించి యెందు నామెం గానక మండిపడుచుఁ గోర్నెలియసు చెంత కేగి కసిదీర వానిఁ దిట్టి

పోసెను. తా నెన్ని తిట్టినను విన్పించుకొనక కల గాంచు చున్న మానిసివోలె, జడమతిపోల్కిఁ జూపు లప్పగించి మిన్నకున్న బంధితునివలన రోజాజాడ నెఱుఁగఁజాలక, యా వృద్ధుఁ డపుడు తన మిత్రుఁడు జాక బే మయ్యెనో యని విచారించెను. అతఁ డా నాఁటి తెలవారువేళ బండి నెక్కి యెటకో యేగె నని తెలియవచ్చెను. పిమ్మట రోజా యశ్వము నెక్కి పయనమై పోయె నన్న వార్తయు వినవచ్చెను. ఆ యిరువురు న ట్లేకముఖముగా నేగుట విచారించి, తన కూతు జాకబు వెంటఁ దగిలి యేగె నని నిశ్చయించుకొని, 'నిర్భాగ్యు రాలా! ఎంతకుఁ దెగించితివే! కులపాంసనీ, యని నిందించి వదరుచుండెను. రోజా మఱునాఁటి వేకువనే మరలఁ బ్రయా ణము సాగించి, బాక్సలుకంటె నాలుగు గంటలు వెనుకగా వార్లెమునగరమునఁ బ్రవేశించెను. వెంటనే యా చిన్నది యధ్యక్షు డగు హారిసేను మహాశయుని యింటికిఁ జని తద్దర్శ నము వేడెను.

నల్లగలువనుగూర్చి యప్పుడే నివేదనపత్రము వ్రాయు చున్న యధ్యక్షుడు, ప్రథమమున రోజాకు దర్శన మొసఁగ నిరాకరించెనుగాని, పదపడి, నామెయు నల్లకలువనుగూర్చియే తన్నుఁ గాంచ వచ్చిన దని యెఱింగి, సత్వర మెదురేగి సాద రముగ నామెను లోనికిఁ దోడితెచ్చెను. నల్లకలువ యన న య్యనఘునకుఁ గల యభిమాన మట్టిదికాన పూలరాణి యగు నల్లకలువ యంపిన రాయబారి యగు రోజా కుచితగౌరవము లభించుట వింత కాదు. కలువతూడువలె సన్న నగు శరీర మును, కలువయాకులవలె నిరుదెస గెడవ్రాలు కరద్వయమును, వాని మధ్య కలువతోడిమనా నొప్పు కంఠమును, మందసమీ

రముచే నల్లన నూగియాడు కలువపూవునా నిరంతరము గదలి యాడు శిరమును గల యధ్యక్షునిఁ గాంచినఁ గలువయే యాతనిరూపుఁ దాల్చె నని తోఁచును.

రోజా కుచితసత్కార మొనర్చినపిమ్మట నధ్యక్షు డామె వచ్చిన కార్యమునుగూర్చి యడుగ, నామె నల్లగలువనుగూర్చియే మాటలాడవచ్చితి నని తెలిపెను. అధ్యక్షుడు సగౌరవముగ మందహాస మొనర్చి "నల్లగలువకు సేమమే కదా ?" యని ప్రశ్నించెను.

రో : మహాశయా! నల్లగలువసేమ మెఱిఁగించుభాగ్యము నకు ఈ యభాగిని నోచలేదు.

అ : అది యెట్లు ! దాని కేమియు నాపద రాలేదుకదా ?

రో : ఆర్యా! పెద్దయాపదయే వచ్చినది. దానికన్న ముందు నాకు వచ్చినది.

అ : ఏమి ?

రో : నా కలువ యపహృత మైనది.

అ : అపహృత మైనదా ! నల్లకలువయేనా ?

రో : చిత్తము.

అ : దొంగ నెఱుఁగుదువా నీవు !

రో : నా కొకరిపై ననుమాన మున్నది; కాని యింకను నిశ్చయముగాఁ జెప్పఁజాలను.

అ : నీ కలువను నీవు గుఱుతింపఁగలవేని దొంగ చేరువనే యున్నాఁడు. రెండుగంటలకుఁబూర్వమే నే నా కలువను జూచితిని.

రో : (ససంభ్రమయై) మీరు చూచితిరా ! యెచ్చట ?

అ : ఎచ్చటఁ జూతును ? నీ యజమానిచెంతనే.

రో: నా యజమానిచెంతనా!

అ: అగును. ఐజాకు బాక్ట్సలు మహాశయుని పరిచారికవు కావా నీవు?

రో: నేనా? అధ్యక్షా! న న్నెవ రని యెంచుచున్నారు?

అ: నే నెవ్వరని నీ వెంచుచున్నావో ముందు వచింపుము.

రో: హార్లమునగరపాలకులు, పుష్పప్రియపరిషదధ్యక్షులు నగు హారిసేన మహాశయులుగా మి మ్మెంచుచున్నాను.

అ: మంచిది. ఇంతకుమున్ను నీవు నాతో నే మని చెప్పితివి?

రో: నా నల్లగలువ యపహరింపఁబడిన దని చెప్పితిని.

అ: ఆ కలువ బాక్ట్సలుదేకాని నీది కాదు. చిన్నదానా! నీ మాటలచే మోసపోవువాఁడను గాను. అపహృతమైన కలువ నీది కాదు. బాక్ట్సలుది.

రో: ఆర్యా! మీ మాటలు వింతగా నున్నవి. ఆ బాక్ట్సలెవరో నే నింతకుము న్నెఱుఁగను. మీ రిపుడు సెప్పగా వినుచున్నాను. నన్ను నమ్ముఁడు.

అ: ఎట్లు? బాక్ట్సలును నీ వెఱుఁగనే యెఱుఁగవు! నీ చెంతఁగూడ నొక నల్లకలువ యుండెడిది! మంచిది. తరువాత!

రో: నల్లకలువ నాదే కాని యన్యులది కాదు. అన్యుల కడ నున్నచో నది దొంగసొత్తు కావలెను. లేదా, మా కలువవలె నచ్చముగ నల్లనై యుండకపోవలెను.

అ: బేలా! అచ్చఁపు నల్లగలువ బాక్ట్సలుచెంత నే గాంచితిని. మా సంఘము మా పూవును బరీక్షించి బాక్ట్సలును సత్కరించును.

రో : అయ్యో! ఆర్యా! ఎచట నున్నాఁడీ బాక్సలు; నల్ల కలువ తనది యని బొంకుచున్న యా—

అ : బొంకుట యేమి? యాతనిదే కలువ.

రో : ఆర్యా! ఆర్యా! యా బాక్స లెట్టివాఁడో వచింపుఁడు. పలుచనివాఁడేనా యాతఁడు?

అ : అవును.

రో : బట్టతలకాదా యాతనిది?

అ : నిజము.

రో : గుంటకన్నులవాఁడే కాదా?

అ : అవును.

రో : ఇంచుక వంగియున్నట్లుండును. దొడ్డికాళ్లవాఁడు కాదా, యాతఁడు? ఇంచుక చిరాకుగా కాన్పించును కాదా?

అ : అచ్చముగ నాతనిరూపే నీవు వర్ణించినది.

రో : ఆర్యా! చెప్పుఁడు, చెప్పుఁడు, ఆ కలువ పింగాణి పాత్రమునఁగాదా యున్నదీ?

అ : ఏమో? చెప్పఁజాలను. నేను పూవును జూచితిని కాని పాత్రను బరీక్షింపలేదు.

రో : ఆర్యా! ఇంకను సంశయమా? నాదియే యా కలువ. నా కలువ నా కిప్పింపుఁడు; మిమ్ము వేఁడికొందును.

అ : చిన్నదానా! నీవు నన్ను వేఁడిన ఫలములేదు. బాక్స లీయూరి సత్రమున నున్నాఁడు. వాని చెంత కేగి యడుగుము; మీ వాదము దీర్చుట నా పనికాదు. నా కంత శక్తియు లేదు. నల్లగలువ యునికి నిక్కమని మా

సంఘమునకు నివేదించి, దానిని బెంచినవానికి లక్ష వరహా లిప్పించుటయే నా పని.

రో: అక్కటా! నే నెంచుఁ జొత్తును? ఏమి చేయుదును?

అ: చిన్నదానా! నా యుపదేశ మించుక వినుము. నీ కింకను బసితనము. ఇప్పటికైన నీవు బాగుపడవచ్చునని నా యాశ. నీ విట్టొరక కానిపనుల జొత్తువేని, యిచట న్యాయవిచారణకర్త లున్నారు. కారాగృహ మున్నది. అదియును గాక నల్లగలువ యాభిజాత్య రక్షణమున మా కభిమానము మెండు. కావున లేనిపోని జోక్యములు పెట్టుకొనక నీ యింటి కేగుము. నా మాట వినుము.

అని రోజా నంపి యాతఁడు నివేదిక వ్రాయఁదొడఁగెను.

## ౨౨

కలువదొంగ సత్రమున నున్నాఁడని విన్నది కావున, రోజా యచ్చటికే బయనమై పోవుచుఁ ద్రోవలోఁ దన యనుచరునకుఁ గలువవృత్తాంత మంతయు విన్పించి, యాదొంగతోఁ బోరాడుపని వట్టినచోఁ గలువకు మాత్ర మపాయము రాకుండ గార్యము సాధింపవలయును జుమీ యని బోధించి, నగరచతుష్పథమును జేరునప్పటి కా యువిద కొక యాలోచనము దట్టి నిర్విణ్ణయై నిలిచెను.

"దైవమా! నే నెంత పొరపడితిని! నా యవివేకము వలనఁ గలువకు, నాకుఁ, గోర్కిలియసుకుఁగూడఁ జేటు గొని తెచ్చితినిగదా! బుద్ధిహీనను! నా కలువ యపహృత యయ్యె

నని నేను ముందుగ వెల్లడించి మోసపోతిని. ఇంక వీరెల్ల రేకమై కార్యవిఘాత మొనర్చినచో నే నేమి ప్రతి సేయఁ గలను? లోకజ్ఞు లగు నీ పురుషులతో నే నెట్లు వేగజాలుదును? మందభాగ్యను, నా యవస్థ కేమిగాని, కలువకుఁ గోర్కి లిడుసుకు నింక నేమి గతి?" అని తన్నుఁ దా నిందించికొని, మరల నించుక యాలోచించి, "ఇంతకు, నీ బాక్సనలు, నే నెఱిఁగిన జాకబు కాఁడేమో! ఈతఁ డెవ్వఁడో, నిజముగా నల్ల గలువను సాధించెనేమో? జాకబు నా కలువను హరించి యింకొకని కిచ్చెనేమో? ఆ పక్షమున నేను కలువను గుర్తించియుఁ బ్రయోజన ముండదు. కాక, యీ బాక్సనలే, జాకబు హతకుఁడై మే మిరువురముఁ దగవులాడుచుఁ గూడుచున్నచో నీలోపలఁ గలువ కడతేరునేమో?" యని విచారించుచుండెను.

ఇంతలో వీథిలో నేదియో సందడి బయలుదేరెను. ప్రజలు గుమిగూడి యేదియో వింతగాఁ జెప్పుకొనసాగిరి. అన్యమనస్క యగు రోజా కా సందడి యేమియు విన్పింపలేదు. ఆమె తన యనుచరునితో, "మనము సత్రమున కేగ నక్కఱలేదు. మరల వధ్యశ్రుని యింటికే వెళ్ళుదము" అని వచించి, వెనుకకు మరలి చనుచుండెను. త్రోవ పొడవునఁ బ్రజలు, నల్లగలువనుగూర్చియు, లక్ష వరహాల బహుమానమునుగూర్చియు, వింతవింతగా వర్ణించి చెప్పుకొనుచుండిరి. ఆ మాట లెవ్వియు విన్పించుకొనక రోజా తిన్నగా నధ్యక్షుని యింటి కేగి, మరల నల్లగలువపేరు చెప్పఁగనే యధ్యక్షుని దర్శనము లభించెను.

నివేదికాధచనమునకు మరల నంతరాయము వచ్చెనే

యని విసిగికొనియు, హరిసేన మహాశయుఁడు నల్లగలువ మాహాత్మ్యముకతన, దర్శనము నిరాకరింపఁజాలకపోయెను. కాని రోజా యెదుటి కేతెంచినతోడనే యాతనికిఁ గోపము జనించి, యా వెఱ్ఱిపిల్లను వెలుపలికి వెడలనంప నెంచెను.

రోజా చేతులు బిసికికొనుచు, దీనాస్యయై, తన సత్యావాదిత్వ మధ్యక్షుని మనమునకు నచ్చునట్లు, "ఆర్యా! నన్ను వెడలనంపక నా మనవి యాలింపుఁడు. మీకుఁ బుణ్య ముండును. నాకు న్యాయ మొనర్పఁజాలకపోయిన మానేఁ గాని, యేనాటికైన మీరు యథార్థ మెఱింగి పశ్చాత్తప్తులు కాకుండుటకైనఁ బనికివచ్చును. నా విన్నప మవధరింపుఁ" డని వేఁడెను.

అతఁ డా ముగుదను ద్రోసిపుచ్చఁజాలక, "నీ సోదరుంతియు వినుచుఁ గూర్చున్నచో నివేదిక – నల్లగలువను గూర్చిన యీ నివేదిక యెట్లు?" అని విసిగికొనెను.

రో: ఆర్యా! మీ నివేదికకొఱకే నా మనవి వినుఁ డని వేఁడెదను. మీరు సత్యమునే నివేదింప నెంతురేని నన్ను ద్రోసిపుచ్చకుఁడు. నా మాట లాలకింపకున్న మీ నివేదిక యసత్యపుఁబుట్టయై, పాల్లయిపోవును. నా విన్నప మవధరించి యా బాక్సులు నిచ్చటికి రప్పింపుఁడు. ఆతఁడు నా కలువ నపహరించిన జేక బనియే నాకు నమ్మకము. ఆతఁ డా జేకబు కాఁడేని వాని కలువను వానికి వదలివైచి మారుమాటాడక నా త్రోవ నే నేగెద నని ప్రమాణమొనర్చుచున్నాను.

అ: (నవ్వి) నీవు చెప్పెడిది లెస్సగనే యున్నదికాని నీ

వాతని గురుతించితివే యనుము. అంతమాత్రమున నేమి తేలును ?

రో: ఆర్యా! మీ రట్లు వచించిన నే నేమి ప్రతి సెప్ప నేర్తును ? మీ రిందుమది నొక్కపరి యాలోచింపుడు. ఇందలి కల్ల నిజములు విచారింపక యీ బహుమానము మోసగానికే యిచ్చుట తటస్థించి తత్సత్యము మీ రేనాటికైన గ్రహించితిరేని నప్పుడు మీ మనస్సున కెట్లుండునో చింతింపుడు.

ఈ మాటలచే నధ్యక్షునిమన స్సొకింత కరఁగెను. కాని యాతఁ డేమీ యనబోవునంతలో వీధిగుమ్మముచెంత నెద్దియో సద్దు విన్పించెను. ఆతఁ డంతట రోజా నచ్చటనే విడిచి తత్తరపడుచు, వెలుపలిగదిలోని కేగి, "ఇది నిజమేమైయుండునా?" యనుకొనుచుఁ బాఱఁజూడ, జరీకమ్ములు వైచిన మొకమలంగీ ధరించిన పడుచువాఁ డొకఁ డసంఖ్యాజనము తన్ను వెంబడింప వీధి నేతెంచుచుండుట గన్గొనెను. అశ్వదళాధిపతి యొకఁడు, నావికాదళాధిపతి యొకఁడు నాతని నిరుపార్శ్వములఁ గొల్చి వచ్చుచుండిరి. అధ్యక్షుఁ డా పడుచువానిం గాంచి, భయసంభ్రమములు మోమునఁ దోప నెదురేగి, "యేమి నా భాగ్యము! ప్రభువువారు నా గృహము పావన మొనర్చుచున్నారు" అని బద్ధాంజలియై లోనికిఁ దోడితెచ్చెను.

విలియముప్రభుఁ డలంతినగవు నెమ్మోము నందగింప, "హారిసేనమహాశయా! యిందు వింత యేమియు లేదు. హాలండుదేశీయుఁడ నగు నాకును మీ యందఱువలెనే పూవు లన్నఁ బ్రీతి. అందును గలువపూవుపై నా కభిమానము మిక్కుటము. మీ నగరమున నల్లగలువ యున్నదని

నేను 'లేడను' పురమున విని, యచ్చుదుపడి, పుష్పాభిమాని సంఘాధ్యక్షుడ వగు నీవలన సంశయముఁ దీర్చుకొనుతలంపున నరుదెంచితిని" అని వెలుపలిగదిలోనికి వచ్చి యచ్చట నాసీను డయ్యెను.

అ: ఏలినవారి యభిమానము కల్మి మా సంఘము చరితార్థ మైనది.

విలియము: నల్లగలువ యిచ్చట నున్న వార్త నిజమేనా? దాని నెవరు పెంచిరి?. తద్వృత్తాంత మేమి?

అ: చిత్తము. డార్టునగరవాసి ఐజాకు బాక్స్టలను పుష్పవ్యవసాయకుఁ డొకఁడు నల్లగలువను పెంచి పరీక్షార్థము నేఁడే యిటకుఁ దెచ్చినాఁడు. అతఁడు సత్రమున విడిసియున్నాఁడు. పూ వాతనిచెంతనే యున్నది. సెలవైన వాని నిటకు రప్పించెదను.

విలి: మంచిది. వానినిఁ బిలువనంపుఁడు.

అ: చిత్తము; కాని యీ పూవునుగూర్చి యించుక వివాద మేర్పడినది.

విలి: ఏమని యీ వివాదము?

అ: ఆ పూవు లక్ష వరహాల విలువ గలది యని ప్రభువులకు విశదమై యుండును. కొందఱు మోసగాం డ్రప్పుడే యీ పూవునుగూర్చి తగవుపెట్టుచున్నారు.

విలి: మహాశయా! అట్టు లగుచో నది మహాపరాధమే యగును. మోసగాండ్ర యపరాధమునకు మీచెంత తార్కాణ లున్నవా?

అ: తార్కాణలు లేవుకాని ఆ యపరాధిని —

విలి: అపరాధినియా?

అ: చిత్తము. పూవునుగూర్చి తగవులాడుచున్న చిన్నది యిచటనే యున్నది. ఈ లక్ష వరహాలపై నావ వాదమి యా బాలిక బొంకుచున్న దని నా కనుమా నము.

విలి: ఆ పడుచు వాద మీా పూవు తనది యనియా? అందుల కామెచెంత సిదర్శనము లున్నవా?

అ: చిత్తము. తమరు దయసేయునప్పటికి నే నా విషయ మునసే యామెను విచారించుచుంటిని. సెలవైన ప్రభు వుల సమక్షముననే—

విలి: అవశ్యము. మనదేశమున నే నున్నతన్యాయాధి పతినికదా! నాయెదుటనే యా బాలికను ప్రశ్నింపుఁడు. నే నా తగవు దీర్చెదను.

అ: మహాప్రసాదము.

అని యధ్యక్షుఁడు లోపలిగదిలోనికి దారి చూప విలి యమువెంట నేగుచు, నాతనితో "న న్నారక 'మీారు' అని మాత్రము సంబోధింపుడు" అని చెప్పెను.

ఆ గదిలో నొంటిమై గవాక్షముచెంత నిలిచి గృహారా మముం దిలకించుచున్న రోజాను, ఆమె ధరించిన మెట్టపరికిణీ, బుటేదారిపని కుళాయి, విలియము చూచి, "క్రీడులాండు బాలికవలె నున్నదే!" యనుకొనియెను.

వారి చప్పుడు విని రోజా తిరిగిచూడఁగనే విలియ మించుక వెలుఁగు తక్కువగనున్న మూల నాసీనుఁడై యచట నున్న గ్రంథమును గైకొని పుటలు దిరుగవేయుచు, నధ్యక్షు నకు, విచారింపు మని కనుసన్న చేసెను.

ప్రభుసమక్షమున విచారించు గౌరవము దనకు లభించి

నందుల కధ్యక్షుఁ డుపక్రమించుచు రోజాతో, "చిన్నదానా! యిందలి సత్యము వచింతు ననికదా చెప్పితివి. ఇదే! మా సంఘసభ్యులలో నొకరు సమయమున కేతెంచిరి. నీవు సెప్పెడి దేమో చెప్పుము. వారును వినఁచుందురు" అనెను.

రో: ఆర్యా! సత్యము విన్నవించితిఁగదా! ఇంక నేను చెప్పునది యేమున్నది? శాక్టన్లు, నాతని పూవుతో నాయెదుటికి రప్పింపుఁడు. ఆపూవు నాయది కాదేని, యా మాట వచించి, మిన్నక పోవుదును. పూవు నాది యగునేని, దాని నా కిప్పింపుఁడు. మీ రిప్పింపకున్న, నే నింతటితో విడువను. నా నిదర్శనములతో విలియము ప్రభుని సమక్షమునకైన నేగి న్యాయముఁ బడయుదనకా విడుచుదానఁగాను.

అ: అగుచో, నీ చెంత నిదర్శనములు గల వన్నమాట!

రో: ధర్మరక్షకుఁడగు నీశ్వరుని యనుగ్రహ మున్నచో నిదర్శనములు లభింపకపోవునా? యార్యా!

ఆమాటలు విని విలియము, నధ్యక్షుఁడు సాభిప్రాయముగా నొండొరులఁ జూచుకొనిరి. "ఈ చిన్నదాని కంఠ స్వరము పరిచితమువలె నున్నది; యెచట వినియుందునా" యని విలియ మాలోచించుచుండెను.

అ: అమ్మాయీ! నల్లకలువ నీదే యనుటకు ముఖ్య నిదర్శన మేమో విన్పింపుము.

రో: నా పడుకగదిలో స్వయముగ నాటి పెంచినదే నిదర్శనము.

అ: ఎచ్చట నున్నది నీ పడుకగది?

రో: కాస్టను దుర్గమున; నేను కారాగృహపాలుఁడగు గ్రైఫను తనూజను.

'అటులఁ జెప్పుము! నా కిప్పుడు జ్ఞప్తికి వచ్చినది' అన్నటుల విలియ మామె దెస నొక్కపరి గాంచి యూరకుండెను.

అ: పూవు లన్న నీకుఁ బ్రీతికాఁబోలు.

రో: చిత్తము.

అ: పుష్పజాతులఁ బెంచుటలో నీకు మంచి యనుభవము కలదన్న మాట?

రోజా యించుక సంశయించి, యంతలో సమాధానపడి, "ఆర్యా! తమబోంట్లు రహస్యభంగ మొనర్ప రని నమ్మి వచింపుచున్నాను" అనుచు వారివంకఁ జూచెను; ఆమె వాక్కునను మోమునను బ్రేలు సత్యనిష్ఠ కనుపడి వారిరువు రొక్కపరి చూపులఁ గలయఁబలికికొని, "భయము విడిచి చెప్పవచ్చును" అన్నట్లు తలలూచిరి.

రో: నిజమునకుఁ బుష్పవ్యవసాయమున నా కించుకయు ననుభవములేదు. నేను బాలికాసామాన్యను. మూఁడు నెలల క్రిందటివఱకు నేను నిరక్షర యగు మూఢమతిని. ఇంక దాపరిక మేల? నల్లకలువను సాధించినది నేను కాదు.

అ: మఱి యెవరు సాధించిరి?

రో: కాస్టనుదుర్గమున చెఱలో నున్న యొక మందభాగ్యుఁడు సాధించెను.

విలి: కాస్టను దుర్గమున చెఱలోనా! అచట రాజ

ద్రోహులుతక్క నితరులు లేరు. కావున నీతఁడుకూడ నట్టివాడే కానోపును.

అని మరల గ్రంథమునుజూచుకొనఁదొడగెను. రోజాయుఁ బరిచిత మైనట్లున్న యాతని కంఠధ్వని కించుక చకితయై పలుకులు తొట్రిల్ల "చిత్రము, ఆతఁడు రాజద్రోహియే"యనెను.

ప్రభుసమక్షమున రోజా వచించిన యీ మాటలచే నేమి మునుఁగ నున్నదో యని యధ్యక్షుఁడు భీతిల్లుచు మిన్నకుండెను. విలియ మది యెఱింగి, 'కానిండు' అనెను.

తన్ను విచారించుచున్నది యధ్యక్షుఁడే కదా యను తలఁపున రోజా యాతనివంకనే దృష్టినిలిపి, "ఆర్యా! నా మాటలచేఁ జేటు దెచ్చుకొంటినా యేమి?" యని భీతిల్లుచు నడిగెను.

అ: కాదా మఱి? బద్ధులగు రాజద్రోహులకు కాస్టను దుర్గమున సరియైన కావలి లేదని స్పష్ట మగుట లేదా!

రో: అక్కటా!

అ: కారాగృహపాలుని కూఁతువైన హేతువున నీవు నిరభ్యంతరముగా రాజద్రోహులతో సంబంధము గల్పించుకొని పుష్పవ్యవసాయమునఁ దొడ్పడితి వని నీ మాటలచేఁ దేలుచున్నది.

రో: (భయవిహ్వలయై, అల్లన) నిజము. ఆర్యా! నిజము. నేను ప్రతిదిన మాతనితో మాటాడుచుంటిని.

అ: మందభాగ్యరాలా!

అధ్యక్షుని మొగమునఁ దోచు వెల్లదనమును, రోజా భయమును విలియము వీక్షించి, "పుష్పాభిమానిసంఘ మీవిషయమున జోక్యము పెట్టుకొనఁ బనిలేదు. నల్లకలు

వనుగూర్చి విచారింతురే కాని, రాజతంత్రములతో వారికి నిమిత్తములేదు. చిన్నదానా! నీవు చెప్పెడిదేమో కానిమ్ము" అనెను.

ఈమాటలచే భయముదీఱి రోజా గడిచిన మూఁడునెలల వృత్తాంతమును విన్పించెను. బంధితుని పుష్పప్రియత్వము, గ్రిఫసు కఱకుదనము, మొదటిమొలక నాలిఁడు త్రొక్కి-వేయుటయు, బంధితుని దుఃఖమును, తమ వియోగమునఁ గలువవాత్ర లెఱుంగక యాతఁడున్న పానములు వర్జించుటయు, రెండవమొలకను బెంచుటకై పడినకష్టము, జేకబు కౌటిల్యము మున్నగు వాని నెల్ల బూసగ్రుచ్చినటుల విన్పించెను. ఆ ముద్దరాలి నోట సత్యముద్రితములై వెడలు నా మాటలచే నధ్యక్షుని హృదయము కరఁగినది. కాని విలియము ముఖమున మాత్ర మెట్టి వికారమును కాన్పించలేదు. ఆతఁ డట్లు నిర్వికారుఁడై "గ్రిఫసు కాస్టను దుర్గమునఁ బ్రవేశించి నాల్గుమాసములైన గాలేదుకదా! నీకీ బంధితునితో నింత పరిచయ మెట్లులభించినది? ఆతని నంతకుఁబూర్వ మెఱింగియున్న కారణముననే నీవు నీతండ్రి యుద్యోగమున మార్పు సంపాదించి, యీ ఖైదీకోసము కాస్టనుదుర్గము చేరియుందువు" అనెను.

రోజా సిగ్గుపడి యూరకుండెను. విలియము మరల "దీనికి నీ వేమి చెప్పెదువు?" అని రెట్టించెను.

అంత నా బాలిక బొటనవ్రేలు నేల రాయుచుఁ దల వాలిచి, "హేగునగరముననే నా కా ఖైదీతోఁ బరిచయము కల్గినది" యనియెను.

విలియము నవ్వుచు "నదృష్టవంతుఁడా ఖైదీ" యని యెను.

ఇంతలో బ్రాక్ట్సలుకొంఱు కేగినయాతఁ డరుదెంచి యాతనిరాక విన్నవించెను.

## ౨౩

బ్రాక్ట్సలు హారిసేనుగదిలో బల్లమీఁద కలువనుంచెను. విలియ మంతట నాగదిలోని కరిగి నల్లగలువనుగాంచి మెచ్చి కొనుచు రోజాయున్న గదిలోనికి మరలి వచ్చి, యా చీకటి మూలనే యాసీనుఁడయ్యెను. రోజా యంతట బ్రాక్ట్సలు మాట లాలకించి "యాతఁడే! యాతఁడే" యని వణకుచుఁ బల్కెను.

నల్లగలువను తలుపుసందునుండి చూడు మని విలియము సన్నచేయ రోజా యల్లన నేగి, యద్దానిఁ గనుఁగొని, "నా కలువయే, యది నా కలువయే! అయ్యో! కొర్నీలియసు!" అనుచుఁ గంట నీరిడుచు నిల్చెను.

విలియ మంతట తలుపుకడ కేగి, వెలుతురులో నిల్చి "బ్రాక్ట్సలు మహాశయా! ఇట్లు దయసేయుఁ" డని పిలిచెను. ఆతఁడు విలియము చెంత కేతెంచి, వెలవెలఁబోవుచు, "నేలిన వారు!" అనుచు నొదిగెను. అంతకుమున్న సంశయగ్రస్తయై యున్న రోజాకూడ నపుడు విలియమును గురుతించి గజగజ లాడుచు 'ఏలినవారే!' యనెను. ఆ యువతి పల్కు విని బ్రాక్ట్స లులికిపడి యామెవైపునకుఁ దిరిగి, గురుతించి యొక్క పరి నిలువున కంపించిపోయెను. విలియ మాతని కంపము గాంచి, "ఓహో! యీతఁడు కలవరపడుచున్నాఁడే!" యను

కొనియెను. ఇంతలో బాక్ట్సలు నిలువఁ ద్రొక్కుకొనియెను. విలియ మంతట 'బాక్ట్సలు మహాశయా! అద్భుతమగు నీ నల్లగలువను సాధించితిరా మీరు!' అన నాతఁ డెల్లుఁ గించుక తొట్రిల్ల "చిత్రము చిత్ర" మనియెను.

ప్రభుసాన్నిధ్యముకూడ నాతని కంపమునకుఁ గారణము కాఁదగు నని యెంచి, విలియము మరల "మఱి యీ బాలిక తానుగూడ నల్లగలువను సాధించినట్లు వచించుచున్నదే" యనెను.

ఆ మాటలకు బాక్ట్స లనాదరసూచకముగ నించుక నవ్వియిన్నకుండెను. ఆతని వైఖరి నతిసూక్ష్మముగఁ బరిశీలించుచున్న విలియము, "నీ వీ బాలిక నెఱుఁగవు కాఁబోలు" అనెను.

బా: చిత్రము. నే నామె నెఱుఁగను.

విలి: చిన్నదానా! నీ వీ బాక్ట్సలు నెఱుఁగుదువా?

రో: నేను బాక్ట్సలు నెఱుఁగను. కాని జేకబు నెఱుంగుదును.

బా: అనగా?

రో: అనగా నర్థ మిది. ఈ బాక్ట్సలు కాస్టనుకోటలో జేకబు పేరఁ బఱఁగుచుండెను.

విలి: బాక్ట్సలు! ఆ మాటకు నీ వేమి చెప్పెదువు?

బా: చిత్రము. ఈ బాలిక చెప్పునది యసత్య మని నా మనవి.

విలి: నీవు కాస్టనుకోట కెన్నడు నేగియుండ లేదా?

హృదయశోధకమగు నా ప్రభుని గంభీరదృష్టి కోడి, బాక్ట్స లసత్యమాడనేరక, యించుక సంశయించుచు,

"చిత్తము. నేను కాష్టనుకోట కేగినమాట నిజమే కాని, కలువను దొంగిలించిన దసత్యము" అనెను.

రో: అన్న! గుమ్మడికాయలదొంగా! నా శయ్యామందిరమునుండికాదా నీ విద్దాని దొంగిలించితివి?

బా: అసత్యము.

రో: మంచిది. ఇటు వినుము. కలువ నాటుటకై నేను మడిని చదునుచేయఁ దోటలోని కేగినపుడు నీవు నా వెన్నంటివచ్చి, చెట్లచాటున నిల్చి చూచినది యసత్యమేనా! పిమ్మట నొకనాఁడు నేను కలువను నాటినట్లు నటించి యింటిలోని కేగినపిమ్మట, నీ వా పాదులోని మట్టినెల్ల బాఁఱఁజిమ్మి, కలువ నందుగానక భగ్నాశుఁడ వైనమాటయు నసత్యమేనా? ఏమి? అసత్యమేనా?

బాక్టనలీప్రశ్నములకు సమాధాన మొసఁగుట యనావశ్యక మని యెంచిన ట్లనాదర మొనర్చి ప్రభునివంకకుఁ దిరిగి, "ఏలినవారు చిత్తగింపుడు. నే నిప్పటి కిరువదేండ్లనుండి పుష్పవ్యవసాయమునఁ గృషియొనర్చుచున్నవాఁడను. ఒక క్రొత్తజాతిపూవును సాధించి పోర్చుగల్లుప్రభున్, కంకిత మొసఁగినవాఁడను. ఏలినవారు కోరితిరిగాన యిందలి యథార్థమును విన్నవించెదను. చిత్తగింపుడు. నేను నల్లగల్వను సాధించిన వార్త నీ బాలిక యెటింగి కాష్టనుకోటలోఁ జెఱలో నున్న తన ప్రియునితోఁ గూడి తంత్రము బన్ని నా కలువ నపహరించి లక్షవరహాలను గడింపఁజూచుచున్నది. ఏలినవారు నా కిందు న్యాయముఁ బ్రసాదింపుఁ డని వేఁడుచున్నాను."

రో: (కోపవివశయై) ఎంత మోసగాఁడవు! ఏమి కథ యల్లితివి!

విలి: (రోజాతో) మాటాడకుము. (బాక్ట్సలుతో) ఈ మగువప్రియుఁడచట చెఱలో నున్నాఁడంటివే, యాతని పేరు?

రోజా భయకంపిత యగుచు, గోర్నిలియసు కింకఁ బ్రాణహాని సిద్ధమని యెంచి, మూర్తీఁగైకొన్న దుఃఖమో యన నిల్చియుండెను. ఈ ప్రశ్న మడిగినంతనే, బాక్ట్సలు సంతసమున రెండింతలై, "ఆ బంధితుఁడు రాజద్రోహి, యింతకుమున్నాతని శిరచ్ఛేదమునకుఁగూడ నాజ్ఞ యొసంగిరి" అనెను.

విలి: ఆతని పేరో?

రోజా వంతపెల్లున మోమున కరచేతు లడ్డము చేసికొని యేడ్చుచుండెను.

బా: ఆతని పేరు కొర్నిలియసు వానుబారలు. నీచుఁడగు గోర్నిలియసు డివిటునకు ధర్మపుత్రుఁడు.

డివిటుపేరు విన్నంతనే, విలియ మొక్కపరి యులికిపడెను. నిర్వికార మగు నాతనిమోమున నించుక వెల్లబాటు జనించెను. అతఁడంతట రోజాచెంత కరిగి వ్రేలితో సన్న యొనర్ప నా ముగుద మంత్రముగ్ధ మగు చిలువకన్నెనా, మోమునకు జేతు లడ్డము తీసెను.

విలియ మంతట "చిన్నదానా! యీ కొర్నిలియసును వెన్నంటియేగుటకే కదా నీ తండ్రిని కాప్తను కోటకు మార్చుమని మున్ను నన్ను వేఁడవచ్చితివి?" యనియెను.

రోజా తలవాంచి, మెలుఁగు కుత్తుకఁ దగుల "నిజము ప్రభూ!" యనియెను.

విలియము మరల బాక్ట్సలుతో "తరువాత తరువాత"

ననెను. బార్ట్సనులు చెప్పఁదొడగెను. "ప్రభూ! ఇంక నేఁ జెప్పఁదగినది లేదు, కాని యీ బాలిక సిగ్గున మ్రగ్గిపోవు నేమో యని యొక్క విషయము మాత్రము చెప్పక విడిచితిని. నేను కాన్టనుకోటకు దొలుత నేదియో కార్యార్థినై యేగితిని. నా కచట గ్రిఫను పరిచితుఁడాయెను. అంతట నే నీ బాలికను వలచి నీ కూతు నా కొసఁగి పెండ్లి సేయు మని యాతని నడిగితిని. నేను ధనికుఁడను కా ననియు, నేను సాధించిన నల్లగలువవలన లక్షవరహాలు లభించు ననియుఁ దెలిపి యీ నల్లగలువను చూపి తార్కాణించితిని. ఈ బాలిక యంతటఁ దనప్రియునిఁగూడి యీ పన్నాగము బన్నెను. ఆతఁడును వెనుక నీ పుష్పవ్యవసాయమున నించుక ప్రవేలుపెట్టినవాఁడే. రాజకీయములగు దుస్తంత్రములను మాటుకొనుట కాతఁ డీ వృత్తి నటించెడివాఁడు. అట్టి యాతని దురుపదేశముకతన, నీ బాలిక కృతఘ్నయై, యీ పూవు వికసించుదినమున దీని నపహరించి తన గదిలో దాచెను. వెంటనే తాను నల్లగలువను సాధించితి నని యీ నగరమునకు వర్తమానముకూడ నంపెను. నే నెట్లో మరల నా కలువను సంపాదించి తెచ్చితిని. కలువ యీ బాలిక చెంతనున్న సమయమున 'ఇదుగో నేను నల్లకలువను సాధించితి' నని మిత్రులకుఁ జూపెట్టియుండవచ్చును. ఒకవేళ నట్టివారల నిప్పు డీమె సాక్షులుగాఁ బేర్కొనునో యని ముందుగనే విన్నవించితిని."

రోజా కనుల నీరోడ వెక్కి వెక్కి యేడ్చుచు, "దైవమా! యెన్ని యసత్యములు గల్పించుచున్నాఁడు" అనుచు విలియము పాదములచెంత వ్రాలెను. నిజమునకు రోజా దోషి

యని నమ్మియు విలియమామె పెనువంత కించుక జాలిచెంది, "చిన్నదానా! నీవు చెడ్డయపరాధ మొనర్చితివి. నీ కీ దుర్బోధసల్పిన నీ ప్రియునకుఁ దగిన శాస్తి యొనర్తుము. నీ తేఁట్రాయము నమాయికత్వముఁ జూడ నిందు నీ దోసము లేదనియు, నింతకు మూలకారణ మాతఁడే యనియు స్పష్ట మగుచున్న"దనెను.

రో: ప్రభూ! ప్రభూ! కొర్నీలియసు నిర్దోషి.

విలి: (ఉలికిపడి) నీ కీ దుర్బోధ కొర్నీలియసు చేయ లేదనియేనా నీవు చెప్పునది?

రో: ప్రభూ! నా విన్నప మేమన, ఇపుడు మీ రాపా దించు నీ యపరాధ మెంత నిజమో, తొల్లి యాపా దించిన నేరముకూడ నంతియే నిజము.

విలి.: తొలుతటినేరమా! పసిదానా? ఆ నేరమునుగూర్చి నీ వేమి యెఱుఁగుదువు? కొర్నీలియసు డివిటునకుఁ దోడ్పై, జానుడివిటు లూయీకి వ్రాసిన లేఖ లీతఁడు దాచియుంచిన విషయము నీ కెట్లెఱుంగవచ్చును?

రో: తనకడ దాచిన యా రహస్యలేఖల వృత్త మాతఁ డెఱుంగడు. ప్రభూ! ఆతఁ డించుకయు నెఱుంగఁడు. ఎఱిగియున్న నా కొర్నీలియసు నాతోఁ జెప్పకుండునా? నిష్కళంక మగు నాతని హృదయముకురమున నా కెఱుఁగరాని రహస్యమించుకయు లేదు. వట్టిది ప్రభూ! వట్టిది. నా మాట నమ్ముఁడు. కొర్నీలియసువలన దోష మించుకంతయు లేదు. ఏలినవారి క్రాగహము జనించి నను సరియే, నే నీమాట చాటి చెప్పఁగలను. ఈ రెండవదోస మెంత సత్యమో యాతని మొదటినేరము

నంతే సత్యము. ఆతని మొదటి నేర మెంత యసత్యమో యీ రెండవ నేరము నంత యసత్యమే. అయ్యో! దైవమా! నా కొర్నీలియసు సాధుత్వము నీ ప్రభుఁ డెఱుంగఁడు కదా!

బా: ఓవిట్టుల కాప్టెఁడగు కొర్నీలియసు సాధుత్వ మెల్లరు నెఱిఁగినదియే. ఇఁక, నాతని ప్రాణములతో విడిచిన ప్రభుఁ డెఱుఁగకుండునా?

విలి: మాటాడకుము. ఈ రాజ్యతంత్రప్రసక్తి మీకు వలదు. పుష్పాభిమానిసంఘమున కిందు జోక్యము లేదు.

అని బొమలు ముడివైచి, బొక్స్టెలుతో "కలువ విష యమున నీకు న్యాయమే జరుగును. నీ వలజడి చెందకుము" అనియెను.

బొక్స్టెలు సంతుష్టుఁడై, వినయవినమితుఁడై ప్రభునకు నమస్కరించెను. విలియ మంతట రోజాతో "చిన్నదానా! నీ దోషమును సైచితిని. నీ వంతు శిక్షగూడ నతఁడే యను భవింపఁగలఁడు. అతఁడు రాజద్రోహియు, దేశద్రోహియు కావచ్చును గాక! తుదకిట్లు దొంగతనమునకుఁగూడఁ బాల్పడఁ దగునా?" యనెను.

రో: "దొంగయా! దొంగతనమా? పాపము శమించు గాక! ప్రభూ! ఆ మాటమాత్ర మనకుఁడు. ఈ నింద విన్న నాతఁడు జీవింపఁడు. చౌర్యము మాట నిక్క మేని యీ మానిసికన్న నన్యు లెవ్వరు నా చౌర్య మొనర్పలేదు.

బా: నిదర్శనము చూపవలెను. వట్టినిందలచే ఫలము లేదు.

రో: తొందరపడకుము. ఈశ్వరానుగ్రహ మున్న నిదర్శ

సము లభింపకపోదు" అని, బ్యాక్స్టను వంకకు మరలి, "యీ నల్లగలువ నీదే కదా?" యని ప్రశ్నింప, వాఁడు "ఔను నాదే" అనెను.

రో: నీచెంత నల్లకలువ దుంప లెన్నియున్నవి?

బ్యాక్స్టన్ లొక్క ముహూర్త మాలోచించెను. రోజా చెంత నింకను దుంప లుండకున్నచో నాప్రశ్న మడుగ దని యూహించి మూఁడని సమాధాన మొసఁగెను.

రో: ఆ మూఁటి నేమి చేసితివి?

బా: ఏమిచేసితినా? ఒకటి చెడిపోయినది. రెండవ దీపూవు బూచెను.

రో: మూఁడవదియో.

బా: మూఁడవదా?

రో: మూఁడవదే, అది యేమైనది?

బా: (కళవళంపడి) నా యింటికడ నున్నది.

రో: ఇంటికడ నన, కాస్టనులోనా? డాగ్గులోనా?

బా: డాగ్గులో.

రో: అసత్యము (విలియముతో) ప్రభూ! యీమూఁడు మొలకల సత్య మిది. మొదటిదుంప చెరసాలలో మాయయ్య చిదిమివైచినాఁడు. ఆ విషయ మీతఁ డెఱుంగును. దానిని చిదిమివైచినందులకు మాయయ్యపై నుండిపడె నీతఁడు. రెండవదుంప నేను నాటి యీ పూవును బెంచితిని. ఇక మూఁడవది, యిదిగో (అని కంచుకమునుండి వెలికిఁదీసి) యిచట నున్నది. తక్కిన వెంటితోఁగూడ మొదట నే కాగితమున నిది పొట్లము కట్టబడెనో యందే యున్నది. చిత్తగింపుఁడు, శిరచ్ఛేద

మున కేగుతరి గోర్నిలియ సీమూటిని నా కీ పత్రమున నే
మడచియిచ్చినాఁడు ప్రభూ! చిత్తగింపుము."

అనుచు నాకాగితమునుండి తీసి మొలకను విలియమున
కందిచ్చెను. విలియము తదంకురమును బరిశీలించుచుండెను.
ఆ కాగితముపై నేవో యక్షరము లుంటఁగాంచి రోజా
వానిని జదువుచుండెను. బాక్ట్సలు భయభ్రాంతుఁడై తత్తర
పడుచు, "ప్రభూ! యీ బాలిక పూవును బోలె నీ దుంపను
గూడ దొంగిలించెఁగావలయు" ననెను.

ఈలో, కాగితము బఠించుచున్నరోజా మొగమింతయై
విప్పారెను. మరల మరల నా యద్భుతాక్షరపంక్తి నిట్లు
పఠించి, యొక్క యుదుటున, "ప్రభూ! ఈ కాగితమును
చిత్తగింపు" డని కేక యిడెను. చేతనున్న మొలకను విలి
యము హరిసేను కందియిచ్చి, తా నాపత్రము నందుకొని
పఠించెను. అట్లు పఠించుచుండ విలియము హస్తములు
వణకఁదొడఁగెను. చెమ్మటలు గ్రమ్మినమోమున సంతాపము
గృపయు బ్రేలుచుండెను. కొర్నిలియసుడివిటు వ్రాసిన యా
లేఖ మనకు సుపరిచితమే. అందలి పంక్తు లివి.

"కుమారా! నేను నీ కొసఁగిన కాగితముల సంచిని
తగులబెట్టుము. ఆ సంచి విప్పి లోపలి కాగితములు సూడ
వలదు. అందలి రహస్యములు నీ వెన్నఁడు నెఱుఁగరాదు.
అట్టిరహస్యముల నెఱిగి గోపనము సల్పుట ప్రాణహానిఁ
జేయును. కావున వానిని గాల్చివేయుము. మా సోదరుల
ప్రాణములు రక్షించినవాఁడ వగుదువు. తండ్రీ! నీవు చిరంజీవి
వగుము, అగస్టు ౨౦,౧౬౭౨. డివిటు.

కలువ సత్యమును, కొర్నీలియసు నిర్దోషితను ప్రమాణీకరించు నా కాగితపుముక్కను బలించిన పిమ్మట, రోజాయు విలియము నొండొరుల నొక్కపరి దిలకించుకొనిరి.

రోజాచూడ్కి, 'నేను చెప్పలేదా! చూచితిరా మఱి' యని బోధించెను. ప్రభుని చూడ్కి 'నీ కెందుకు? మిన్నక చూచుచుండు' మని మారువలికెను.

లజ్జాసంతాపములచే లోలోఁ గుమారిలుచున్న విలియము మోమున జెమ్మటలు నొదుడిచికొని, యా పత్రమును భద్రముగ దాచి, యెట్లో శిరమ్ము నెత్తి, "బాక్స్టలు! నీ వింక నేగవచ్చును. నీకు న్యాయము జరుగఁగలదు. పొమ్ము!" అని వాని నంపి, యధ్యక్షునితో "ఆర్యా! యా కలువను ఈ కన్నెను మీ యధీనమున నుంపుఁడు. నా కనుజ్ఞ యిండు" అని వచించి వీథిలోనున్న ప్రజల కరతాళధ్వనులు మిన్నుముట్ట వెడలిపోయెను.

బాక్స్టలు తన విడిది కేగి రోజా యొసఁగిన కాగితమును విలియము భద్రముగా నేల దాచెనో, యందేమున్నదో యని సందియంపడుచుఁ జిత్తస్వాస్థ్యము గోల్పడి విచారింపఁ జొచ్చెను.

రోజా కలువచెంత కేగి ప్రియమార ముద్దుగొని సంతోషసౌఖ్యములు హృదయమున నిండి తొలంకుచుండ, "పరమేశ్వరా! నీ దివ్యచిత్తమున నేమి సంకల్పించి కొర్నీలియసుచే నా కీ చదువు నేర్పించితివో, ఎవ్వని కెఱుక!" యని ధ్యానించెను.

## ౨౭

ప్రియతమలగు రోజా కలువకన్నెల వృత్తాంతమంతయు నెఱుంగక కారాగారాంధువునం బడియున్న కథానాయకుని యవస్థ యెటు లున్నదో యించుక విచారింతము.

మొదలే క్రూరుండగు గ్రైఫసు, కూంతుజాండయు మిత్రుండగు జేకబు వర్తనము నించుకయు నెఱుంగరామిం గ్రోధోన్మత్తపిశాచమువలెం గొర్నీలియసును విఱిచికొని తిన నారంభించెను. వారిరువురు నట్లు మటుమాయమైపోవుట వానిబుద్ధి కింద్రజాలమై తోంచెను. శాంబరీవిద్యలో గడితేఱిన కొర్నీలియసే తన్మూలకారణ మని యాతడు నిశ్చయించుకొనెను. రోజా జాకబులు మాయమైయప్పటికి రెణ్ణాళ్లయినది. ఇక సహించలేక మూండవనాటి యుదయమున గ్రైఫసు క్రోధావతారమో యనం జెఱసాలలోని కేగెను.

కొర్నీలియసు కిటికియడ్డకమ్ములపై మోచేతులు మోపి, హస్తతలముల నాస్యము నూది, శూన్యవిలోకనముల బయలు సూచుచు, శీతలవాతసేవనమున మనస్తాప మపనయించుకొనుచుండెను. దవ్వుల డార్టునగరము దృష్టిగోచర మగుచున్నది. తొల్లిటి కపోతములు చేరువనే యున్నవి. ఏమి భాగ్యము? ఎంత యోజించి చూచినను ఆశాకిరణ లేశమైన గన్పించుట లేదు.

పాపము, అదుపులోనున్న రోజా యిక నాతని చెంగటికి రాంజాలదు. రాకున్నమానె; కమ్మయైన లిఖింపవచ్చునుగా! అయ్యో! లిఖించి యేమి ప్రయోజనము? ఆ కమ్మ నాతని కెట్లు చేర్పగలదు?

రెణ్నాళ్లనుండియు గ్రిఫను క్రౌర్యము మఱింత పెచ్చు పెరిగి పోయినది. వానివైఖరిజూడ గూఁతు నణుమాత్రమైన నేమఱి యుండు నని తోఁపదు. తా నేకాంతవాసము, ప్రియా వియోగము మాత్ర మనుభవించుచున్నాఁడే గాని పాప మయ్యబల ఆ కటిక తండ్రి చేతులలో నెంత కోతపడుచున్నదో? మధుపానమత్తుఁడైన తెలుఁ వానిచేతి కష్టముండునా? ఇంతకు విఱిగిన వానిచేతికిఁ గట్టుకట్టి చక్కఁబఱచిన బుద్ధిహీనత తనది. ఆమోహకుని క్రూరచేష్టల కగ్గమై, రోజా నవయుచుండ దా నశక్తుఁడై, చెఱలోఁ బడియుండవయ్యెఁగదా యని తన్ను నిందించికొనెను. ఏ పాపము నెఱుగని తమ కిరువురకు దైవ మిట్టి కడగండ్లేల తెచ్చిపెట్టవలెను? తా మిన్ని యిడుములు గుడుచుచుండ నూరక చూచు దైవమునకు ధర్మతత్పరత యెక్కడిది అని దైవమును నిందించెను. ఎంతటి యోగ్యుల కైన నాస్తికతను మప్పునుగదా విపత్సమయము!

తనపై లేని యపచారములు మోపి, గ్రిఫను అధికారులతో నేమి కొండెములు సెప్పెనో? వాని కన్న మున్న తానే హేగునగరమునకు యథార్థవృత్తమును వ్రాసియంపుట కైన లేఖనోపకరణము లన్నిటి నా క్రూరుడు మున్నే హరించెను. ఉపకరణము లున్నను గ్రిఫను ద్వారముననే కదా తా నా లేఖ నంపవలెను! ఆ కుటిలుఁ డద్దాని నంపు నని నమ్ముట యెట్లు ?

ఇట్లుతడు పలుపోకలఁ దలపోయు వేళలందు చెఱనుండి పాఱిపోవలయునను నూహాకూడఁ బొడముచుండెను. రోజా సాన్నిధ్యము లభించుచున్నంత కాలము వానికిఁ బాఱిపోవలయునన్న నూహాయే తట్టలేదు. ఇప్పు డట్టి కోరిక పుట్టియుఁ

ప్రయోజనము కన్పించదు. 'మహాజనో యేన గత స్సపంథా' అను సామాన్యమానవగణములోవాఁడు కాఁడు కోర్నీలియసు. సామాన్యులు తమకార్యముల నిట్టె చక్కబెట్టుకొందురు. వారిది రాచబాట. కోర్నీలియసు అట్టి రాచబాట నడవఁడు. అందఱకు నందు ఫలముల కాతఁడాసింపఁడు. తన కార్యము చెడినను సరే నలిగినబాటల నాతఁడడుగుపెట్టఁడు. ఆతనిది విచిత్రమైన ప్రకృతి!

"చెఱనుండి గ్రోషియ స్సింతకుమున్నె పాఱిపోయెను. నేను మరల నాకార్యమునకే పూని ఫలమేమి? అదియును కాక, గ్రోషియసు పాఱిపోయిన పిమ్మట నిచటి యధికారులు మేలుకొని, కట్టుదిట్టము లధికము చేసిరి. వానికిఁ దోడు ప్రత్యక్షశత్రువగు నీ యమకింకరుని కావలి! వీని గను బ్రామి పోవు టెట్లు? రోజా సాన్నిధ్యసౌఖ్యము దూరమైనప్పటినుండి నే నీ కష్టములు సహింపలే కున్నాను. ముఖ్యముగా, నా కలువను బోగొట్టుకొన్నది మొదలు నాకు మతియే చెడుచున్నది. ఈ గ్రైఫసు నా మానమర్యాదలు దక్కనీయడు సరికదా, నా ప్రణయాధిదేవత నెప్పుడో అత్యాచరణము పాలుసేయును; లేదా, నాపై చేయి చేసికొన్నను చేసికొన్నవాఁడే! కానిమ్ము; అంతగా శ్రుతిమించి వచ్చినచో ఈ నీచుని గొంతు నులిమి కడతేర్పక విడువను."

ఇట్లు తలపోయుచు నాతఁ డౌడు గఱచి, నివ్వెఱపాటున నొకింత నిలిచి, మరల "మేలు మేలు, గ్రైఫసు నటులు కడతేర్చిన పిమ్మట వాని తాళపుజెవులు గైకొని, యీ చెఱ వీడి, హుటాహుటి నా రోజ చెంత కేగెదను. జరగిన వృత్తమెల్ల వినిపించి, ఆ బాలతోగూడ గోడదాటి పాఱిపోవచ్చును.

దైవమా! నా తెలివి తెల్లవాఱి నటులున్నది. గ్రిఫను ఎంత క్రూరమతియైనను నా రోజాకుఁ గన్న తండ్రి. నా మీఁద నయ్యబల కెంత వలపున్నను దండ్రిని జంపిన నన్నుఁ జేపట్టునా? అబ్బ! కొర్నీలియస్! నీ యాలోచన బాగున్నదికాదు. నిజమే, బాగుండ లేదు. మఱి నాకు గత్యంతర మేది? నా రోజా నా కెట్లు లభించును?" అనుచు నిరాశ చెందును.

ఇట్లు చింతించుచు నాతఁడు గవాక్షముచెంత నిలిచి యుండ, గ్రిఫను దండపాణియై, క్రోధసమ్మిశ్రమగు కుటిల హాసము మోమునఁ దోప, గదిలోని కేతెంచెను. వచ్చినవాఁడు గ్రిఫన్నని గ్రహించియుఁ గొర్నీలియ సాతని వంక జూడ నిచ్చగింపక అల్లన నేదియో పాట బాడుకొనుచుండెను. బంధితుని నిర్వికారశాంతము గాంచి, గ్రిఫను కొడలు మండి పోయెను. ఎదిరి యలక్ష్యము నుఁ క్రోధాగ్ని కాజ్యధార యగుట సాజమేకదా. కంఠపూర్ణమగు క్రోధము నెట్లో వెడలఁగ్రక్క నెంచి, గ్రిఫను నేలపై దండతాడన మొనర్చి హుంకరించెను.

కొర్నీలియ సప్పటికి సడ్డసేయక, జాలిగొలుపు బూల పాట అల్పస్వరమున నిట్లు పాడదొడగెను.

ఇలచేడె కడుపులోఁ బొలసి నునుసెగ లెగయు
నులివెచ్చనగు రహోజ్వాలను బిడ్డలము,
క్రొంబొద్దు పొడుపులును కొదమ నీహారములు
కూర్మి మీఱఁగఁ గన్న కూఁతులము మేము.
వాయుదేవుడు మాకుఁ దండ్రి
వారిదేవత మాకుఁ దల్లి
స్వర్గలోకము మాకు జన్మస్థలమ్ము.

కరుణరసప్రధాన మగు నీ గీత మాతని మధురగళము

నుండి యుజ్వలమై వెడలుచుండ గ్రైఫసు క్రోధారుణాక్షుడై దండమును మరల నేలఁ దాటించి, "ఖౌలే, పాటగాఁడా! ఇటు చూడుము" అని గద్దించెను.

కొర్నిలియసు వానివంకకు మరలి కుశలప్రశ్నము మాత్రమొనరించి, రెండియు నిటు గానముసేయ దొరకొనెను.

వలతురట మము నరులు, వలచి గాసియొనర్చి,
వలపుననె మాప్రాణములు హరించేరు!
వేరె భూమికి మాకు విడరానిబంధమ్ము,
వేరె యాధారమ్ము, వేరె ప్రాణమ్ము;
స్వర్గమ్మునకు అంగ చాచేము మేము
స్వర్గమ్మునకు గేలు సాచి లేచేము.

గ్రై: నీ మంత్రాలు మంటగలియ! నన్ను గేలిసేతు వటరా!

కొర్నిలియసు గానముసేయుచునే యుండెను.

మాయిల్లు స్వర్గమ్ము, మా కాణయాచి దివి,
మాయాత్మ లటనుండి మమ్ము జేరేను,
మరలి యచ్చటికే మాయాత్మ లేగేను
నెత్తావులే యాత్మ మాకు
క్రొత్తావులే యాత్మ మాకు.

గ్రైఫసు కొర్నిలియసును సమీపించి "చేటూ పాటూ ఎఱుగని నీ పాటలు చాలించి, ఇటు విను. నీ పాపములు నీ నోటఁబలికింప వచ్చితిని; తెలియునా?" అని గద్దించెను. కొర్నిలియసు "మహాశయా! మీ కేమీ పిచ్చి యెత్తదు కదా?" అని యడిగెను.

అంతటఁ గ్రోధఘూర్ణమై జేవురించియున్న వాని వికృత

వదనమును, గెంపెక్కిన నేత్రములు, నేఱువులు గ్రమ్మి పెదవులును గాంచి, ఆచ్చపాటూదవ "బాపురే! ఇదియేమి పిచ్చి! వీనికిఁ బిచ్చికాదు, పిశాచమే పట్టినట్లున్నది" అనెను.

ఆ మాటలచే నలిరేగిన కినుకమై గ్రీఫసు దండము కేల నెత్తి ఝుళిపించుచు "చూచితివా, దీని?" నని యడిగెను.

కో: చూచితినిగాని దానితో మర్దింతువా యేమి నన్ను?

గ్రై: ఇంకను సందేహమా?

కో: మంచిమాటయేకాని, బందిపై చేయిచేసికొన్నచో నీ కీ యుద్యోగ మూడునని యెఱుగనట్లున్నావు?

గ్రై: ఎఱిగియే చేయిచేసికొనక కఱ్ఱ దెచ్చితిని.

కో: అయినచో నీ కింకొకమాట తెలియజెప్పుచున్నాను. కఱ్ఱ నెత్తినవానికి గఱ్ఱతోడనే శాస్తియగును.

గ్రీఫ స్సంతట నోట బెఱుంగని క్రోధమున నాకఱ్ఱతో నాతని వ్రేయఁబోవఁ, గోర్నెలియసు తటాలున నాదండము నూడలాగికొని; "శాంతించు మందుడా! శాంతించు. ఉద్యోగమునకుఁ జేతులార నీళ్ళు తోడికొనకు" మని వారించెను.

గ్రై: ఓరి మాయచచ్చినవాడా! నా కఱ్ఱలాగికొందువుగా! కానిమ్ము, ని న్నింతటితో విడువను. నేను నీకు బిండము గొనిరాకుండ వట్టిచేతులతో వచ్చితిని. చూచితివా? ని న్నిక మాడ్చి చంపుదును, జాగ్రత్త!

కో: ఓరి దుండగీడా! ఎంత ఘోరము తలపెట్టితివిరా! ఎంతటి పాతకమున కెత్తుకొంటివిరా?

గ్రై: పాపమో, పుణ్యమో? నీ విక మాడి చావవలసినదే. అపుడు నీవూ, నీ మంత్రములు రూపుమాసి పోదురు. పీడ వదలిపోవును.

కొ : వృద్ధుడా! నా యింద్రజాలప్రభావ మెఱిగియు పొర బడుచున్నావు. డార్ట్సుపురినుండి నా మంత్రములచేఁ బావురముల రప్పించితి నెఱుగుదువుగదా! నీ వన్నము బెట్టనిచో మునిగిపోదులెమ్ము. నేను బావురములనే తిని బ్రదుకుదును.

గ్రి : కానీ, పచ్చిమాంస మెన్నాళ్లు తిందువో చూతును.

కొ : నాకుఁ బచ్చిమాంసపుగర్మ మేమి? అగ్ని స్తంభనాది విద్యలు నేర్చిన నాకు నిప్పు చేతిలోనిదేకదా!

గ్రి : దినదినము ఒక్కమాంసమే యెన్నాళ్లు తిందువో అదియుఁ జూతును.

కొ : ఓరి వెఱ్ఱివాడా! పావురముల దెప్పించిన నా మంత్రము లేటిలోఁ జేపలనుమాత్రము దెప్పింపలేవా?

ఈ మాటలు విని, గ్రిఫసు నోరు దెఱచికొని, అక్కజం పడుట యరసి, కొర్నీలియసు మరల "నాకు జేపలనిన యెంతో యిష్టము. నీ వొక్కనాడును జేపలకూర పెట్టకపోతివి. నీ పుణ్యమా యని యిక నాకు దినదినము చేపనంజుళ్లే అరగింపు" అనుచు వానిని మఱియు నుడికింపసాగెను.

గ్రిఫసు క్రోధభయభ్రాంతులచే నొకింతసేపు విన్ననై యుండి, అంతలో మరలఁ దెప్పిరిల్లి, "మంచిది. ఇక నా కింతకంటె నుపాయము లేదు" అనుచు జేబులోనున్న చుఱుకత్తి వెలికిఁదీసెను.

కొర్నీలియసు దానింగాంచి, "ఓహో కత్తియే!" అనుచుఁ, జేతిలోనున్నకఱ్ఱతో నొడలు మాటుకొన నాయత్తుఁడయ్యెను.

గ్రిఫ నట్లు సురియ నెత్తియుఁ, గోర్నీలియసు దాని కడ్డముగా దండము దాల్చియుఁ, గొంతవడి రోజుచు నిలిచిరి. ఇట్లెంతసేపూరక నిలుచుట యని యెంచి, కోర్నీలియ సంతట నా వృద్ధుని క్రోధమునకుఁ గారణ మరయువాఁడై "నాపై నెందు కింత కోపము నీకు?" అని ప్రశ్నించెను.

గ్రి: కోప మెందులకా? నారోజా నేమి చేసితివి? మచ్చు జల్లి దాని నెచట మాయముచేసితివో చెప్పుదువా, పొడుతునా?

కో: రోజాయా! రోజా కోటలో లేమా?

గ్రి: ఔను: లేదని నీ వెఱుగవు పాపము! ఎంతటి నంగ నాచివిరా! నాబిడ్డను నా కప్పగించెదవా, లేదా! రెండవసారి యడుగుచున్నాను.

కో: నీ పన్నాగము లింతటఁ జాలించు. నీకూఁతుజాడ నీ వెఱుగవేని నీవే యూహించుకొను, మెచట నున్నదో!

అంతకంతకు మితిమీఱు కోపమున గ్రిఫసు పెదవులు గంపింపఁ; గత్తి ఝళిపించుచు "మూడవసారి యడుగు చున్నాను, చెప్పెదవా, ఈ సురియతో నీ నోరు పగిల్చి చెప్పింతునా?" యనుచు మీఁదికి రాసాగెను.

కో: మూర్ఖుఁడా! నిజముగా నన్ను జంపుదువా యేమి!

గ్రి: చంపుదునా, నీగుండెలు చీల్చి, నా కూఁతు నచట నెమకుదునా?" అనుచు నాతనిపై కుఱికెను.

కోర్నీలియ సాపోటు దప్పించుకొనువాఁడై, ఒక్క గంతున మేజాచాటున కేగి వానికి దూరముగా నిలిచెను.

వృద్ధుఁడంతట నాగక ఉద్ధృతఖడ్గపాణియై, దుర్భాషలాడుచు దరిదాపై వచ్చుట యరసి, కొర్నీలియ స్సిది పనికాదని, కఱ్ఱ నెత్తి వాని చేతిపై నొక్కపెట్టు పెట్టెను. వృద్ధుని చేతియం దున్న ఖడ్గ మాదెబ్బతో నేలపైఁ బడెను. కొర్నీలియ స్సా కత్తిని దన యరకాలితోఁ ద్రొక్కి నిలిచెను. దెబ్బదినిన బాధకు నిరాయుధుడనైతి నను నవమానము తోడుకాఁగా; గ్రైఫసు విచ్చలవిడి నోరికొలంది దూలనాడుచుఁ బండ్లుగీట సాగెను. కొర్నీలియసు వాని యాగడమును మట్టుపెట్టనెంచి వాఁడు తనపైఁ జేయి చేసికొనకుండ దండతాడన మొనర్చు చుండెను.

గ్రైఫసు చేయునదిలేక పెద్దపెట్టున గోలపెట్టుచుండెను. ఆ సద్దునాలించి, కోటలోని నలుగురు సైనికులు, నొక యధి కారియు చెఱసాలకడకుఁ బఱుగుపఱుగున నేతెంచిరి. దండ పాణియై గ్రైఫసు నెడపెడ మోదుచున్న ఖైదీని, తత్పాదము క్రిందనున్న చుఱకత్తినిగాంచి, వారు కొర్నీలియసు చేతిలోని కఱ్ఱను లాగికొని, యాతని బంధించి, గ్రైఫసును గూరుచుండ నిడి, వాని మేనిపై గానవచ్చు దెబ్బలను లెక్కించిరి.

సైనికులు వచ్చుసరికి తన దుండగము తెల్లమగుటయు, నంతకుమున్ను గ్రైఫసుచేసిన యాగడ మెల్ల దా నెఱిగించి ఫలము లేమియుఁ గొర్నీలియసు తలపోసి హతాశుడై మిన్న కుండెను. కొర్నీలియసు సల్పిన యత్యాచారమును గ్రైఫసు వన్నెచిన్నెలతో వర్ణించి చెప్పుచుండ నధికారులు దానినెల్ల లిఖించికొనిరి. కారాగృహపాలుని బుద్ధిపూర్వకముగఁ జంప యత్నించెనని కొర్నీలియసుపై నేరమారోపించిరి. గ్రైఫసును నలుగురు సైనికులు చేతులపైఁ గ్రిందికి మోసికొనిపోయిరి.

మిగిలిన సైనికులలో నొకఁడు కొర్నీలియసుతో నట్టి నేరములకు మరణమే దండనమనియు, వెనుక ౧౬౮౭ వ సంవత్సరమున 'మత్తయ' యను ఖైదీ యొకఁడు వేడివేడి పులుసు నధికారిపైఁ గ్రుమ్మరించినందులకు మరణదండనమే విధించిరనియు, పండ్రెండు గంటలు గడవక పూర్వమే వానిని గాల్చి చంపి రనియుఁ దెలియఁజెప్పెను.

కొర్నీలియ సా కథ విని, "పండ్రెండు గంటలు జరుగకుండనే కాల్చిచంపిరిగా!" యని యచ్చెరువందుచుఁ బ్రశ్నించెను. సైనికుఁ డుత్ఫుల్లవదనుఁడై! "పండ్రెండవగంట మ్రోగుచుండగనే కాల్చివేసిరి" అని తెలియఁజెప్పఁ, గొర్నీలియస్సు "శుభస్య శీఘ్ర"మ్మని మిన్నకుండెను.

ఇంతలో నెవరో మేడమెట్లెక్కి వచ్చుచున్న సవ్వడి వినిపించెను. మఱునిముసమున రాజపురుషుఁ డొకఁడు లోనికేతెంచి, "ఇదియేనా పదునొకటవగది?" యని ప్రశ్నించెను. సైనికుడు చిత్తమని యొదుగుచు బదులు పల్కెను.

"అగుచో నిందున్న బంది కొర్నీలియసు వాను బారలేకదా?"

"చిత్తము"

"ఆతఁ డేడీ?"

కొర్నీలియసు వెలవెలబోవుచు"ఇదిగో, ఇచటనున్నా" నని ముందునకు వచ్చి నిలిచెను. రాజపురుషుడు "మీరేనా? నావెంట రం" డనియెను.

అపుడు కొర్నీలియసు హృదయమున మరణభీతి యొకింత యలముకొన "ఓహో! ఈకోటలో వ్యవహారములు వాయు వేగ

మున నడచుచున్నవే! ఆ గాడిద నాతోఁ బన్రెండు గంట లని చెప్పెనే!'' యనుకొనుచు లేచి నిలిచెను.

కథ చెప్పిన సైనికుడు "క్షమించితివా, నేచెప్పినదంతయు జరుగుచున్నది'' అనుచు గోర్నీలియసు చెవిచెంత నల్లనఁ బలికెను.

కొ : అసత్యము.

సై : ఎందువలన ?

కొ : పన్రెండు గంట లంటివే?

సై : అంటినిగాని, మాయేలినవారి కంగరక్షకుడగు వాను డెకెను దళవాయి నీ కొఱకై స్వయముగా వచ్చి వ్యవహారము నడుపుచున్నాడు. వెనుక 'మత్తయ' కిట్టి గౌరవము లభింపలేదు.

కొ : కానిమ్ము; చింతలేదు. కోర్నీలియసుడివిట్టు ధర్మపుత్రుడు మరణమునకు భీతిల్లఁడని వీరికిఁ దెలిసి వచ్చును లెమ్ము'' అనుచు నడువసాగెను.

జరిగిన వ్యవహార మంతయు నివేదించునధికారి వాను డెకెను దళవాయితో "అయ్యా! నివేదిక వ్రాయుట యింకను ముగియలేదే! ఎట్లు?'' అని సంశయముతోఁ బలుక, డెకెను, "పోనిమ్ము, నివేదిక ముగియ నక్కఱలేదు లె''మ్మనుచు ముందునకు సాగెను.

కోర్నీలియసు తనదురవస్థ తలంపునఁ బొఱి, నింతకు, భూమిపై నాపేరు నిల్పగల పుత్రునో, పూవునో, పుస్తకమునో పడయకుండ నిట్లకాలమృత్యువువాతబడు మని నానొసట వ్రాసి యున్నది కాఁబోలు'' ననుకొనుచు డెకెను దళవాయివెంట ధీరుఁడై నడచియేగెను.

మేడమెట్లు దిగినపిమ్మట, నచటఁ దన రోజా ముఖ చంద్రుఁడు కనులపండు వొనర్పుట లేకపోగా, గ్రైఫసు రాక్షసుఁడు మరలఁ బ్రత్యక్ష మగునేమో యని సంశయించుచు నరుగఁ జొచ్చెను. ఆ యంత్యముహూర్తమున రోజాయు, నామె ముద్దులకూతురు గలువయు నాతని తలంపునఁ బాఱి వికలధైర్యు నొనరించిరి. ఇట్లతడు గుడిమెడమలకుఁ జూడ్కులు పఱపుచు రోజాను గ్రైఫసునుగూడ గాంచనేరక కొంతవడికి దుర్గబహిరంగణము సేరెను.

అచట బదిమంది సైనికులు నిలిచియుండిరి. తన్నుఁ గాల్చి చంపుటకే వా రచట సిద్ధముగా నుండి రని కొర్నీలియసు తలపోసెను. కాని వారిచెంత నాయుధము లెవ్వియు గనుపడ లేదు. వాండ్రచట నవ్వుచుఁ, ద్రుళ్లుచు సల్లాపములాడుకొనుట జూడ గొర్నీలియసుకు మనస్సు చివుక్కుమనెను.

ఉన్నట్లుండి యొకగది తలుపు దెఱచికొని, అందుండి గ్రైఫసు కఱ్ఱ నూఁతగొని, కుంటుచుఁ దూలిపడుచు వచ్చి, కొర్నీలియసును గసిదీఱ దిట్టిపోయసాగెను. కొర్నీలియసు డెకెను దళవాయితో "వింటిరా, వీని దుర్భాషలు? ప్రకృతము నే నున్న స్థితిలో న న్నిట్లు దూలనాడుట న్యాయముకా" దనియెను.

డెకెను నవ్వుకొని, "పోనిండు. మీరు చేసిన దేహశుద్ధిచే వాని కడు పెంతగా మండిపోవుచున్నదో! ఆ మంట దీఱఁ దిట్టికొననిండు" అనియెను.

కొ: నే నాత్మరక్షణమునకై కదా వానిని మర్దించినది?

డె: ఎటులైన నేమి, వాగికొనిండు. వాని శాపములు మిమ్మింక నేమి సేయగలవు?

ఆ మాటలలోని ధ్వనికి గోర్నీలియసు మానసము డిల్లవడెను. ప్రభుని యంగరక్షకు డీ దళవాయి; వీని నోట నిట్టి యమానుషోక్తులు వెడలిన పిమ్మటఁ దా నింక బ్రదుకు పై నిరాశ యొనర్చుకొనవచ్చును. "కానిమ్ము, సర్వము నీశ్వరేచ్ఛ" యనుకొని, తల వ్రేలవైచి, యాతడు నిలిచెను. అట్లు ధ్యానమగ్నుఁడై యున్న కోర్నీలియసు ధ్యానమును భంగమొనర్ప లేక డెకెను మిన్నక నిలిచి చూచుచుండెను.

కోర్నీలియసు కొంతసేపటికి డెకెనువంక గన్గొని, "ముందు జరుగవలసిన పనియేమో కానిం" డనెను.

డెకెను, చెంత నిల్చియున్న నాల్గుగుఱ్ఱాలబండిని గేల జూపెట్టి "దానిలో నెక్కు" డనెను.

మున్ను హేగునగరమునుండి తా నెక్కివచ్చినబండి తలపునఁబొడ గోర్నీలియసు "నా కా గౌరవ మిచట జరుపరు కాఁబోలు"నని యల్లనఁ బలుకుచు శకటము నధిరోహించెను. ఆ మాటలు 'మత్తయ' కథ వినిపించిన సైనికుని చెవులఁ బడెను. వాఁడల్లన శకటమును సమీపించి, కోర్నీలియసుతో మెల్లగా "ఒక్కొకపుడు ఖైదీలను వారిజన్మస్థలములకుఁ గొంపోయి, యూరేగించి, వారి యింటిముంగిటనే దండించుటయుఁగద్దు. ఈ మాత్రము భేదము మీరు పాటింపరాదు" అని సంశయనివారణ మొనర్చెను. కోర్నీలియసు "వీ డెన్వఁడో సర్వసంశయనివారకుడు. ఓదార్చుట కేమాత్రము సందు దొరికినను వృథపోనీయడు" అనుకొని, "మంచిది, నాయనా! నీ మేలు మఱవను. నా కనుజ్ఞ యిమ్ము" అనుచుండ బండిసాగెను.

కోర్నీలియ సట్లు తన చేతులనుండి తప్పించుకొని

పోవుచుండె నను. రోషమున గ్రిఫసు, పిడికిళ్లు బిగియబట్టి "పోతివిరా, పాపీ! నా బిడ్డను నాకప్పగింపకుండ దాటిపోతివిరా" అని యఱచుచు వెంటబడెను.

కొర్నీలియసు బండిలో గూరుచుండి "డార్టుపురికి" గొంపోయినచో బండి మా యింటిముందుగా నేగునపుడు నా పూలమళ్లెట్లున్నవో చూచుకొందును" అనుకొనుచుండెను.

౨౮

బండి యాపవలంతయు నడచి, డార్టుపుర దక్షిణ పార్శ్వమున జని 'రాటరుడాము' పట్టణమున నేగి ప్రొద్దు గ్రుంకుసరికి డెల్ఫునగరమునఁ బ్రవేశించెను.

మార్గమధ్యమునఁ గొర్నీలియసు, డాకెను దళవాయి నెన్నియో ప్రశ్నము లడిగి చూచెను. కాని యాతఁడు దమ ప్రయాణరహస్యము నించుకయు నెఱిఁగింపఁడయ్యె, కొర్నీలియసు "మత్స్యకథ వినిపించిన సర్వసంశయనివారకుఁడగు సైనికుఁ డిపు డున్నచో నా సందియము లన్నియుఁ దీర్చెడువాఁడు కదా" యనుకొనెను.

ఆరేయి వారికి బండిలోనే విడిది; వేకువనే మరలఁ బ్రయాణము సాగించిరి. 'లేడెను' పురముదాఁటి బండియుత్తర సముద్రతీరమునఁ జని, జాము ప్రొద్దెక్కునప్పటికి హార్లెము నగరమునఁ బ్రవేశించెను.

ఈ మూణ్ణాళ్లనుండియు హార్లెమునగరమునఁ బ్రవర్తిల్లిన విశేషములను గొర్నీలియ సించుకయు నెఱుంగఁడు. వానికి సర్వవిషయములు గ్రమముగా వానియంతట నవియే తెలియ

వచ్చును. కావున మా కథానాయకు నటు డించి, మున్ముందు మా పఠితల కచటి వృత్త మెల్ల విన్పించు భారము మాపైఁ గలదు.

నిరాశ్రయులగు నక్కా-సెల్లెండ్రవలె నున్న రోజా నల్ల గల్వలను విలియ మట్లు హారిసేనమహాశయుని కప్పగించి యేగుట మీ రెఱింగినదే. పిమ్మట నానాటి సంజవేళ నొక యుద్యోగి యరుదెంచి విలియము నానతి విన్పించి రోజాను బురమందిరమునకు వెంటఁబెట్టుకొని యేఁగెను.

అచట నొక గదిలో మేజాముందు గూరుచున్న విలియ మేదో వ్రాసికొను చుండెను. పెంపుడుఁగుక్క యొండు వాని పాదముల చెంతఁ బండుకొని అన్యదుస్సాధమగు తదింగిత మెఱుగఁగోరి స్వామిముఖమువంకఁ దిలకించుచుండెను.

విలియము కొంతసేపటికిఁ దలయెత్తి తలుపుచెంత నిల్చి యున్న రోజా నీక్షించి "రమ్ము కుమారీ!" యనియెను. రోజా నాలు గడుగులు ముందునకు వైచి యచట నిలువ నాతఁడు కూరుచుండు మని సన్నయొనర్చెను. ఆ బాలిక తదాజ్ఞావిధే యయై యచట నొక యాసనమునఁ గూరుచుండి యాతఁడు మరలఁ దలవాంచి వ్రాసికొనుచుండ లజ్జయై నల్లన లేచి తలుపుచెంత కేగి నిలిచెను.

విలియము వ్రాయుచున్న లేఖ పూర్తియైనది. ఈలోపల నాతని కుక్క రోజా చెంత కరుదెంచి, గారములు సల్పుచుఁ దత్పరిచయము సంపాదించుచుండెను.

విలియము శునకముంగాచి "యప్పుడే మచ్చికయైతి వటే! అవును. మీరిర్వురు నేకదేశసంభూతలు కదా!" యని నవ్వుచు నంత నాత్మభావగోపనచణము, బరమర్మభేదన

సమర్థము నగు దన నిశితంపుఁ జూపు రోజాపై బ్రసరింపఁజేసి "ఏమి? కుమారీ" యనియెను.

రోజా పదునెన్మి దిర్వదియేండ్ల వడుచు. విలియమున కిర్వది మూడేండ్లు. రోజాను "చెల్లీ" యని సంబోధించి, ఎదిరిడెందము డిల్లపఱచు గంభీరస్వరమున "ఇచట నేకాంత ముగా నున్నది కాన, మన మఱవిడిచి మాటలాడుకొందము" అనియెను.

విలియము ముఖమున దాక్షిణ్యము దక్క నితరభావము ద్యోతకము కాకున్నను, రోజా కేలనో కంప ముదయించెను. ఆ వేల యట్లు వణఁకుచు "చిత్తము" అనియెను.

విలి: నీ తండ్రి కాస్టను కోటలో నున్నాఁడు కదా.

రో: చిత్తము.

విలి: నీ కాతనిపైఁ బ్రీతిలేదు?

రో: లేకపోలేదుకాని, తండ్రి యెడఁ గూతున కుండ దగిన గురుభావము లేదనియే చెప్పవచ్చును.

విలి: పితృభక్తిలేమి దోసమేకాని, అసత్యమాడకుండుట సుగుణమే యగును.

రోజా తలవంచుకొనెను.

విలి: తండ్రిపై నీకు భక్తిలేమికిఁ గారణము?

రో: ఆతఁడు దుర్మార్గుఁ డగుటయే.

విలి: దుర్మార్గుఁ డనగా?

రో: బంధితులఁ బీడించుచుండును.

విలి: అందఱినిఁ బీడించునా?

రో: అందఱిని.

విలి : అందు ముఖ్యముగా నొక్కనికిఁ గల్గిన పీడయే నీ కోపమునకుఁ గారణమేమో?"

రో : ముఖ్యముగా వాన్ బొరలు పండితుని మాయయ్యే పీడించు చుండును. ఆ వాన్ బొరలు—

విలి : నీకుఁ బ్రియుఁడు?

రోజా యులికిపడి, వెనుక కొక్క యడుగు వైచి, "ప్రభూ! నేనాతని వలచితిని" అని ధీరమై పలికెను.

విలి : ఎప్పటినుండి?

రో : నేనాతనిఁ దొలుత జూచినది మొదలుగా.

విలి : నీవాతనిఁ దొలుత నెప్పుడు చూచితివి?

రో : డివిటు సోదరుల ఘోరహత్య జరిగిన మఱునాఁడు.

ప్రభు వామాట విని, పెదవులు బిగియించి, బొమలు ముడివడ క్షణకాలము కనుఱెప్పలు వాల్చి మిన్నకుండెను. మఱునిముసమున మరల నిట్లు ప్రశ్నించెను.

విలి : బ్రతుకెల్లఁ జెఱలో గడపి చెఱలోనే మరణించ వలసిన వానిని వలచి ప్రయోజనము?

రో : ఆతని కదియే నిక్కమేని చెఱలో బ్రతికినన్నాళ్లు నంత్యసమయమునఁగూడ నాతని సేవింపఁ గలుగుటయే నాకు మహాభాగ్యము.

విలి : ఖైదీకిఁ బెండ్ల మనిపించుకొనుట సమ్మతమే నీకు?

రో : కోర్నిలియసు వానుబొరలు మహాశయున కెటులైనఁ బత్ని నగుటకన్న భాగ్యము, సుఖము వేఱొండు లేదు. కాని?—

విలి : కాని—?

రో : చెప్పుటకు ధైర్యము చాలకున్నది ప్రభూ!

విలి : చెప్పుము, నీ కింక నేదియో యాస యున్నటులున్నది.

ఆ నరపాలుని హృదయాంతరాళమున నిద్రాణమై యున్న క్షమాగుణమును మేలుకొలుపనో యన రోజా నీరు నిండిన విశాలలోచనములు నెఱయవిచ్చి, భావగర్భిత మగు చూడ్కి నాతనిపైఁ బఱపెను.

విలి : ఓహో! తెలిసినది.

రోజా: చిఱునగవు మోమునఁదోప హస్తములు మొగిచెను.

విలి : నాపై నాస పెట్టుకొనుచుంటివో?

రో : చిత్తము ప్రభూ!

విలియము "ఊహూఁ" యనుకొనుచు దన యంగరక్షకుని బిలిచి, తా నంతకుమున్న వ్రాసియుంచిన లేఖ నాతని కొసఁగి, "వానుడెకెన్! నీ వీ యుత్తరము కాస్టనుదుర్గమునకుఁ గొంపోయి, దుర్గరక్షకున కద్దాని వినిపించి, యందు గల నా యాజ్ఞ నిర్వర్తింపుము" అనియెను. వానుడెకెను 'చిత్తే' మనుచు బనివినియెను.

విలియ మంతట రోజాతో, "కుమారీ! ఎల్లుండి యాది వారమునాఁడు కలువపండుగ. నీ వీ మైదునూర్గ వరాలు, గైకొని, తదుత్సవోచితముగఁ గై సేసికొనుము. నీ కానాఁడు పండువగుగాత" మనియెను.

రోజా : నన్నెట్లు కై సేసికొమ్మని యేలినవారియాజ్ఞ?

విలి : శ్రీమలాండు దేశపుఁ బెండ్లికూతువలె నలంకరించు కొన్నచో నీ కెంతయుఁ దగియుండును.

# ౨౭

౧౭౭౩ వ సంవత్సరము మేనెల ౧౫ తేది ఆదివారము నాఁడు హార్లేము నగరవాసులకుఁ బండుగమీఁదఁ బండుగ. నల్లగలువ యావిర్భవించుట పండుగకు ముఖ్యకారణము. హాలండు దేశపు టేలిక తదుత్సవమునఁ బాల్గొన నంగీక రించుట రెండవకారణము. గతవత్సరమున ఫ్రాన్సుదేశముతో హాలండుకు దారుణసంగ్రామము ప్రవర్తిల్లెను. ఆ యుద్ధముచే హాలండుదేశీయుల యుత్సాహము మొక్కవోలే దనియు, నృత్తగీతాదు లగు వేడ్క లనుభవింపఁగల రనియు బగఱకుఁ దెల్ల మొనర్పవలసియున్నది. కావున నుత్సవమున కది మూఁడవ నిమిత్తము.

ఆ నాఁటి ప్రజల యుత్సాహ మేమి సెప్ప! పుష్పప్రియ సంఘము పుష్పమాత్రమునకు లక్షవరాలు పసదన మొసఁ గుటయే యబ్బురము. దానికిఁదోడు ప్రజ లయ్యుత్సవార్థము మఱి లక్షవరాలు వెచ్చించుట యంతకన్న నబ్బురము.

శాత్రవులబారినుండి జన్మదేశమును రక్షించుకొను పొంటె హాలండుదేశీయు లపారధనము వెచ్చించుట వింత కాదు; కాని యొక్కనాఁడు వికసించి మఱునాటికి వాడి పోయెడి పుష్పమాత్రమునకై స్త్రీబాలవృద్ధముగఁ బ్రజలు సూపు సౌందార్యము, ననుభవించు నానందముగాంచిన నేరికైన నాహా పుట్టకుండునా!

పుష్పప్రియ సంఘాధ్యక్షుడగు హారిసేన మహాశయుఁడు నల్ల యుడుపులం దాల్చి సర్వవిధముల నల్లగలువను దల పించుచుఁ బౌరజనుల కగ్రేసరుఁడై ముందు నడువఁ బుష్ప

ప్రియసదస్యు లాతని వెన్నంటి యే తెంచిరి. పుష్పప్రియసదస్యు లెల్లరు వింత వింతగఁ గైసేసికొని, హస్తముల వివిధజాతి కుసుమగుచ్ఛముల ధరించి యామని వేళ విఱియ బూచిన పూదోటఁ దలపించుచు నట్లు నడతేఱఁ, బ్రకృతివర్గము, రాచకొలము వారు, వణిక్ఛిఖామణులు, వీరభట సందోహ మును వారి వెన్నంటి నడువసాగిరి. సామాన్య ప్రజ సముచితా లంకారములు నెఱయఁ ద్రోవ కిరుదెసల శ్రేణులై నిలిచి చూచుచుండెను.

ఎంత వింత యుత్సవ మది ! శాత్రవవిజయశోభితుఁడై వచ్చిన భూపాలుని పురప్రవేశోత్సవమా యది? కాదు. హార్లమునగరము వారికిఁ బుష్పస్రష్టలే జగజ్జేతలు. ఆ పుష్పా రాధకులు పుష్పదేవతలనే యూరేగింతురు. శత్రు విజయోత్స వమునందువలె నా యూరేగింపున భేరీ భాంకృతులా ! గజ బృంహితములా ! వీరవరసింహనాదములా! ఏమియు లేవు. అమాయికములగు గొఱియల మంద లల్లనఁ జనుపోల్కి, సాధుతాశీలము లగు విహంగము లాకసమున శ్రేణులుగట్టి పోవు మాడ్కి, బరమశాంతముగ నడచిపోవు నాయూరే గింపులో, బంగారు జరీకుచ్చులు వ్రేల, దెల్లమొకమాలు బఱచిన పీఠముపై నధివసించిన నల్లగలువ చూపఱకుఁ గనుల పండు వొనర్చుచుండెను.

న్యాఁడా లక్షవరాల పసదనము నందియిచ్చు నపుడు విలి యము నరపాలుని నోట నేమి మాటలు వెడలునో యని యాతని శత్రుమిత్రలోక మెల్ల నెదురుసూచుచుండెను. ప్రకృతి కల్పకము నారాధించి, యద్దానిచే నల్లగలువను బుష్పింపఁ జేసిన మహాపురుషునకు స్వాగతము వలికి, మెప్పు లందించు

వేడ్కమై నట్లు చేరిన పౌరజానపదులు వృక్షశ్రేణులవెంట బంక్తులు దీర్చి నిలిచి, తదాగమనము బ్రతీక్షింపు చుండిరి.

ప్రజలకు మెచ్చుపుట్టెనా, ఇంక నామెప్పున కాద్యంతము లుండవు. వారు గెలిసేత కెత్తికొందురా, దానికి నాద్యంతము లుండవు. ముందు హరిసేన మహాశయుని, నాతఁడు దాల్చిన పుష్పగుచ్ఛమును గాంచఁగనే మెప్పునకు నాంది పఠించిరి. పిమ్మటఁ బుష్పప్రియసదస్యుల కందఱికి స్వాగతము వచించిరి. పురపాలకవర్గమునకు జయధ్వానములు, హాలండు దేశమునకు స్వస్తి, మంగళవాద్యములకుఁ గరతాళములు.

ప్రజ యిట్లు సంతోషధ్వానములు సల్పుచుఁ బ్రధాన పాత్రప్రవేశమును వేచియుండెను. నల్లగలువను సాధించిన పురుషుఁడే యీ నాటకమున నాయక పాత్రధారి.

ప్రథమమున హరిసేన పండితుఁడు దా రచించిన నివేదనాపత్త్రమును జదివి విన్పించెను. నాయకప్రవేశమున కదియే సూచన యయ్యెను. ఏలికయగు విలియము ప్రవేశించి నప్పుడుగూడఁ బ్రజలంత యానందతాండవ మొనర్పలేదు.

కనులు మిఱుమిట్లుగొను గెంపువన్నియ యుడుపులం దాల్చి, కంఠమున ధరించిన పుష్పమాలికాసముదయమున శరీరపురోభాగ మంతయు మునుంగువడ, మహాపురుషుఁడగు బాక్స్టలు రంగమున నవతరింపఁ బ్రజలు విలియము ప్రభువరుని, అధ్యక్షుఁడు పఠించిన నివేదనాపత్త్రమును విస్మరించిరి. బాక్స్టలు మహాశయుని దక్షిణపార్శ్వమునఁ బీఠికోపవిష్టయగు నల్లగలువవేల్పును, వామపార్శ్వమున లక్షవరాల ముల్లె మూటయు నరుదెంచెను. బాక్స్ట లామూట నెడనెడఁ జాటు జూపులఁ దివుటమై నాహరించుచుండెను.

సభావేదికపై విలియము భూపాలుని ద్రోసిరాజని కలువ దేవత సింహపీఠమున నాసీనయయ్యెను. కలువ తిరు నాళ్లలో ధరాపాలురకు దిగువ పీటలే! ఇంక నొక్క గడియ సేపటికి విలియము ప్రభువతంసుఁడు వేదిక నధిష్ఠించి యిందీవర స్రష్టయగు బాక్స్టేలు దివ్యనామమును సభ్యులకుఁ గర్ణరసాయనముగ విన్పింపఁగలఁడు. హాలండు దేశమున కిటుల ననుపమాన ప్రతిష్ఠ నార్జించిపెట్టిన యాతని దివ్యనామము చిత్రవర్ణాలంకృత మగు పత్రముపై సువర్ణాక్షరముల లిఖింపఁబడును. ఆతడు సాధించిన నల్లగలువకుఁగూడ నాముహూర్తముననే విలియము నరపాలకుఁడు 'బాక్స్టేలిసీ' యని పేరిడి నామకరణోత్సవము జరుపును.

వరాలమూటనుండియు, నల్లగలువనుండియు బాక్స్టేలు దనచూడ్కుల నెడనెడ దిగిచికొని,జనసమూహమును కలయఁ జూచుచుండెను. ఆ మహాజనశ్రేణిలోఁ, బాటలప్రభ మగు రోజా యాస్యమెచటనైన గన్పించునేమో యని వాని హృదయము గొట్టుకొనుచుండెను. రోజా వానిపాలిటి భూతము. ఆ భూత మచటఁ బ్రత్యక్షమైనచో వానివేడ్క యంతయు మట్టిపాలై పోవు నని యాతఁడు భీతిల్లుచుండెను.

సాధుపుంగవుని తపఃఫలమును, కన్నెమిన్నకుఁ బెండ్లియరణము నగు నల్లగలువ నట్లు దొంగిలించి తెచ్చిన కూళ బాక్స్టేలు, తాను దొంగనన్నమాటయే మఱచెను. ఆ కలువ దుంపను భూమిలో నాటినదాది దానిమీఁదనే చూపునెట్టుకొని, కార్నిలియసు కారాగృహములోని కద్దాని వెన్నంటియేగి హేగునగర వధ్యస్థానముచెంత నద్దానికై పడిగాపులు పడియుండి, దానితోఁగూడ కాస్టనుదుర్గము జొచ్చి, రోజాగదిలో

నది బాటమరించుట గనిపెట్టియుండి, నానాట నది పెరిగి పెద్దదియగుచుండ గుటకల్రుమింగుచు దూరమున నిలిచిచూచి పిదపఁ జెంతఁజేరి తన యూర్పుల వేడిమి నద్దాని కుగ్గుబాలు వోసి, దుదకు దక్కించుకొన్న చిన్నారి కలువ వానిది కాక యన్యులదా! ఇపు డాకలువను వానిచెంతనుండి కైకొనువారే నిక్కంపుదొంగలు.

బాక్సన్ లదృష్టవంతుఁడు కావుననే రోజా యచటఁ బ్రత్యక్షముకాలేదు. వాని యానందము వెల్లివిరిచినది. భాగ్యము పండినది.

మంగళవాద్యములు మధురకలస్వనము లొనర్ప గన్నె పడుచులు నల్లగలువ కారతు లెత్తిరి. తన్ను బరివేష్టించి నిలిచిన యా కన్నియల నైజలోచనకాంతి నపహరించి నల్ల గలువ వారలఁ గలకలనవ్వుచుఁ దలయెత్తికొని సకలజన లోచనపర్వమై నిలిచి, తనయంద లగ్నమైన ప్రజాలోచనము లకు సారూప్యసిద్ధి ననుగ్రహించెను.

## ౨౮

వలయాకృతిగా నున్న తరువాటికామధ్యమున నిట్లు గలువ తిరునాళ్లు ప్రవర్తిల్లుచుండఁ గార్నీలియసును గొని తెచ్చు శకట మా ప్రక్కనున్న బాట వెంబడినే తెంచెను. ఉత్సవ దర్శనకుతూహలమున నేతెంచి, చెట్లచాల్పులో నుండి వెలు పలికిఁ దఱుమబడిన పిల్లల గుంపు లడ్డముగ నిల్చుటచే బండి యొకింత నిలువవలసివచ్చెను. అపుడు కార్నీలియసచ్చటి జన కోలాహలమును, వాద్యధ్వనులును విని యచ్చెరువంది,

డెకెను దళవాయి బదులుసెప్పునో సెప్పడో, యని సంశ యించుచునే "యా సందడియేమి" యని ప్రశ్నించెను.

డె : కన్పించుచునే యున్నదిగదా! ఉత్సవము.

కో : నగరాధి దేవతకుఁ దిరునాళ్ళు సల్పుచుండి రేమో? ఎచటఁగాంచినఁ బూలమొత్తములు గనులపండు వౌనర్చుచున్నవి.

డె : నిజమే. ఈయుత్సవము పుష్పప్రధానమే.

కో : బాపురే! యేమి చిత్రవర్ణములు! ఏమీ దివ్యసౌరభ ములు!

డెకెను వీరోచిత మగు జాలిపెంపున, "బండి నించుక నిలుపుము. ఈతఁ డావేడ్క నవలోకించు నేమో పాపము!" అని శకటచోదకు నాజ్ఞాపించెను.

కో : (సవిచారముగ) వలదు వలదు. నే నా వేడ్కలు వీక్షింపఁజాలను. బండి సాగిపోనిండు.

డె : నీ యిష్టము. నీకుఁ బూవు లనినఁ బ్రాణ మనియు, అందును నేటి యుత్సవమునకు నిమిత్తమగు సుమము నీ కత్యంతాభిమానస్థాన మనియు వింటిని గాన, పోనిమ్ము చూచెద వేమో యని, నిలుపు మంటిని. బండి సాగ నిమ్మురా.

కో : అది యేమి పూవో ?

డె : కలువ.

కో : కలువయా! ఆ జరుగునది కలువతిరునాళ్లా!

డె : అగును. కాని నీ కవ్వేడ్క నవలోకింప నిచ్ఛలే దంటివికదా ! మనము సాగిపోవుదము.

అనుచు బండివాని నాజ్ఞాపింపఁబోవఁ గోర్నీలియ

సాతని వారించి, గద్గదస్వరమున "బహుమానమును నేడే యిచ్చెదరా యేమి?" యని యడిగెను.

డె: అవును నల్లగలువకు నేఁడే బహుమానము——

కార్నీలియసు శరీర మాపాదమస్తకముగఁ గంపింప, ఫాలమునఁ జెమ్మటలూర; వేచినిలిచి, "అక్కటా! నావలెనే యీ ప్రజలందఱు భగ్నాశులగుదురుకదా! అచ్చపు నల్లగలువను వీక్షించు భాగ్యము లేదు వీరలకు" అనియెను.

డె: అట్లనుచుంటివేల?

కొ: (మరల బండిలోఁ గూలబడి) నల్లగలువను సాధించినవారొక్కరుమాత్రమే కలరు? వారు నాకుఁ బరిచితులే. ఆనల్లగలువ యిచ్చటికి వచ్చుట పొసగదు.

డె: మీరు పొరపడుచున్నారు సుఁడీ! మీ రెఱింగినవారే తెచ్చిరేమో కాని నల్లగలువమాత్ర మిచ్చట నున్నది. ఆచేరిన ప్రజలెల్ల నిపుడు దానివంకనే చూచుచున్నారు.

కొ: "నల్లగలువనా? ఏదీ, యేదీ! యెచ్చట నున్నది." అనుచు శకటగవాక్షములోనుంచి వెలుపలికి సాగి తిలకింపఁ దొడఁగెను.

డె: అల్లదే సింహాపీఠముపై; కన్పించినదా?

కొ: కన్పించినది.

డె: ఇంక మన మేగుదము. తిన్నగాఁ గూరుచుండుఁడు.

కొ: వలదు, వలదు, ఒక్కక్షణ మాగనిమ్ము. అన్నా! నీకుఁ బుణ్యముండును. బండి పోనీకుము. నన్ను మరల నొక్కసారి చూడనిమ్ము. ఏదీ? ఏదీ? ఆ కన్పించునది నల్లగలువయేనా? అచ్చంపు నల్లగలువయేనా? ఏమో? నేను నమ్మఁజాలను. అన్యుల కదియెట్లు సాధ్యమగును?

అం దేదో లోపముండవలయును. మీరు దిన్నగా బరిశీలించితిరో? లేదో? ఇంచుకమైన వర్ణసాంకర్య ముండక మానదు. లేదా, యది బూటకపు రంగైనఁ గావలయును. అక్కటా! నే నైనచో నందలిమోసము నిట్టె గ్రహింతుఁ గదా! అయ్యో! నన్ను బండి దిగనిండు. మిమ్ము వేడికొందును. న న్నొక్కపరి దానిచెంత కేగనిండు.

డె: నీ కేమైనఁ బిచ్చియా! నిన్నెటులఁ బోనిత్తును?

కొ: నా యన్నవుగా, నిన్ను బతిమాలు కొందును.

డె: నీవు ఖైదీ వను మాట మఱచుచుంటివి.

కొ: మఱవ నన్నా! మఱవను. నేను ఖైదీనయ్యు నీతిమాలిన వాఁడగాను. సత్కులప్రసూతుఁడ నగు నేను మాటదప్పను. నన్ను నమ్ముము. పూవు నొక్కసారి చూచివచ్చెద, నంతియ పాఱిపోను.

డె: కావచ్చును, కానీ నే రాజాజ్ఞ నెట్లతిక్రమింపఁగలను? బండి సాగనిమ్మురా!

కొ: (మనల నాతని నాపి) అన్నా! అన్నా! నీకు మ్రొక్కెదను. సుంత దయవహించి నా కీవరి మొసంగితివా, నా ప్రాణము లీకొంచెముసేపు నిలుచును. అక్కటా! ఆసన్నమరణు డగు నీ దీనునిపై నీకు జాలిలేదా? నే నెంత బాధ పడుచుంటినో, నాయంతస్తాపము నీకెఱుఁగ రాకున్నది. ఆ కలువ యింతకు నాదియే యగుచో, రోజా గోలుపోయిన నాకలువయే యగుచో నది — దైవమా! యిక నేమున్నది! అక్కటా! నన్ను బండి దిగనిండు. నేనద్దానిఁ జూడకమాన; పిమ్మట నన్నుఁ

జంపినఁ జంపుదురు కాని, ముందు నే నా కలువను జూచితీరవలయును. చూడకమానను.

డె: ఊరకుండుము. అభాగ్యుడా! యూరకుండుము. అల్లదే మా ప్రభుఁ డేతెంచుచున్నాఁడు. మిన్నక బండిలోఁ గూర్చుండుము. ఈ గందరగోళము ప్రభుని కంటఁబడెనా, నీకు సరేకదా, నాకును మానప్రాణములు దక్కవు.

డెకెనుగూడఁ దన నిమిత్తమై యాపద్మగ్నుఁడగు నన్న భీతిచే గొర్నీలియసు బండిలో నొదిగి కూరుచుండెను. అటుల నొక్కక్షణమైనఁ గూరుచుండెనో, లేదో, యంతలో మరల మనసు నిలుపఁజాలక తొంగి చూచెను. అశ్వారూఢులగు నంగరక్షకులతో విలియము శకటముపై నేగుచుండెను. ఇంటి వరవిషయికమైన ప్రకటనాపత్రము హస్తమునఁ దాల్చి, శాంతగంభీరదర్శనుఁడై యట్లు సభాస్థలమున కేగుచున్న భూపాలునిఁ గాంచి, కొర్నీలియసు మూకసంజ్ఞల నాతని వేడికొనఁజొచ్చెను.

విలియ మాతనిదైన్యముం గాంచెను. బండిలోనున్న డెకెను దళవాయినిగూడ గుర్తించెనేమో! తనశకటము నాపి "ఏమిది?" యని ప్రశ్నింప, డెకెను బండి దిగి, చెంతకేగి, "ప్రభూ! తమ యానతిచొప్పున కాస్టను దుర్గము నుండి నావెంట గొనితెచ్చిన రాజద్రోహి యీతఁడే" అని విన్నవించెను.

విలి: ఆత డేటి కట్లాతురపడుతున్నాడు?

డె: బండి నిలుపుట కనుజ్ఞ వేడుచున్నాడు.

కొర్నీలియసు చేతులు మొగిచి, "ప్రభూ! నే నాకలువ నించుక చూడవేడెదను. దాని నొకసారి తిలకించి నాసందియము దీర్చుకొందును. పిమ్మట దమచిత్తము. నన్ను జంపవలసినచో జంపవచ్చును. నా సాధించిన సత్కర్మఫలమును, తన్మహామహిమను, ఒక్కసారి కనులజూచికొన నిచ్చిన దమయనుగ్రహమును గీర్తించుచు నీదేహమును విడుతును. నాకీ వర మనుగ్రహింపుడు" అనుచు బ్రార్థింపనొచ్చెను.

ఆవల నాబండిలో బరిజనపరివేష్టితుడై సింహాసన మధిష్ఠింప నేగు భూపాలకుడును, ఈవల నీబండిలో శృంఖలాబద్ధుడై వధ్యశిల నధిష్ఠింపబోవు దీనుడు—నిరువురు నిట్లు నిలిచి సంభాషించుట దలపోసిచూడ నెంత వింతగానున్నది!

సహజనిశితవీక్షణముల గొర్నీలియసు నరయుచు విలియ మాతని విన్నప మాలకించి, సైనికునితో "కాస్టను కోటలో జెఱకావరిపై దిరుగబడి, చంపబోయిన ఖైదీ యితడే కదా?" యని ప్రశ్నించెను.

ఈ వార్త లప్పుడే విలియము కెట్లు దెలియవచ్చెనో! ఇక నేమున్నది! కొర్నీలియసు లజ్జాభయములచే వెలవెలబోయి, నిట్టూర్చుచు దలవంచికొనెను. తన కిక జీవితాశ లేదు నరికదా, యీ తుదికోర్కెయు సిద్ధింపదని హతాశుడై, తన నిర్దోషిత్వమునైన విన్నవించుకొనక, అమాయికమగు శిశువుపోల్కి గ్రుక్కుమిక్కనక యూరకున్న కొర్నీలియసును గాంచినంత, మహానుభావుడును, కరుణాంతరంగుడు నగు ప్రభువతంసునకు గనికరము జనించెను. "బండినుండి యీతని దింపి, కలువను జూడనిండు. కలువ యందఱికి దర్శనీయమే" అనియెను.

కొర్నీలియసు పరమానంద వివశుడై, "మహాప్రసాదము, ఆయుష్మంతుడా! పరమానుగ్రహము!" అనుచు బండి మెట్లపై దూలిపడుచు డిగుచుండ, డెకెను, వెంటనే యాతని నిలిపి పట్టుకొనెను గాని లేనిచో విలియము కాతడు సాష్టాంగ మెరగెడివాడే.

విలియ మంతట బండి సాగనిచ్చి, సభాస్థలమున కేగి, ప్రజలు జయవెట్టుచుండ సింహాపీఠ మధిష్ఠించెను. వెను వెంటనే భేరికాభాంకృతులు, శతఘ్నికాభాంకృతులు నొక్కుమ్మడి మిన్నుముట్టెను.

౨౯

నలువురు సైనికులు జనుల నొత్తిగిల జేయుచు ముంగు నడువ గొర్నీలియసు సభాస్థలి కరుగుచు, చూపులు గలువ మీదనే నిలిపి, ప్రతిపదప్రవృద్ధ మగు నుత్కంఠతో సద్దాని జేరబోయి, యాఱుగజముల దవ్వున నిలిచెను. కటువుదీఱ నయ్యసమానపుష్పమును దుదిచూపు చూచుకొనెను. దాని తీరు తీయములు దనివిదీఱ గ్రోలెను. చెలిమికత్తెలునా బరి వేష్టించియున్న కన్నియల మధ్యమున గొలువున్న యయ్యకలంక పుష్పరాజ్ఞిం గాంచి, పరిణతము లగు తత్సౌందర్యసౌభాగ్యముల నరసిన కొలంది నాతనికి సంతాప మధికము గాజొచ్చెను. తన సంశయము దీర్పగల మానిసికై నలువంకలఁ గలయ జూచెను. అన్నియుఁ గ్రొత్త మొగములే. అందఱి దృష్టులు సింహాసనాసీనుడై యున్న ప్రభువుమీఁదనే.

విలియ మంతట లేచి నిలిచి, సౌమ్యగంభీర వీక్షణములఁ బఱపి, ప్రజాసమూహముం గలయజూచెను. అతని యెదుట మూడు మూలల ముప్వురు నిలిచియుండిరి. అందొక మూల

నిలచిన భాక్తులు కాలవిలంబన మోర్వని చూడ్కులఁ గలువను, వరాలమూటను, ప్రభువును, ప్రజలను బర్యాయమున వీక్షించు చుండెను.

రెండవమూలఁ దనచూడ్కులు, మనస్సు, ప్రాణములు నాత్మయు గలువమీదనే నిలిపి, కోర్కెలియను నిట్టూర్పులు విడుచుచు మిన్నక నిలిచి యుండెను.

మూడవ కోణమున నించుక మెట్టనేలపై హార్లెమునగర కన్యకలమధ్య రోజా నిలిచియుండెను. జరీయంచులు వైచిన కెంపు వన్నియ గాగరా ధరించి, పైడి పూవుల కుళ్లాయిపై సరిగ మేలిముసుగు దాల్చిన యా లావణ్యసీమ, రాజాంగ రక్షకులలో నొకని కేలూఁతగాఁ గొని, నేత్రమీనము లిటునటు నీదులాడ సొమ్మసిలి నిలిచి యుండెను.

అట్లు నిలిచియున్న మువ్వురను విలియము నిపుణముగా నరసి చూచి, చేతిలో నున్న పత్రమును విప్పుచు, సుస్పష్టము లగు గంభీరవాక్కుల వింజమాఁకీడినట్లై, ప్రజ వినుచుండ శాంతముగ నిట్లు వచించెను.

"మన మందఱ మిచట జేరిన కారణము సువిదితమే. నల్లగలువను సాధించిన వారికి లక్షవరాల నొసగుదు రని ప్రకటింపఁబడెను.

"పుష్పప్రియసంఘపరీక్షకుఁ దాళిన నల్లగలువ, యిదే, సాధింపబడి మన యెదుట నిలిచి యున్నది;

"దీనిని సాధించిన మహాపురుషుని నామ మీ నగరేతి హాసమున శాశ్వతమై నిలుచును.

"నల్లగలువను సాధించిన వా రెవరో ముందునకు రండు"

అనుచు, మూడుమూలల నిలిచియున్న ముగ్వురి మోములను విలియ మొక్కసారిగా బరీక్షించి చూచెను.

బాక్సలు, ముందుకు దుముకుచు, వచ్చుట నాతఁ డర సెను. కొర్నీలియ యొక్కసారి అప్రయత్నముగ ముందున కూగి నిలుచుట వీక్షించెను. తుదకుఁ దన యంగరక్షకుఁడు రోజాను ముందున కల్లన ద్రోసకొని వచ్చుచుంట గనుగొనెను.

రోజా యటుల నెదుటి కే తేరగనే విలియమున కిరు వైపుల నుండియు నొక్కటే కేక రెండు గొంతులనుండి వెల్వడెను. నిర్విణ్ణతచే బాక్సలు, సంతోషసంభ్రమములచే గొర్నీలియను నొక్కసారిగా "రోజా! రోజా!" యని యఱచిరి.

విలియము "కుమారీ! ఈ కలువ నీదే కదా!" యని యడిగెను. తన సౌందర్య విలాసములను బ్రజ తెప్పుఁడక కాంచి, మెచ్చుకొనుచుండ నా యెలనాగ "చిత్తము, ప్రభూ!" అని గద్గదకంఠియై వచించెను.

కొర్నీలియను "రోజా! కలువ నెవరో దొంగిలించి రని రోజా నన్ను వంచించెగదా! ఈ యబల కోట విడిచి యేగిన దింతలకా! నా ప్రాణమే నన్నిట్లు వంచించెనే" అనుకొను చుండెను.

బాక్సలు "అయ్యో! ఇక నే మున్నది?" అని నిట్టూర్చెను. విలియము "తన్ను సాధించినవారి పేరనే యీ కలువ ప్రసిద్ధి కెక్కుఁగాక! ఈ కలువకుఁ గన్నియకు గూడ 'రోజా బార్లీని' అని నామకరణ మొనర్చుచున్నాను."

అనుచుండగనే యొక పసుచువాఁడు, ఆనంద విశ్వాస ములు దొలఁకు జూపులఁ దన నూత్న వధువును, దయానిధి యగు నేలికను గాంచుచు, నడుగులు దొట్రిలుచుండఁ బర్వునఁ

జెంతఁజేర, విలియ మాతని హస్తములం దా కన్నియ హస్తమిడెను. కోర్నీలియసు గనులు మోడ్చి, తనకీ మేలు నేకూర్చిన పరమేశ్వరుని ధ్యానించెను.

ఆ క్షణముననే, బాక్స్టను హతాశుఁడై, హారిసేనమహాశయుని పాదముచెంతఁ గట్టెయై, విఱుచుకొని పడెను.

ఆతని పాటు గాంచి, చెంత నున్నవారు తత్తఱపడుచు నాడిఁ బరీక్షించి, యూపిరి యరసి, పెదవులు విఱిచిరి. అట్లు మరణించిన మానిసి, తన పొరుగింటి బాక్స్టనుగాఁ బోల్చికొని, కోర్నీలియ సాశ్చర్య చకితుఁడై "ఈతఁ డింతటి మాయావి యగునే!" యని వగచెను.

ప్రభువు, నత్యాశుఁడను వాని మరణము నించుకయు గణింపక, మంగళవాద్యములతో నటనుండి బయలుదేఱిరి. రోజా కోర్నీలియసులు చెట్టలు వట్టికొని, సకలజననయనోత్సవ మొనర్చుచు మధ్యభాగము నలంకరింప నూరేగింపు విలియము విడిదిచెంత కేగి నిలిచెను.

విలియ మంతటి వరాలముల్లె గేలఁ జూపుచు గోర్నీలియసుతో నిట్లు వచించెను. "ఈ ధనము మీ యిరువురలో నెవరు గడించిరో నిశ్చయింపఁజాలము. నల్లగలువ రహస్యము నీవు సాధింప, నియ్యబల యద్దాని బెంచి, పెద్దజేసి, పుష్పింపజేసెను. కావున నీ ద్రవ్యము రోజాకుఁ బెండ్లి యరణముగా నిచ్చుట న్యాయ్యముకాదు."

ఈ మాటలు వినుచున్న కోర్నీలియసు ప్రభుని యాంతర్యమెట్టిదో యని యక్కజంపడుచుండ విలియము మరల నిట్లు చెప్పఁ దొడగెను.

"కష్టపడి గడించుకొన్నది గాన ఈ ద్రవ్యము రోజాకే

యొసగుచున్నాము. వలసినచో నయ్యాబలయే నీ కీ ధనము గాను- యుడుగాక. ఈ ముద్దరాలి యకలంక ప్రణయ ధైర్య సారళ్యముల కిది బహూకృతి. ఇక నీ విషయమంటివా? రోజా పుణ్యమా యని నీ నిర్దోషిత్వము తెల్లమైనది కావున –

అనుచు, గోర్నీలియను డివిట్టు వ్రాసిన లేఖ నాతని చేతి కొసంగి, "నీ వకారణముగా బద్ధుడవైతి వని స్పష్టమైనది. కావున నిన్ను బంధముక్తు నొనర్చుటయే కాదు; మా కోశమునం జేరిన నీ యావత్సంపదయు నీ కొసంగితిమి. కోర్నీలియసు వాన్ బారలు మహాశయా! కోర్నీలియసు డివిట్టుకు ధర్మపుత్రుడవు, తత్సోదరునకు మిత్రుడవు నగు భాగ్యము నీకు లభించినది. అం దొక మహనీయుని మైత్రీగౌరవముల కర్హుడ వనిపించు కొందువుగాక అని కోరుటకంటె నీ కింకేమి ప్రియ మొనర్పగలము? అన్యాయముగా బ్రజల క్రోధాగ్ని కాహుతియైన డివిట్టుసోదరులు పరమపూజ్యులు. ఆ యకలంక దేశభక్తుల దివ్యనామములు మా ప్రజకుం బ్రాతస్స్మరణీయములు."

ఇట్లు వచించునపుడు, స్వభావముచే నౌత్సుక్యదూరుడగు నా ఱేని కంఠమున గాద్గద్యము వొడమెను.

పిమ్మట దనయెదుట మోకరిలిన నూత్నదంపతులకు జెఱియొకచేయి యందీయ వా రవ్వాని ముద్దుగొనిరి. అంత నా నరపాలుడు నిట్టూర్పుచు "ఎంచిచూడ, నింతకు మీరే ధన్యులు. కలువలకు గ్రొత్తవన్నెల మప్పుట దక్క నితరచింత లెఱుంగని మీ సుఖమే సుఖము. మన దేశమునకు మీ బోంట్లచే లభించునవియే నిక్కపుం గీర్తివైభవము లేమో!" అనుచు, ఫ్రాన్సు దెసనుండి యలమికొని వచ్చు విపన్మేఘముల

గాంచుచుండెనో యన నా దేశముదెస నవలోకించుచు, శకటారూఢుడై తరలిపోయెను.

రోజాకోర్నీలియసు లానాడే బయలుదేఱి, డ్యాన్సునగరమున కేగి, స్వగృహము ప్రవేశించిరి. వృద్ధధాత్రిచే రోజా తన తండ్రికి శుభవార్త నంపించెను. కోర్నీలియసు గొట్టిన దెబ్బలింకను మానక యొడ లంతయుఁ గదుములుగట్టియున్న కతన దొలుత నా వృద్ధుడు, నూత్న జామాతపై బ్రియముంపడకున్నను, బాధ తగ్గినకొలది గ్రమముగా గ్రోధమును మఱచెను. అది యటులుండ పలినవారికే యనుగ్రహము వచ్చినపుడు తానేల యనుగ్రహింపఁ గూడ దనియు సమాధానపడి కూతునింటి కేగెను.

అచట బూలమడులపైఁ బెత్తనము దాల్చి, యెలుకల బారినుండి పూలమొక్కల బ్రోచుచు, బూవులపై బ్రాలు భృంగకులము గాంచి యానందించుచు నాతడు చరమకాలము వెళ్లద్రోసెను.

౧౬౭౪ వ సంవత్సరమున నొక కుమారుడును, మఱుసటియేట నొక కూతురును, బూవులు జనించు వసంతకాలముననే రోజాకు జన్మించిరి. ఆ యిల్లాలికి శరీరలావణ్యముతోపాటు నానాటికి బుద్ధిపాటవముగూడ బెంపొంద నిజాపత్యములకు దానే విద్య నేర్పసాగెను. కొమరునకు గోర్నీలియసనియు, గూతునకు రోజాయన్నియు పేర్లు పెట్టికొనిరని వేఱె చెప్పబని లేదు.

కోర్నీలియసు రోజాను, గలువలనుకూడ నేమఱక, యిల్లాలిని సుఖపెట్టుచు, కలువలసౌభాగ్యము బెంపొందించుచు జిరతరమగు యశము నార్జించు కొనెను.

కొర్నీలియసు డివిట్టు తనపేర, నట్లు వ్రాసిన లేఖను తా నానాడు రోజాపేర వ్రాసిన యంతిమేచ్ఛాపత్రమును బంగారు పటముల బొదిగి, తమ యింటికి కవి ముఖ్యాలంకారములుగా, దమ యిలువేల్పులుగా నెల్లవారికి జూపెట్టెడివాడు.

రోజా, ముసిముసి నవ్వులు నెమ్మోము నందగింప, "నన్ను వలచి వలపించిన యందగాని, మీవయసువాని జేపట్టు మంటిరి గదా, తుద కిట్లు చేసిరేమి?" అని మేల మాడ, నాతడు "వగలాడీ! పెండ్లియే యాడనంటివి కాదటే నీవు?" అని మాఱువలుకుచుండును.

కలువకు నూతనాలంకారములు సమకూర్చుచు, రోజాను సిగపూవుగా నరసికొనుచు, సపత్నీకలహములు మాన్పి, పుడమిపై దమకాపురమే కాపురముగా బెద్దయుంగాలము ప్రజారాధన మొనర్చె నాతడు.

గ్రోషియసు కొట్టను చెఱనుండి పాఱిపోవు నపుడు తన గది గోడపై వ్రాసిపోయిన పంక్తులను గొర్నీలియసు స్మరించుకొనుచు, మరల బాక్స్టెలువంటి దుర్మత్సరులు తనపై నసూయవహింప కుండుటకో యన నిజగృహద్వారముపై నా సుభాషితములు మలపించెను:—

"పడ్డ వారికి జేటు వాటిల్ల దెప్పుడు"
"కష్టమ్ము లందక కలదె సౌఖ్యమ్ము"

సమాప్తము.